గ్రంథకర్త యితర రచనలు

కాంట్ పరతత్త్వవాదం
ప్లేటో అనుకరణవాదం
తెలుగు లిపి సంస్కారం
తోలుబొమ్మలు
ఆదర్శశిఖరాలు
కీలుబొమ్మలు
జఘనసుందరి
కావ్యజగత్తు
యుగసంధ్య
చైత్రరథం
వరూథిని
సునీథ
STUDIES IN KALĀPŪRNÔDAYAM

ఆర్యనాగార్జునుని

# విగ్రహవ్యావర్తని

డాక్టర్ జి. వి. కృష్ణరావు

సాహితీ కేంద్రము

తెనాలి

# నివేదనము

తత్త్వశాస్త్రము చదువ దొరకొన్న క్రొత్తలలోనే నాగార్జునుని దర్శనముతో నాకుఁ బరిచయ మేర్పడినది. నాఁడా దర్శన మంతగా న న్నాకర్షింప లేదు. కాని యే డెనిమి దేండ్ల క్రిందట రష్యన్ విద్వాంసుఁడు షర్బట్స్కీ వ్రాసిన "ది కన్సెప్షన్ ఆఫ్ బుద్ధిస్ట్ నిర్వాణ" యను గ్రంథము గాకతాళీయముగాఁ జదువుట సంభవించెను. నాఁ డాదిగా వివిధ గ్రంథాలయములకుఁ బోయి ప్రసన్నపదా సహితముగా మూల మాధ్యమకకారికలు, భవసంక్రాంతిసూత్రవృత్తి, మాధ్యమకవింశతి, చతుఃస్తవము, ప్రతీత్యసముత్పాదహృదయము, రత్నావళి, విగ్రహవ్యావర్తని వ్రాసికొని వచ్చి వాని నన్నిటిని ననువదించితిని. ఈ చేసిన శ్రమ మంతయుఁ జేయ నట్లే యయ్యెను. అనువాదము లన్నియుఁ నపహృతము లయ్యెను. దీనితో నాగార్జునుని యజాతవాదము మఱియొక సారి యనుభవమునకు వచ్చినది.

ఈ సంఘటనమునకు మున్ను పత్రికలు మాధ్యమకవింశతిని, విగ్రహవ్యావర్తనీ పద్యములను బ్రకటించి యుండుటచే నివి రెండును మిగిలినవి. తిరిగి మూలకారుని వ్యాఖ్య ననువదించి విగ్రహవ్యావర్తనికి నా లఘు టీకను జోడించితిని. షర్బట్స్కీ కృతిని జదువకున్నచోఁ బ్రకృత గ్రంథము వెలువడి యుండెడిది గాదు. కావున నీ ప్రాచార్యునకు సర్వథా కృతజ్ఞుఁడను.

విగ్రహవ్యావర్తని కారికాకృతి. కారికాఛందస్సునకు శ్రీకారము పెట్టినవాఁడు నాగార్జునుఁడు. అనువాదకుఁడీ విషయము విస్మరింప నవకాశము లేదు. మూల మార్యలలో నున్నది. ఆర్యకుఁ దెనుఁగున సన్నిహితమగు పద్యము కందము. కాని దీనికి నియమములు మెండు. ఇందు శాస్త్రార్థ నిబంధన మంత సుకరము గాదు. కావున ననువాదము గీతము నాశ్రయించినది. రెండు మూఁడు చోట్ల నీ నియమము పరిత్యక్తమయ్యెను. ఇద్దానికి హేతువు పరిశీలకులకు సుబోధమే కాఁగలదు.

ఇంక ననువాదము : నీ తైనంత వఱకు మూలమునందలి పదముల విడనాడ కుండుటయే లక్ష్యము. దీనిని బురస్కరించుకొని యర్థ్యో పట్టుల లఘుటీక వ్రాయవలసి వచ్చినది.

విగ్రహవ్యావర్తని ప్రాకరణిక గ్రంథము. మాధ్యమకదర్శనము, దానిపై వెలువడిన విమర్శనములు నెఱుంగని వారికీ గ్రంథ మర్థ రహిత మగును. అట్లగుటచే మాధ్యమకవాద సంగ్రహము, అర్ష దార్శనిక విమర్శన ములు ప్రస్తావితము లైనవి.

ఈ విధముగాఁ బ్రకృత గ్రంథ మవతరించినది. ఇద్దాని రచనమునకుఁ దోడ్పడిన గ్రంథము లా యా పట్టుల నుదాహృతములు. ఇంక నిందలి గుణావగుణములకు నిర్లిప్తు లగు పండితులు ప్రమాణము.

విగ్రహవ్యావర్తనికిఁ బరోచన యనుగ్రహించిన శ్రీ వేలూరి శివరామశాస్త్రి గారికిని, ముద్రిత రూపము నిచ్చిన శ్రీ కొసరాజు మాధవయ్య గారికిని, పాఠక దర్శన భాగ్యము గల్పించిన శ్రీ యం. చలపతిరావు గారికిని గృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

తెనాలి,
24—11—58

జి. వి. కృష్ణరావు.

# ప్రరోచన

శ్రీ జి. వి. కృష్ణరావుగారు, తెనాలి.

మీ విగ్రహవ్యావర్తని చదివితిని — ఓహో!

ఎన్నో యేండ్లనుండి ఎన్నో లక్షలమంది నాగార్జున-కొండ త్రవ్వుచునే యున్నారు; ఏవో తీయుచునే యున్నారు. మీరు నాగార్జునశైలము నొకచేతనే యెత్తి లోపలి విజ్ఞానమును పైకి తీసినారు.

పిదప,—గ్రంథమొక యెత్తు; అంకితమొక యెత్తు.

చిరివాడ,
5-11-58

వేలూరి శివరామ శాస్త్రి.

# అంకితము

## పండిత గోపదేవ్ గారికి

మును పౌళనాఁడు కొండొకవిబోధము విత్తితి వీ హృదంతర
మ్మున; నది కాలకంధర సముద్ధతి గర్జిలినన్ విషోగ్ర వ
ర్షణ మొనరించిన న్నిలిచి చల్లఁగ సారము సంగ్రహించి యీ
దినమున కిట్లు పొల్చినది దృష్టి మరల్చుచు బోధి వృక్షమై.

" అంతేవాసి మదీయుఁ డిప్పటికి నింతైనాఁడుగా!" యంచు నీ
స్వాంతంబందునఁ బొంగిపోయెదవొ ? " ఛీ ! చార్వాక హేవాకినీ
సంతానాంతర చారణుం డితఁడు సంశానింప దుర్దాంత వే
దాంతుం డైనను చెప్పఁ డోపఁ " డని చింతాక్రాంతిఁ దాపింతువో ?

తెలియను గాంచె నేని గురు దేవుల చిత్తము; చిత్త శుద్ధితోఁ
దెలిపెద నొక్క మాట: నలుదిక్కులు నింపి తలంపుఁ గాగడా
వెలుఁగులు, గానిపించిన నవీన శివార్థము, భద్ర ముద్రణా
కలిత, మిదంత నార్థన నిఘాతము దెచ్చితిఁ గాన్క పెట్టఁగన్.

“ఏరా, శారులు ప్రేలెదేమిటికి? మున్నీ వాద మేసాఁడో తూ
ర్వారం బట్టరో యక్షపాద మునులున్, వాత్స్యాయనుల్, వార్తిక
ప్రారంభుల్, మఱి బాదరాయణులు, భాష్యార్థ ప్రణేతల్, త్రయీ
సారగ్రాహులు జైమినీయులు, మహా శైవాగమ స్థాపకుల్.

“ప్రాప్త సమాధి యైన యొక వాదము నాస్తిక మిట్లు తెచ్చి సం
తప్తము భూత ధాత్రికి ఘనాఘన మియ్యది యందువే? మహా
గోప్తవు వప్తవున్, సుజన కోటి తపః ఫల సంభవుండ, విం
శాప్తులు వేఱుగాఁ గలరె? యాగమముల్ మఱి వ్యర్థ బోధముల్!”

అనుచుం జివ్వున మీర లవ్వలి మొగంబై నిల్చు రూపంబు భా
వనలోనం గనుఁగొందు; జిచ్చు వడి లిప్త ల్గొన్ని యొట్లో గమిం
తు; నహో స్వప్న జగ ద్విలోకిత మహా దుష్టార్థ సంజాత కం
పన మాత్రం బని నాకు నేనుగ సమాశ్వాసంబు ప్రాపించెదన్.

వాద శంఖము నొత్తి వాత్స్యాయనుఁడు శూన్య
వాదమ్ము నేరీతి నూఁదివైచె?
యుక్తి వాగుర లొడ్డి యుద్యోతకారుం డ
జాత వాదము నెట్లు జజ్జరించె?
చండ వాగ్దండంబు జళిపించి భట్టార
కుం డెట్లు శూన్యమ్ము కొమ్ము డులిచె?
గిరిలోన దుముక శంకించి శంకరుఁ డెట్లు
మాధ్యమకమ్ము సంభ్రాంతపఱిచె?

ప్రాప్త సర్వ సమగ్ర శాస్త్రార్థ రాశి
తాను గ్రహియింపఁ డేమి సత్యమ్ము నింత?
విశ్వ కల్యాణ విరచనా విహిత బుద్ధి
మూఢ వాద లోభమునఁ దా మునుఁగు నేమి?

ఏవం విధ సంభావన
గావింపఁగ నైన హృదయకర్ణిక కాంతి
శ్రీ వాసించును; గ్రమ్మఱ
వ్యావర్తన మందు నర్తకాంగన పోలెన్.

తాదృక్కల్ప వికల్పనా కలిత సంత్రాసోద్ధురోత్కంబులన్
యోధారంభుల మాదలించి, విపులోద్యోగంబుతో శాంతికిం
బాదు ల్వెట్టి, యధీత శాస్త్ర నిధి, కామ్నాయోక్తి సంచారికిన్,
వేధో మూర్తికి విన్నవింతు నతినై నృత్యన్నిజార్థుండనై.

వ్యాసుల పేరు సెప్పి గురుపాదులుగా వినుతించి యున్న స
న్న్యాసులు భాష్య కారులు యథామతి తత్త్వముఁ జిత్ర చిత్ర వి
న్యాసము సేయరేమి? మహితాత్ములు వారికి శిష్యతా విని
ష్కాసన మాచరించె నొకొ సాత్యవతేయుఁడు సన్మహాత్ముఁడై?

ఇది రమ్య, మిది యరమ్యం,
బిది ధర్మ్యం, బిది యధర్మ్య మిది యుచ్చం, బీ
యది నీచం బను తలఁపునఁ
బదరక గ్రహియించు లోక బాంధవుఁ డర్థిన్.

అది యటు లుండనిండు, భవ జార్తి విధూనన జీవ రోదన
ప్రదర విబోధితుల్ వర కృపాపరతంత్రులు నిత్య సత్య స
త్పద హిత బుద్ధులై బుధులు వ్రాసిరి చూపిరి శాస్త్ర మర్థమున్;
సదయత వాని నెల్ల వెదఁజల్లిరి లోకములం గృతార్థులై.

తాదృశ శేముషీ ఘనుల ధన్యతముండు గలండు శూన్యతా
వాదన బోధ పుష్కలుఁడు, భ్రాంత జగజ్జన జాల జీవన
శ్రీదుఁడు, తత్త్వ విత్తరుణ శీత మయూఖుఁడు, భేద వాద ని
ర్భేదన భద్ర కుంజరుఁడు విస్మయ కారణ కార్య ధుర్యుఁడై.

దుర్జయ దర్శన గ్రథన ధూర్వహాన ప్రథితుండు వాఁడు నా
గార్జున నామధేయుఁడు, ప్రకంపిత రూఢ విమూఢ శాస్త్ర చిం
తార్జునుఁ, డాంధ్ర దేశ సుకృతార్జిత నిర్జర నిర్ఝరమ్ము; త
త్తర్జన భర్జనల్ మొరసె తద్ధిమిత ధ్వని కాల భూములన్.

చెదరెన్ మూఢ విపక్ష పక్షములు, విచ్చెం జాత్యహంకార దు
ర్మద మోహమ్ములు, వ్రస్సెఁ బ్రాక్తన విచార ప్రక్రియా సేతువుల్,
ప్రిదిలెన్ శాశ్వత వాద బోధన మరాళీ స్వైర సంచార స
మ్మదముల్, ఛేదిలెఁ బూర్వ దర్శన సమామ్నాతార్థ హృత్క్రోడముల్.

సత్యము చూపి చెప్పి భవ జాతము ప్రోవఁగఁ గొన్న వైదికా
దిత్యులు శోచ్యులై యపవదించిరి గర్వపుఁ బొల్కు లొత్తు పాం
డిత్యముతోడ నాస్తికపు డిండిమ భట్టని వాని; నాత్మ సా
హిత్యము లంత కోరి హరియించిరి తత్కృతి కర్మ భూమిలోన్.

తీవ్ర కిరణమూఁ గాక యాదిత్య తేజ
మడరి హరియించు నేమి నీహార గిరుల?
పూజ్య తన్నగ భాగమ్ము భోట భూమి;
అందు నిల్చె నాగార్జు నాహ్వయుని కృతులు.

అట్లధివసించి నాకు సంప్రాప్త మైన
వానిలో నొక్క కృతి నాంధ్ర భాష వ్రాసి
నాఁడ నా బుద్ధి కెక్కు చందంబు నెఱపి.
విశ్వ కల్యాణ పథము రూపించుకొఱకు.

ఈ విధమైన సచ్చరిత మీ కృతి; దీనిని స్వీకరింపఁగా
నీవె మహార్హణుండ; వది యెట్లన దర్శన షట్కమాంధ్ర భా
షా వినిస్సృత మయ్యె విలసద్భవదీయ నిరాగ శేముషీ
ప్రావృష లక్ష్మి; దేవ, కవి బాంధవ, దీనిఁ బరిగ్రహింపవే!

# ప్రస్తావన

అనిరోధం బయి, యప్రభావ మయి, యప్రాప్త ప్రణా శాసనా
తనమై, నైక బహుత్వ మై, యగమ మై, త్యక్తాగమం బై, యపే
క్షణ సంజాతము నై, ప దోపశమ మై జానొందు భద్రమ్ముఁ జూ
పిన సంబుద్ధునకున్ బ్రువాణ పతి కర్పింతున్ నమోవాకముల్.

—మూలమాధ్యమక కారికలు

వాఙ్మయమున ఋకారమున కున్న స్థానమే భారత చరిత్రయం దాంధ్రులకున్నట్లు నేఁడు వెలువడుచున్న చరిత్ర గ్రంథములనుబట్టి యనుమానింప వలసి వచ్చుచున్నది. కాని ప్రపంచ సంస్కృతికి, భారత తత్త్వశాస్త్రమునకు నాంధ్రులు చేసిన సేవ, యిచ్చిన దోహదము అనల్పము, అవిస్మరణీయము. ప్రపంచ సాహిత్య వనవాటిలో బృహత్కథా గాథాసప్తశతులు దివ్య పారిజాతములు. తత్త్వ క్షేత్రమున ఆర్య నాగార్జునుఁడు, ఆర్య దేవుఁడు, భావ వివేకుఁడు, దిఙ్నాగుఁడు, ధర్మకీర్తి విత్తి పెంచి ప్రోది సేసిన బోధివృక్షముల యంట్లే ప్రవృద్ధము లై టిబెట్టు, మంగోలియా, చైనా, జపాను దేశములయందలి జిజ్ఞాసువులకు జ్ఞానమూలికలను బ్రసాదించినవి. ఆర్ష దర్శనాభినివిష్టులకు వాత్స్యాయన భాష్యము, కుమారిలుని వార్తికములు సంసేవ్యములు. ఇట్లే సంస్కృతికి, విచారధారకుఁ దోడ్పడిన మహామహుల పేళ్ళ నెన్నేని గ్రుక్క ద్రిప్పుకొనకుండఁ జెప్పవచ్చును. కాని తమ జాతి కీర్తి ప్రతిష్ఠలను నిలఁబెట్టిన మహాపురుషుల పుస్తకముల నామముల నేని, సిద్ధాంతముల నేని, ప్రపంచ చరిత్రలో వాని కున్న స్థానము నేని యాంధ్రు లైనను గ్రహింపక పోవుట శోచనీయము.

ఆర్య నాగార్జునుని దర్శనమే యిందులకుఁ దార్కాణము. ఆంధ్ర ప్రజానీకమునకు నాగార్జునుని కొండ యెక్కడ నున్నదో, అచట దొరకుచున్న శిథిలావశేషము లెట్టివో దెలియును. కాని యీ ప్రాంతమునకుఁ బ్రఖ్యాతి చేకూర్చిన మహాత్ముని చరిత్రము గాని, కృతులు గాని, యతని భావముల విలువ కాని, తత్సిద్ధాంత ప్రబుద్ధ దేశ నామములు గాని, తత్సిద్ధాంత ప్రతిపాదిత నవ్య ప్రపంచ సమస్యా పరిష్కార హేవాక మార్గములు గాని యాంధ్రులెఱుంగరు. ఎఱిఁగి యున్నచో నిప్పుడు నాగార్జున సాగరము పేరితో నిర్మింపఁబడుచున్న 'ప్రాజెక్టు'నకు నంది కొండ ప్రాజెక్టను పేరు పెట్టవలయు నను నూహా మేని వారికిఁ బ్రారంభ దశలోఁ గలిగియుండెడిది గాదు.

సంఖ్యకు భారత దేశమున దర్శనములు పెక్కులు వెలువడినను, యుక్తి సహము లగు నవి మూఁడు మాత్రమే. మొదటిది మాధ్యమక వాదము, రెండవది విజ్ఞానవాదము, మూఁడవది యద్వైతము. మొదటి దర్శనమునకు ఆర్య నాగార్జునుఁడు నాందీ కారుఁడు కాకపోయినను ఆయనయే దానికి శాస్త్రీయ రూపము నిబంధించెను. ఆర్యదేవుఁడు, బుద్ధపాలితుఁడు, చంద్రకీర్తి, శాంతిదేవుఁడు దానిని విశదీకరించిరి. ఐరోపా ఖండమున కాంటు పరతత్త్వవాద మావిర్భవించి జర్మనీ దేశమును విచార ధారతో స్నిగ్ధము గావించి, వివిధ తాత్త్విక వాదముల మోసులెత్తించెను. దానివలెనే మాధ్యమక వాదమును భారతమున జిజ్ఞాసను రేకెత్తించి యనేక వాదములకు జీవము పోసినది. స్వాతంత్ర మాధ్యమక వాదము, విజ్ఞాన వాదము, మాధ్యమక యోగాచారము, సౌత్రాంతిక యోగాచారము, నద్వైతము మున్నగాఁగల వాదము లన్నియుఁ బ్రత్యక్షముగా మాధ్యమక వాదము

నుండి యుత్పన్నములు గాకపోవచ్చును గాని దాని ప్రభావము లవ లేశ మేని వానిపైఁ బడలే దని నిరాకరింప నవకాశము లేదు.

అంతే కాదు; నాగార్జునాచార్యుఁడు తన ప్రతిభా విశేషముతో సాపేక్షతా వాదమును క్రీ. శ. 1-వ శతాబ్దమందే తొలకరింపఁ జేసి యిరువదవ శతాబ్దమందలి ఐన్‌స్టీన్ మహాశయుని వాదమును ముందుగానే యూహింపఁ గలిగెను. ప్రపంచ మొక భావ మని (Idea) ప్రతిపాదించిన హెగెల్ సిద్ధాంతమును సూక్ష్మముగాఁ గాకున్నను స్థూలముగా నైన నీ యాచార్యవరుఁ డూహించి ఖండించెను.

రెండవ దగు విజ్ఞాన వాదమునకు దిఙ్నాగ ధర్మకీర్తులు సుస్థిర రూపము సమకూర్చిరి. వీరి తర్క ఘాటికిఁ బ్రాచీన న్యాయము బీటలు వాఱి నవ్య రూపము సంతరించె నన్న, వీరి ప్రతిభా సంపద యెట్టిదో యూహించికొన వచ్చును.

ఈ రెండు దర్శనములను నెలకొల్పిన వారు మొత్తము మీఁద నాంధ్రులే. కాని వారి నీ నాఁడు సగర్వముగా సంస్మరించు నాంధ్రు లెంద ఱున్నారు? నిక్కముగా వారి వాదములు తెలిసిన వారు గూడ సంఖ్యావిధేయులే. ఇట్టి దుఃస్థితి యెట్లు దాపరించినది? భాష్యమునకు వివరణమో, భాషానువాదమో వ్రాసిన ఆ యా వ్యక్తులు మా యాంధ్రులని సగర్వముగా జెప్పికొనుచున్నాముగాని, స్వతంత్ర సిద్ధాంతములతోఁ బ్రపంచమునకు వెలుఁగు బాటలు చూపి జాతి వర్ణ భేదములతో నిమిత్తము లేని సామాజిక వ్యవస్థకై పాటుపడిన మహామహుల నామముల నైన స్మరింపలేక పోవుచున్నాము.

ఈ స్థితి యత్యంత శోచనీయము. ఏ జాతి యైన, ఏ దేశ మైనఁ దన ప్రాచీన చరిత్రను, సంస్కృతి వికాసము

నెఱుంగక వర్తమానము నర్థము చేసికొనఁ జాలదు. కావున నాంధ్ర దేశ చరిత్రలో, భారత సంస్కృతీతివృత్తములో, మానవ తత్త్వాన్వేషణములో విస్మృత మైన యొక ఘట్ట మిచట దిఙ్మాత్రముగాఁ బ్రదర్శింపఁబడనున్నది. అది నాగార్జునుని మాధ్యమక వాదము. ఈ వాద గుణావగుణములు, సార తాసారతలు, ప్రాము ఖ్యాప్రాముఖ్యములు సింహావ లోక నానంతరమే నిర్ణయింపఁదగినవి కాని, మున్నుగాఁ జెప్పఁ దగినవి కావు. మాధ్యమక వాద స్థాప నాచార్యుఁడు ఆర్య నాగార్జునుఁడు. ఈయన జీవిత చరిత్రము తొలు దొలుతఁ బరిశీలింప వలయును.

## జీవిత చరిత్ర

భారత దేశ చరిత్రలో మహాపురుషుల కృతులు దెలియ వచ్చినంత నిశ్చితముగా వారి జీవిత విశేషములు దెలియవు. ఇందులకుఁ గొంఁది యపవాదము లుండిన నుండ వచ్చును. అంత మాత్రమున దీనిని బూర్తిగాఁ ద్రోసిరా జనరాదు. మహాకవి కాళిదాసుని కృతులు సుపరిచితములు. కాని యతని జీవిత విశేషము లిప్పటి వఱకుఁ దెలియవు. కాకున్నఁ జరిత్ర కగ్రాహ్యములగు కట్టుకథలు, నభూత కల్పనలు ననేకము లుండ వచ్చును.

ఆర్య నాగార్జునుని చరిత్రము నిట్టిదే. కాని యీ చరిత్ర కథనము మఱి యొక మెట్టు పైకెఁ బోయినది. "వాస్తవముగా నాగార్జునుఁ డను వ్యక్తి పుట్టలేదు. అది కేవల మొక కల్పిత నామ," మని వ్రాసిన వా రున్నారు. కాని నాగార్జునుని కొండ యొద్ద బయల్పడిన పురా వస్తు సామగ్రినిబట్టి యతఁడు కల్పిత వ్యక్తి కాఁడని తేలిపోయినది.

ఇఁక నాగార్జునుఁ డను వ్యక్తి యొకరా యనేకులా అను ప్రశ్న పొడమినది. కొందఱ తఁ డొకఁడే యనిరి. మఱి కొందఱు ఇద్దఱనిరి. వేఱొక కొందఱు ముగ్గు రనిరి. ఇంకఁ గొందఱు బుద్ధిమంతులు నాగార్జునుల సంఖ్య నైదింటి వఱకుఁ బెంచిరి. మొత్తము మీఁదఁ జెప్ప వలయు నన్న ఆచార్య నాగార్జునుఁ డొక వ్యక్తి. సిద్ధ నాగార్జునుఁడు వేఱొక వ్యక్తి. వీ రిరువురుఁ గాక యా పేరితోనే తాంత్రికాచార్యులు మఱొక రున్నారని చరిత్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇచ్చట జిజ్ఞాసితవ్యుఁడు మాధ్యమక దర్శన ప్రవర్తకుఁ డైన యార్య నాగార్జునుఁడే. ఇతఁ డెప్పటి వాఁడో తేల్చికొన వలయును. కుమారజీవుఁ డను నాతఁడు క్రీ. శ. 405 ప్రాంతమున నాగార్జున చరిత్రమును చైనా భాషయందుఁ బరివర్తించెను. కావున నీ యాచార్యుఁడు క్రీ. శ. 405 నకు ముందే జీవించియుండ వలయును.

కుమారజీవుఁడు రచించిన జీవిత చరిత్రమునుబట్టి యీ క్రింది విశేషములు దెలియవచ్చుచున్నవి :—

నాగార్జునుఁడు పుట్టుకచే బ్రాహ్మణుఁడు. దాక్షిణాత్యుఁడు. అతఁ డనతికాలములోనే నాలుగు వేదములు సకల శాస్త్రములు క్షుణ్ణముగా నెఱింగెను. అణిమాద్యష్ట సిద్ధులు సాధించెనఁట. వాని ప్రభావమున నతఁ డదృశ్యుఁడై సంచరించెడివాఁ డఁట. ఆ సిద్ధుల మహిమచే నతఁడు ముగ్గురు మిత్రులతోఁ గలిసి యంతర్ధానముఁ బొంది రాజాంతఃపురమునకు రాక పోకలు సాగించుచుండె నఁట. ఇట్లుండ రాజభటులొక నాఁ డాతనిని మిత్ర సహితముగాఁ బట్టుకొని రఁట. ఈ గండము గడచి పిండము బయటఁ బడిన బౌద్ధ భిక్షువు నయ్యెద నని యాతఁడు మ్రొక్కుకొనియెనఁట. రాజే కారణము వలననో యతని మిత్రుల ముగ్గుర నురితీయించి నాగార్జునుని మాత్రము వదలెనఁట.

తాను ప్రొక్కుకొనిన యట్లే యతఁడు బౌద్ధ భిక్షుత్వము స్వీకరించి తొంబది దినములలోఁ త్రిపిటకములు చదివి వానితోఁ దనివి సనక సూత్ర గ్రంథముల కొఱకన్వేషణమును సాగించెనఁట. తుదకు హిమాలయావాసి యగు నొక భిక్షువువలన మహాయాన సూత్రములు, సర్పరాజగు నాగరాజ నామకునివలన వాని భాష్యము సంపాదించెనఁట. కృతదీక్షుతో నతఁడు దక్షిణదేశమున బౌద్ధమత ప్రచారము సాగించుచు మూఁడు వందల సంవత్సరములు జీవించినట్లు కుమారజీవుఁడు వ్రాసియున్నాఁడు.

"అట్లుకాదు, అయ్యాచార్యులు 600 సంవత్సరములు జీవించిర"ని భోట దేశస్థులు చెప్పుచున్నారు. సిద్ధవిద్యయందేకాక నాగార్జునునకు రసవిద్య, వైద్యశాస్త్రము, ఖగోళశాస్త్రము, రత్నశాస్త్రము మున్నైనవానిలోఁ గూడ విశేష నైపుణ్యమున్నట్లు కుమారజీవుని రచనము దెల్పుచున్నది.

ఈ పేర్కొనఁబడిన విషయములనుండి పుక్కిటిపురాణములను దిగవిడచినచో మిగులు విషయములు మిక్కిలి తక్కువ. నాగార్జునుఁడు దాక్షిణాత్యుఁడు. వివిధ శాస్త్ర పారంగతుఁడని మాత్రము దెలియవచ్చుచున్నది. వింటర్‌నిడ్జ్ మొదలైనవా రతఁడు విదర్భవాసి యనియు, క్రీ. శ. 2వ శతాబ్దపు టుత్తరార్ధమున నుండెననియు నంగీకరించుచున్నారు. శ్రీపర్వతమునం దీయాచార్యుఁడు వసించెననియు, నాగార్జునుకొండయొద్ద బౌద్ధ విశ్వవిద్యాలయమును, అమరావతికి జీర్ణప్రాకారోద్ధారమును నిర్వహించెననియు, నాఁటి శాతవాహన చక్రవర్తి యతనికి మిత్రుఁడనియు, సుహృల్లేఖ నీ చక్రవర్తికే వ్రాసెననియుఁ జరిత్రజ్ఞులు చెప్పు

చున్నారు. సుహృల్లేఖ నా కాలమున నాబాలగోపాలము పరమ పవిత్రగ్రంథముగాఁ బారాయణము చేయుచుండెడిదని చైనా యాత్రికుని వ్రాఁతవలనఁ దెలియుచున్నది. ఈ పుస్తకమునకు మూలము మాత్రము లభించుట లేదు. టిబెట్టు చైనా భాషలయందలి యనువాదములు నేఁటికి నిలిచియున్నవి. ఈ యనువాదముల కాంగ్లానువాదములు ఇండియన్ యాంటిక్వరీ 16 వ సంపుటిలోను, పాళిటెక్స్టుసొసైటీ జర్నల్ (1886) లోను బ్రకటితము లయ్యెను.

నాగార్జునుఁడు దక్షిణాపథమందలి వేదలివాసి యను విషయమును

దక్షిణాపథ వేదల్యాం భిక్షుః శ్రీమాన్ మహా యశాః।
నాగాహ్వయః స నామ్నా తు స దస త్పక్ష దారకః॥

(పే. 280, శ్లో. 165)

అన్న శ్లోకమున లంకావతారము స్పష్టముగాఁ బేర్కొనుచున్నది. అతఁడు విదర్భవాసియే యగుచో నా విషయ మీ శ్లోకము పేర్కొని యుండవలయును. అట్లు పేర్కొనుటకు ఛంద మడ్డు పడదు. ఇంక నీ వేదలి యెక్కడ నున్నదో పరిశీలింప వలయును. చరిత్రజ్ఞులు తలఁచుచున్నట్లిది విదర్భ ప్రాంతమునందలిదే యగుచో నాగార్జున కృత మైన రత్నావళియందలి వక్ష్యమాణ విషయములకుఁ జారిత్రకులు సమాధానము చెప్పవలసియున్నది.

నాగార్జునుని కాలమున మహాయానము తీవ్ర నిందకుఁ బాల్పడుచుండెను.*

---

* అత్యౌదార్యాతిగాంభీర్యా ద్విపక్షై రకృతాత్మభిః।
నింద్యతేఽద్య మహాయానం మోహాత్ స్వపర వైరిభిః॥ (4-79)

నాఁటి పరిపాలకుఁడును మహాయాన ప్రతికూలుఁడుగా గోచ రించుచున్నాఁడు.*

ఇట్టి సందర్భమున విదర్భ దేశమునుండి వచ్చిన వ్యక్తికి తెలుఁగు నడిగడ్డలో బౌద్ధ విశ్వవిద్యాలయమును స్థాపించుటకు, అమరావతికిఁ బ్రాకారాదులు తిరిగి నిర్మించుటకు నెట్లు సాధ్యపడును ? ఎచటినుండియో వచ్చిన వ్యక్తి యంత పలుకుబడి, ప్రజా సహకారము సేకరించుట దుష్కరము గాదా ? తత్త్వ శాస్త్ర నైపుణ్యమే యీ మాత్రపు పలుకుబడిని సంపాదించె ననుట కవకాశము లేదు. విశేషించి మహాయాన మానాఁడు నలు మూలలనుండి నిందింపఁబడు చుండెను. కావున నాగార్జునుఁడు గుంటూరు కృష్ణా గోదావరి ప్రాంతముల వాఁ డనుట కవకాశము గన్పించుచున్నది గాని, విదర్భవాసి యనుట కవకాశము కానిపింప కున్నది.

తాత్త్విక రంగమున నాఁడు నాగార్జునునకుఁ బ్రాతి కూల్య ముండెను. రాజు నాతనికి విముఖుఁడే కాని సుము ఖుఁడు గాఁడు. మఱి యతఁ డెట్లు ప్రజానురాగము సంపా దింపఁ గలిగెను ? ఏదో యొక తీరున నాతఁడు ప్రజలకు మిక్కిలిగాఁ దోడ్పడి యుండవలయును. ఆ తోడ్పా టెట్టిది? తత్త్వ నిరూపణము, ధర్మపన్నములుఁ బ్రజల నంతగా నాకర్షించి యుండు నన వీలు లేదు. కావునఁ గుమార జీవుఁడు పేర్కొనిన నాగార్జునుల వైద్య శాస్త్ర పారంగ తత్వము యథార్థము గావచ్చును. ఆ నైపుణ్యముతో నతఁడు ప్రజలకు సేవచేసి వారి యనురాగముఁ బొంది బౌద్ధ విశ్వవిద్యాలయాదికము నిర్మించి యుండవచ్చును.

---

* ధర్మాధికారా యే చాస్యై పూర్వ రాజ ప్రవర్తితాః।
దేవద్రోణ్యాదయ స్తేఽపి ప్రవర్త్యంతాం యథా స్థితాః॥ (4-18)

ఇంక నాగార్జునుని కాలము నిర్ణయింపవలసి యున్నది. సుహృల్లేఖ, రత్నావళి యనెడి కృతులు రెండును సాత వాహనరాజు నుద్దేశించియే వ్రాయఁబడిన వని చరిత్రకారు లందఱు నంగీకరింతురు. కాని యవి యే శాతవాహన రాజు నుద్దేశించి వ్రాయఁబడెనా యను ప్రశ్నమునకు సమా ధాన మన్వేషింప వలసి యున్నది. నాగార్జునుఁడు క్రీ. శ. 2-వ శతాబ్దమందుండె నని చెప్పువారు ఆ గ్రంథములు గౌతమీపుత్రయజ్ఞశ్రీ నుద్దేశించి వ్రాయఁబడిన వందురు. కాని రత్నావళినిబట్టి నాఁటి రాజు మహాయానమునకుఁ బ్రతికూలుఁడుగా గోచరించు చున్నాఁడు. విశేషించి యీ మతమం దాతనికి ద్వేషము గూడఁ గానిపించుచున్నది. కావుననే యతఁడు దేవద్రోణ్యాద్యుత్సవముల నిషేధించెను. నాగార్జునులు రాజునకు హితము గఱపుచు "బుద్ధుల వచనము నెఱుఁగ సుఖము గాదు. కావున నుపేక్షచే నేకయాన త్రియానోక్తమునుండి యాత్మను రక్షించుకొనునది. ఉపేక్ష పాపము గాదు. ద్వేషము వలనఁ బాపము దక్క శుభము గలుగఁ జాలదు. కావున నాత్మకాములు మహాయానమును ద్వేషింపఁ జనదు," అని స్పష్టముగాఁ జెప్పెను.*

యజ్ఞశ్రీకి మహాయానమందు ద్వేష మున్నట్లు చరిత్ర చెప్పుటలేదు. దీనికిఁ దోడు నాగార్జునుఁడు సూచనప్రాయముగా నిరసించిన కీర్తి కాముకత్వము గూడ నితనిలో నంతగాఁ గనిపించుటలేదు. నాగార్జునుఁడు పేర్కొ

---

*"తథాగతాభిసంధ్యోక్తా న్యసుఖం జ్ఞాతు మిత్యతః ।
ఏకయాన త్రియానోక్తా దాత్మా రక్ష్య ఉపేక్షయా॥
ఉపేక్షయా హి నాపుణ్యం ద్వేషా త్పాపం కుతః శుభమ్ ।
మహాయానే యతో ద్వేషో నాత్మకామైః కృతోఽర్హతి॥"
(4, 88, 89)

నిన లక్షణము లన్నియు గౌతమీపుత్ర శాతకర్ణియందే గోచరించు చున్నవి. అతఁ "డేక బ్రాహ్మణుఁడు," "ఏకాంకుశుఁడు," "ఏక శూరుఁడు," "త్రిసముద్ర తోయపీత వాహనుఁడు," "వినివర్తిత చాతుర్వర్ణ్య సంకరుఁడు" అని శాసనము పేర్కొనుచున్నది. ఇది యిట్లుండ నీ కాలమును సమర్థించు విషయము మఱియొకటి యున్నది. 'దశ సాహస్రికా ప్రజ్ఞాపారమిత' క్రీ. శ. 148 లోఁ జైనా భాషయం దనువదింపఁ బడినట్లు చరిత్రకారులు చెప్పు చున్నారు. పారమితలకుఁ బ్రాముఖ్యము, ప్రాచుర్యము నాగార్జునుని కృతులవలన నేర్పడినదే కాని యంతకుమున్నే యేర్పడెనని యూహింప నవకాశము లేదు. ప్రయాణ సౌకర్యములు నికృష్టముగా నున్న యా కాలమున నొక పుస్తకము భారతమునఁ బ్రసిద్ధినొంది యది చైనాకుఁ బ్రాఁకి యా పుస్తక మచటఁ బరివర్తితము గావలయు నన్న నేఁబది యిఱువది సంవత్సరము లేని పట్టును. కావునఁ గ్రీ. శ. 1 వ శతాబ్దిలో నాగార్జునుఁ డున్న నుండవచ్చు ననుట నిరాధారము గాఁజాలదు. ఇదియే నిజమగుచో నప్పటి శాతవాహన చక్రవర్తి గౌతమీపుత్ర శాతకర్ణియే కాని యజ్ఞశ్రీ కాఁజాలఁడు.

ఈ పేర్కొనిన దానికంటె నిర్దిష్టముగా నాగార్జునుఁ డీ సంవత్సరమున నుదయించి యీ సంవత్సరమున నస్తమించె నని యుపలభ్యమాన సామగ్రినిబట్టి తెలుప శక్యము గాదు.

ఇంక నతని జీవిత విశేషములుగూడ నితః పూర్వోక్తములకంటె విశేషముగాఁ జరిత్రవలనఁ దెలియవచ్చుటలేదు. రత్నావళిని జాగరూకతతోఁ బరిశీలించి నపుడు మాత్ర మీ క్రింది విషయము లూహింప వచ్చును. మహాయానము నాగార్జునునకు ముందే యున్నది గాని, యతఁడు గ్రొత్తగఁ

బ్రతిపాదించి ప్రచారించినది గాదు. ఏల యన, "నింద్యే తేఽద్య మహాయానం మోహాత్స్వపర వైరిభి" యని యతఁడు స్పష్టముగాఁ జెప్పుచున్నాఁడు. మహాయానము క్రొత్తగా వెలువడి నిందింపఁబడు చున్నచో నాతఁ డంతగా బాధ పడ నక్కఱ లేదు. క్రొత్తగా నుద్భవించిన దానిని—అందున నతిగంభీరముగా నున్నపుడు—అపార్థము చేసికొనుట యస్వాభావికము గాఁజాలదు. అట్లు కాక యది ప్రాక్తనమై యపోఢ మయ్యేనేని నాగార్జునుని కటకటపాటున కర్థ మేర్పడఁ గలదు. కావున నాయనకుఁ బూర్వమే మహాయానము వెలసి యుండవలయును.

నాగార్జునుఁడు మహాయాన వాది. మహాయాన మా నాఁడు తీవ్ర విమర్శనమునకుఁ బాల్పడుచుండెను. కావునఁ బ్రతివాది ఖండనములనుండి తన వాదమును గాచుకొన వలసిన యావశ్యకత యాతని కేర్పడెను. దానివలన నతఁడు దన మేధా సంపత్తిని బ్రదర్శించి గ్రంథములు నిర్మింప వలసి వచ్చెను. అంతియ కాని యుబుసుపోకకై, జిజ్ఞాసా సమారాధనార్థమై యతఁడు గ్రంథకర్త కాలేదు. తన ప్రదర్శించిన యుక్తులతో సంతృప్తి నొందక మహాయానముపైఁ దొట్రిమొట్ట్రి విమర్శనములు ప్రతిపక్షులు సాగింపఁగా విసివిన నాగార్జునుఁడు భీష్ముఁడై మాధ్యమక దర్శనము "తీర్థిక పశు భయంకర మ"ని విదలించి వైచెను.

ధర్మమునకుఁ దక్క మఱొక లౌకిక శక్తికిఁ దల యొగ్గు స్వభావము నాగార్జునునకు లే దని రత్నావళి చాటుచున్నది. అందీ యాచార్యుఁ డిట్లు వ్రాయుచున్నాఁడు:— "రాజా! సామాన్యున కేని యప్రియ మగు హితము చెప్పి వినిపించుట కష్టము. మఱి రాజులకుఁ జెప్పి వినిపించుట యెంత దుష్కరము? అందునను నీ వతిభౌముఁడవు. నేను

కేవలము సద్భిత్తువను. అట్లయ్యు నే నొక్కఁడనే నీకు మిక్కిలి యప్రియ మైనను బథ్యము చెప్పెదను. నీయందలి స్నేహము లోకమునందలి యనుకంపయు దీనికిఁ గారణములు.” ఇంతే కాదు; మఱి యొక యడుగు ముందునకు వైచి, “మద్య సేవనము పరిత్యజింపుము. దానివలన లోకమునందుఁ బరాభవము, కార్య హాని, ధన క్షయము సంభవించును. అది యకార్య కారణము నగు” నని రాజ దోషము నొత్తి యతఁడు చికిత్సఁ జేయ నుంకించెను.

నాగార్జునుఁడు విచార శీలుఁడే కాక పరైకాంత హిత బుద్ధి యని రత్నావళి వ్యక్తము సేయుచున్నది. “సత్య మన నవిసంవాదకము గాదు; సత్త్వ గుణోద్భూతమును గాదు. పరైకాంత హితమే సత్య,” మని యాయన ముక్తకంఠ ముతో నుద్ఘోషించెను. ఆ బుద్ధినిఁ బురస్కరించుకొనియే నాఁ డాతఁడు కారాగార సంస్కరణములను సూచించెను.

“దుష్టులను సత్పథములకు మరల్చుటయే రాజున కభిలషితవ్యము. అతఁడు ప్రతీకారబుద్ధితో, నధికార ప్రదర్శనాహంకారముతో శిక్ష విధింపరాదు. “న్యాయ పురస్సరముగా దండ ప్రహారాదులు దోషులకు విధింపఁబడినను నీవు కృపాళుఁడవై శిక్షింప వలయును. నిక్కముగా మహాత్ముల కృప కాస్పదు లైన వారు తీవ్రపాపులు, హింస్రులు గాకున్న మఱెవ్వరు? కారాబద్ధులలో శుష్కించు వారినిఁ బ్రత్యహము గాని పంచ రాత్రము గాని విడిచిపుచ్చుము. కారాగార బద్ధులై యున్నంత కాలము వారి స్నానాన్న పానీయము లకు, మందు ప్రమాఁకులకు, వస్త్రములకు, క్షురకర్మమునకు వలయు సదుపాయములు గల్పింపు,” మని యతఁడు రాజునకు బోధించి తన కృపాళుత్వమును జరిత్ర ప్రసిద్ధము గావించు కొనియెను.

ప్రపంచ చరిత్రలో మొట్టమొదటిసారిగా శిక్షాస్మృతి నుండి మరణదండనమును బరిహరింపవలసినదని యార్య నాగార్జునుఁడు ప్రచారము గావించెను. మన స్మృతి పురాణేతిహాసములం దిట్టి సూచన లేకపోలేదు. కాని యది బ్రాహ్మణులకు మాత్రమే పరిమితము గావింపఁబడవలయునని యవి చెప్పుచున్నవి. నాగార్జునుఁ డట్లుకాక మరణదండన పరిహరణ ముత్సర్గము గావలయునని బోధించెను. "లెస్సగాఁ బరామర్శించి లోఁతుగాఁ దెలిసికొని ప్రదుష్టులు, ఘటకులు నైనను నరులను జంపక, పీడింపక రాజ్యమునుండి వెడల నడపు," మని సాతవాహన చక్రవర్తి కీతఁడు ధర్మము వివరించెను.[1] ఆనాఁ డతఁడు చాటిన సంస్కరణములను నేఁటికి నాచరింప లేకపోవుచున్నాము.

"అంధులు, వ్యాధిపీడితులు, వికలాంగులు, అనాథులు, బిచ్చగాండ్రు నవిఘట్టితులై యపరిభూతులై సమముగా నన్నపానములు పొందునట్లు చేయవలయునని యతఁడు రాజధర్మమును ఘంటాపథముగాఁ జాటెను. అర్థింపకున్నను, నన్యరాజ్యసంస్థులై యున్నను గోవిదులగు సత్పురుషుల కనురూప సత్కారములు నెఱపవలయునని యాతఁడు సూచించెను.[2]

దీనినిబట్టి నేఁటి నోబెల్ బహుమానములవంటివాని నేర్పఱుప వలయునని యానాఁడే యతఁ డూహించెనని చెప్పవచ్చును.

---

[1]విమృశ్య సమ్యగ్విజ్ఞాయ ప్రదుష్టాన్ ఘటకానపి।
అహత్వాఽపీడయత్వా చ కురు నిర్విషయాన్ నరాన్॥
(రత్నా. 4. 37)

[2]అనర్థీనా మపి సతాం ధార్మికానామనుగ్రహాన్।
అప్యన్య రాజ్య సంస్థానా మనురూపాన్ ప్రవర్తయ॥
(రత్నా. 4-21).

మత విషయమున నిస్పృహనీయుఁడు సాగించిన ప్రబోధ మాధునిక యుగమునకు శిరోధార్యము. "మత విషయమున సత్యము గ్రహించుట దుష్కరము గావున నుపేక్ష వహించుట మేలు. ఉపేక్ష పాపముగాదు. ద్వేషము పాపము. ఈ ద్వేషమువలన శుభ ముత్పన్నము గాదు. ఆత్మ నాశకులైనవా రుపేక్షచేఁ దమ యాత్మను రక్షించుకొనవలయు," నని నాగార్జునుఁడు సాతవాహనున కుపదేశించెను. దీనినిబట్టి చూడ మత ప్రసక్తి లేని పరిపాలనము నాఁడే యతఁ డూహించి ప్రచారము చేసెనని నిర్ధరింపవచ్చును.

నాగార్జునుని విశిష్టతను జాటు విశేషము మఱి యొకటి యున్నది. నాగార్జునుని కాలమునుండి నేఁటి వఱకును మాధ్యమికులను నాస్తికు లని గర్హించుట యాచారముగా నున్నది. ఇటీవల నొక యద్వైత పండితుఁడు ప్రాసంగికముగా మాధ్యమిక వాదమును గూర్చి ముచ్చటించుచు, "మీరు నాస్తికుల రని మాధ్యమికులను దెగడినప్పుడు నాగార్జునుఁడు గాని చంద్రకీర్తిగాని దానిని నిరాకరింపలే," దని వ్రాసి యున్నాఁడు. ఇది కేవలము సాహస మనక తప్పదు. ఏల యన నాగార్జునుఁడు రత్నావళిలో నిట్లు ఖండితముగా వ్రాసి యున్నాఁడు :—

> లోభ వ్యాపాద నాస్తిక్య దృష్టీనాం పరివర్జనమ్।
> ఏతే కర్మపథా శుక్లాః... ... ... ... ... ॥ (1–9)
>
> నాస్తికో దుర్గతిం యాతి, సుగతిం యాతి చాస్తికః।
> యథా భూత పరిజ్ఞానా న్మోక్ష మద్వయ నిశ్రితః॥ (1–57)
>
> వినాశయతి దుర్జ్ఞాతో ధర్మోఽయ మవిపశ్చితమ్।
> నాస్తితా దృష్టి సమలే యస్మా దస్మి న్నిమజ్జతి॥ (2–19)

ఇట్లు నాస్తికతను బూర్ణముగా నిరసించుటయే కాక నాగార్జునుఁ డీ సమస్య నామూలాగ్రము పరిశీలించి సేతు

వాదుల కెల్లరకు నంగీకార్య మగు నుత్తమోత్తమ పరిష్కారము సూచించెను. అదేమనఁ గర్మమునకు ఫలము గలుగదను వాఁడు నాస్తికుఁడు. ఫలము గలుగు నను వాఁడు ఆస్తికుఁడు.

> సమాసా న్నాస్తితా దృష్టిః ఫలం నా స్తీతి కర్మణః।
> అపు ణ్యాపాయికా చైషా మిథ్యా దృష్టి రితి స్మృతా॥
> సమాసా ద స్తితా దృష్టిః ఫలం చా స్తీతి కర్మణామ్।
> పుణ్యా సుగతి నిష్యందా సమ్య గ్దృష్టి రితిస్మృతా॥ (1-43, 44)

వివిధ మతములకు సమన్వయము గుదిర్చి ద్వేషమును బరిహరింప వలయు నన్న నింతకంటె మేలైన మార్గ మేమున్నది? ఈ నిర్వచనము ప్రకారము చెప్పనలసి వచ్చిన నేఁటి కమ్యూనిష్టులు గూడఁ దాము నాస్తికుల మని చెప్పుకొనఁ గలరా?

నాగార్జునులు జ్ఞాన రూపులు మాత్రమే కాక కార్యశూరులు. శుష్క తర్కములు, క్రియాశూన్యోపదేశములు, మెట్ట వేదాంతములు, కుహనా తపః క్రియలు వారికి గిట్టవు. కావుననే యమ్మహనీయుఁ డిట్లుద్ఘోషించి యున్నాఁడు :- కేవల శరీర తాపనమువలన ధర్మము గలుగదు. పరద్రోహ విరతియుఁ బొడమదు. పరుల కనుగ్రహమును వాటిల్లదు. దాన శీల క్షమా స్పష్ట మగు సద్ధర్మ పథ మంగీకరింపక కాయ క్లేశమంగీకరించి దండ కోత్పథములఁబట్టి పోవువాఁడు క్లేశ వ్యాలావలీఢాంగుఁ డగుచు ననంత జని పాదపము ఘోరము నగు సంసారాటవిని సుదీర్ఘము పొందుచున్నాఁడు.''

> శరీర తాపనా ద్ధర్మః కేవలా న్నాస్తి తేన హి।
> న పర ద్రోహ విరతి ర్న పరేషా మనుగ్రహః॥

దాన శీల క్షమా స్పష్టం యః స్వధర్మ మహా పథం
అనాదృత్య వ్రజే త్కాయ క్లేశ గో దండ కోత్పథైః॥
స సంసా రాటవీం ఘోరా మనంత జని పాదపామ్
క్లేశ వ్యాలావలీఘాంగః సుదీర్ఘం ప్రతిపద్యతే॥

(రత. 1-11, 12, 13)

నాగార్జునునకుఁ దర్శ్వ శాస్త్రమునందు, సాంఘికోద్యమమునందు మాత్రమే కాక సంస్కృత వాఙ్మయమునందును విశిష్ట స్థాన మేర్పడుచున్నది. అతనికిఁ బూర్వము శాస్త్ర గ్రంథములు సూత్రబద్ధములై ధారణ యోగ్యములుగా నుండెడివి. అర్థగ్రహణమునకు వాని భాష్యములు తోడ్పడు చుండెడివి. కాని సూత్ర రచనలో శబ్దలాఘవ మున్నను, సుబోధకత్వము మృగ్యము. భాష్యములలో నర్థసుబోధకత్వమున్నను, ధారణా సౌలభ్యము లేదు. సూత్ర పద్ధతి యందలి శబ్దలాఘవము ధారణా సౌలభ్యము, భాష్య పద్ధతియందలి యర్థ సుబోధకత్వము వివృతి నేకత్రితము గావించుటకు నాగార్జునుఁడు నూతన మార్గ మవలంబించి కారికా రచనమును దొలుదొల్త సంస్కృతమునఁ బ్రవేశపెట్టెను. అతని తరువాతనే యందు కారికా రచనము బహుళ ప్రచారము పొందెను. సాంఖ్యకారికలు, గౌడపాదకారికలు మున్నగునవి నాగార్జునుని రచనములకుఁ బిమ్మటనే వెలువడినవి. కావున కారికా రచనమం దగ్రతాంబూలము నాగార్జునులదే. ఇంతే కాక కావ్య భేదములలో నొకటిగా ధ్వన్యాలోకాదులచేఁ బేర్కొనఁబడిన పరికథకుఁ గూడ శ్రీకారము చుట్టిన వాఁడు నాగార్జునుఁ డేమో!

ఇట్లు వివిధ రంగములం దనల్ప కృషిఁ గావించిన నాగార్జునుని కీర్తి దేశదేశముల యోళ్ళను రోఁకండ్లను బలికినది.

స్వతంత్ర విచారశక్తి యున్న ప్రతిమేధావియు నాగార్జునుని కృతులను భూషించుటయో, దూషించుటయో కావించె నే కాని యౌదాసీన్యము వహింపలేదు. ఉపలభ్యమానములగు గ్రంథములనుబట్టి చూచిన నతని వాదమును భూషించిన వారికంటె దూషించినవారి సంఖ్య మెండు. ఒక విధముగా నతఁడు వివిధ దేశములందుఁ బ్రామాణికత్వము సంపాదించెను. ఇది మఱియొక విధముగా నతని కీర్తి కవరోధమే యయ్యెను. ఏల యనఁ దమ కృతులకుఁ బ్రామాణికత్వము సంపాదింప నెంచి పెక్కురు వాని కర్తృత్వము నాగార్జునున కాపాదించిరి. దానివలన నాగార్జున కృతులను అవిసంవాదకముగా నిర్ణయించుట కష్టము. చైనా త్రిపిటకములలో నాగార్జున కృతములుగా నిరువది నాలుగు రచనలు పేర్కొనఁ బడినవి.

## నాగార్జునుని కృతులు

నాగార్జునుని ప్రధాన కృతు లాఱని బూష్టను పేర్కొని యున్నాఁడు. (1) మూలమాధ్యమక కారికలు, (2) శూన్యతాసప్తతి, (3) యుక్తిషష్టిక, (4) విగ్రహ వ్యావర్తని, (5) వైదల్య సూత్రము — ప్రకరణము, (6) వ్యవహారసిద్ధి.

మూలమాధ్యమక కారికలు :— అద్వైతులకు బ్రహ్మ సూత్రము లెట్లో మాధ్యమకుల కీ కారిక లట్టివి. సంఖ్యలో 448 గా నున్న యీ కారికలు 27 అధ్యాయములుగా విభజింపఁబడినవి. ప్రతి అధ్యాయ మేదో యొక పదార్థమునో, వాదమునో పరీక్షించును. ఈ కారికా కృతికి నాగార్జునుఁడు, బుద్ధపాలితుఁడు, భావవివేకుఁడు, గుణమతి, స్థిరమతి, చంద్రకీర్తి, గుణశ్రీ మున్నగువారు సంస్కృతమున నెనిమిది వ్యాఖ్యానములు రచించిరి. నాగార్జున కృత

మగు వ్యాఖ్య అకుతోభయ యనియు, భావవివేకుని వ్యాఖ్య ప్రజ్ఞాప్రదీప యనియు, చంద్రకీర్తి వ్యాఖ్య ప్రసన్నపద యనియు, దేవశర్మ వ్యాఖ్య శితాభ్యుదయ మనియు నభిఖ్యాతములు. చంద్రకీర్తి కృతమగు ప్రసన్నపద దక్కఁ దక్కిన వ్యాఖ్యలు సంస్కృతభాషా రచితములు నష్టములుగాఁ గానవచ్చుచున్నవి. వీనియొక్క భోట భాషాను వాదములు మాత్రము లభ్యములు. అకుతోభయ వ్యాఖ్య నాగార్జున కృత మగునాయని భోట దేశస్థులును శంకించుచున్నారు.

చంద్రకీర్తి కృత ప్రసన్నపదా సహితముగ మూల మాధ్యమక కారికల మొదటి ప్రకరణమును, నిరువది యైదవ ప్రకరణమును షర్బట్స్కీ యను రష్యను పండితుఁడు ఆంగ్ల భాషయం దనువదించి యున్నాఁడు. అయిదవ ప్రకరణము నుండి పదునాఱవ ప్రకరణము వఱకు షాయిర్ దీనిని జర్మను భాషయందుఁ బరివర్తించెను.

రెండవదగు శూన్యతాసప్తతి డెబ్బదియా అనుష్టుప్పులతోఁ గూడిన గ్రంథము. దీనికి నాగార్జునుఁడు చంద్రకీర్తి, పరహితుఁడు వ్యాఖ్యలు రచించిరి. భోటభాషానువాదములు దక్క మూలగ్రంథము గాని, మూలవ్యాఖ్యలు గాని నేఁడు లభింపకున్నవి. శూన్యతాసప్తతిలోని శ్లోక మొకటి ప్రసన్నపదలో నుదాహరింపఁబడినది.

యుక్తిషష్టిక యను మూఁడవ గ్రంథమున నఱువది యనుష్టుప్పు లున్నవి. దీని మూలము నేఁడు లభించుటలేదు. టిబెట్టు చైనా భాషలయందుఁ గావింపఁబడిన యిద్దాని యను వాదములు మాత్రము నిలిచియున్నవి.

నాలుగవది విగ్రహవ్యావర్తని. నాగార్జునుఁడు దీనికి స్వయముగా వ్యాఖ్యానము రచించియున్నాఁడు. నష్టముగాఁ

దలంపఁబడిన యీ గ్రంథమును సంపాదించి శ్రీయుతులు కె. పి. జయస్వాల్, ఆర్. సాంకృత్యాయనులు బీహారు రీసెర్చి సొసైటీ జర్నలు 22 వ సంపుటిలోఁ బ్రకటించిరి. ఈ ప్రకటనమునకు మున్ను ప్రొఫెసరు తుచ్చి టిబెట్టు చైనా భాషలయందలి యనువాదముల నాధారము చేసికొని విగ్రహ వ్యావర్తనిని ఆంగ్లభాషయం దనువదించి ప్రాగ్దిఙ్నాగ బౌద్ధ తర్కగ్రంథ సంపుటియందుఁ బ్రకటించియున్నాఁడు. మూల మాధ్యమక కారికా రచనానంతరమే నాగార్జునుఁ డీ కృతిని వ్రాసెనని విగ్రహవ్యావర్తనీ వ్యాఖ్యయం దుటంకింపఁబడిన మాధ్యమక కారిక సూచించుచున్నది.

అయిదవ గ్రంథము వైదల్యసూత్రము—ప్రకరణము. దీని భోట భాషానువాదముమాత్రమే నేఁడు లభించుచున్నది. ఈ కృతియందు రచయిత తాను తర్కమును దిరస్కరించు చున్నాఁడను నీలాపనిందను బటాపంచలు గావించె నని తజ్జ్ఞులు చెప్పుదురు.

నాగార్జునుని యాఱవ కృతి వ్యవహారసిద్ధి. ఇందుఁ బారమార్థికముగా ననాత్మత్వము, సాంవృతికముగా వ్యావహారిక ప్రపంచము నుపపన్నములు గావింపఁబడినవి.

పైని పేర్కొనిన వానినే కాక నాగార్జునుఁడు మఱి కొన్ని కృతులను నిర్మించి యున్నాఁడు. వానిలో రత్నావళి యొకటి. దీని కర్తృత్వమునం దెట్టి శంకయుఁ గలుగ రాదు. ఏల యన దీనినుండి పెక్కు శ్లోకములను జంద్రకీర్తియుఁ, బ్రజ్ఞాకరమతియుఁ దమ వ్యాఖ్యలయందతని పేరితో నుదాహరించి యున్నారు. ప్రొఫెసర్ తుచ్చి యీ గ్రంథమునందలి ప్రథమ ద్వితీయ చతుర్థ పరిచ్ఛేదములను రాయల్ ఏషియాటిక్ జర్నల్ (1934-36) లో నాంగ్లాను వాద సహితముగాఁ బ్రకటించెను.

ఎనిమిదవది చతుఃస్తవము. ఇదియు నాగార్జునుని కృతియేయన నెట్టి సందియము లేదు. ఏలయన నిందలి శ్లోకములు గొన్ని ప్రసన్నపదయందు, బోధిచర్యావతార పంజిక యందు నుదాహృతములు. ఇప్పటి వఱకు నీ గ్రంథమందలి నాలుగు స్తవములలో రెండు మాత్రమే లభించినవి. వీనిని ప్రొఫెసర్ తుచ్చి రాయల్ ఏషియాటిక్ జర్నల్ (1932) లో నాంగ్లానువాద సహితముగాఁ బ్రకటించెను. ఆ సంవత్సరము ననే కీ. శే. ప్రభూభాయ్ పటేలు భోట భాషానువాదమును బురస్కరించుకొని యీ నాల్గుస్తవములను సంస్కృతీకరించి ఇండియన్ హిస్టారికల్ క్వార్టర్లీ 8 వ సంపుటిలోఁ (316-331, 689-705 పుటలందు) బ్రకటించెను.

తొమ్మిదవ దగు ప్రతీత్యసముత్పాదహృదయము ఏడార్యలు గలిగిన కృతి. ఆ యీ వ్యాఖ్యలం దుపలభ్యమానములగు రెండు మూఁడు శ్లోకములు దక్కఁ దక్కినవి గానవచ్చుట లేదు. టిబెట్టు చైనా భాషలయందలి యిద్దాని యనువాదములు మాత్రము లభించు చున్నవి. శ్రీ యన్. అయ్యాస్వామి పండితులు చైనా భాషనుండి దీనిని ఆంగ్లమునం దనువదించి కె. వి. రంగస్వామి అయ్యంగారి స్మారక సంచికలోఁ బ్రకటించిరి. ప్రతీత్యసముత్పాదహృదయమునకుఁ జంద్రకీర్తి, యుల్లంఘుఁడు వ్యాఖ్యలు రచించిరి.

పూర్వోదాహృత గ్రంథములే కాక యుపాయహృదయము, మహాయానవింశకము, అబుద్ధబోధకము, భవసంక్రాంతిసూత్రవృత్తి, ప్రజ్ఞాదండము, ధర్మసంగ్రహము అను రచనలు గూడ నాగార్జునుని కృతులుగాఁ జెప్పఁబడినవి. చీనా టిబెట్టు భాషలయందు లభించుచున్న యనువాదములఁ బురస్కరించుకొని యాంగ్లానువాద సహితముగా మహాయానవింశకమును ఆచార్య విధుశేఖరభట్టాచార్యులు

గారును, భవసంక్రాంతిసూత్రవృత్తిని యన్. అయ్యాస్వామి పండితులును సంస్కృతీకరించి ప్రకటించిరి. ఈ కడపటి గ్రంథము నాగార్జునకృతి కావచ్చును. ప్రజ్ఞాదండము నీతి బోధక గ్రంథము. అందు కేవల మాధ్యమక వాదార్థ మేమియు లేదు. కావున నిది నాగార్జునుని కృతి యని నిశ్చిత ముగాఁ జెప్ప లేము. భోట భాషానువాదముఁ బురస్కరించు కొని డబ్ల్యు. యల్. కాంప్ బెల్ దీనిని ఆంగ్లభాషయం దనువ దించి ప్రకటించెను. ధర్మసంగ్రహము బౌద్ధ పారిభాషిక పద కోశము. ఇది మాక్స్ ముల్లర్ సంపాదకత్వమున క్రీ. శ. 1885 లోఁ బ్రకటిత మయ్యెను. వీనినే కాక నాగార్జునుఁడు మహాప్రజ్ఞాపారమితా శాస్త్రము, ద్వాదశభూమివిభాషా శాస్త్రము, ద్వాదశనికాయముఖశాస్త్రము, ఏకశ్లోక శాస్త్రము గూడ రచించె నని చైనా త్రిపిటకములు చెప్పు చున్నవి. ఈ గ్రంథములం దొకటియును, సంస్కృతభాష యందు లభించుటలేదు. చీనాభాషనుండి మహాప్రజ్ఞాపార మితా శాస్త్రమును ఫ్రెంచిభాషయం దనువదించి ప్రొఫెసర్ లామోట్ ఇంతవఱకు రెండు సంపుటులను వెలువరించెను. ఏకశ్లోకశాస్త్రము ఒక చైనా భాషయందె లభించుచున్నది. దీని యాంగ్లానువాదము ఎడ్కిన్స్ వ్రాసిన చీనీస్ బుద్ధిజమ్ అను గ్రంథమునందుఁ బ్రకటింపఁబడినది. దీనిని తిరిగి సంస్కృతీకరించి హెచ్. ఆర్. ఆర్. అయ్యంగారు మైసూరు యూనివర్సిటీ జర్నల్ (1922) ప్రథమ సంపుటి ద్వితీయ సంచికలో వెలువరించిరి.

ఇవి గాక రసరత్నాకరము మున్నైన వైద్య శాస్త్రా దిక గ్రంథములు నాగార్జునుని పేరితోఁ గాన్పించుచున్నవి. వైద్య ముఖమున సేవ సేసి నాగార్జునుఁడు ప్రజానురాగము సంపాదించి యుండె నేని వీని కర్తృత్వముగూడ నాతనిదే

యని భావింప నవకాశ మేర్పడును. ఏది యెట్లున్నను వైద్య శాస్త్రజ్ఞులకు మాధ్యమక దర్శనముతోడను, మాధ్యమక దర్శనజ్ఞులకు వైద్య శాస్త్రముతోడను సాధారణముగాఁ బరి చయము గలుగ కుండుటవలన రసరత్నాకరాదుల కర్తృత్వ మింకను బరిశీలింప వలసి యున్నది.

నాగార్జునుఁడు తన దార్శనిక గ్రంథములను రచింప కున్న నీనాఁ డాతని నంతగాఁ బేర్కొన వలసిన యావశ్యకత లేదు. ఆయన వైద్యగ్రంథములు వ్రాసి యుండవచ్చును. సాంఘిక రాజకీయాభివృద్ధికై పెక్కుభంగులఁ బాటుపడి యుండవచ్చును. అయినను వానికిఁ జారిత్రక ప్రాముఖ్యము దప్ప మఱొక వైశిష్ట్యము లేదు. ఏల యన నీ విషయములం దాధునిక యుగ మభ్యుదయ మెంతయో సాధించి యున్నది. వైద్యరంగమున నెన్నియో నూతన విషయములు వెలువడినవి. అతని రాజకీయ భావములు నాఁ డుత్తమోత్త మములు గాని, నేఁ డవి సర్వ సామాన్యములు. ఇంక నీతని దార్శనిక భావము లట్టివిగావు. విజ్ఞాన శాస్త్రమునందు మనము మిక్కిలిగాఁ బురోగమించి యుండవచ్చును. కృత కోపగ్రహములను భూచంద్రుల చుట్టుఁ బ్రదక్షిణము చేయింప వచ్చును. రేపు కుజగ్రహమునకుఁ బోయి సేద్యము సేసి పంటతోఁ దిరిగి రావచ్చును. నాఁడును నాగార్జునుని దార్శనిక భావము లాలోచనీయములే.

ఇంతకు నాగార్జున దర్శన మేమి చెప్పుచున్నది? అందలి విశిష్టత యేమి?

ఈ ప్రశ్నములకు సమాధానము చెప్పక మున్నొక విషయము గ్రహింపవలయును. అతని దర్శనము సుగమము గాదు. మీఁదుమిక్కిలి యపార్థము సేసికొనుట కవకాశ ములు మెండు. ఈ విషయమును నాగార్జునుఁడే యంగీక

రించుచు మాధ్యమక వాద మతిగంభీర మనియు, నొక పట్టున బోధ పడదనియుఁ జెప్పియుండెను. దుర్భుక్తమైన యన్నము విషమై యెగ్గు కలిగించు నట్లే, దుర్జ్ఞాతమగు మాధ్యమక వాదము ఘోర నీచ స్థితి గలిగించు నని యీ యాచార్యుఁడే హెచ్చరించెను. ఇట్టి యవగాహన క్లేశ ముండుటవలననే వైదిక మతానుయాయులలో నాగార్జున వాద మర్థము సేసికొనిన మనీషులు దాదాపు మృగ్యులుగా నున్నారు. ఈ హేతువువలననే శతాబ్దులనుండి మాధ్యమక వాదము దూషణమునకు గుఱి యగుచున్నది.

## మాధ్యమక వాదము

నాగార్జునుని వాదమునకు, మాధ్యమక వాదము, శూన్యవాదము, అద్వయ వాదము, ప్రతీత్య సముత్పాద వాదము, అజాతవాద మను నవి పర్యాయపదములు. కేవలము శబ్దమునుబట్టి యీ వాదము నర్థము చేసికొనఁ బూనిన నపోహములకుఁ బాల్పడక తప్పదు. భారత దార్శనికు లనేకు లిట్టి యపోహములకు గుఱియై పెడత్రోవలు పట్టిరి.

నాగార్జునుని సిద్ధాంతము యుక్తిపై నాధార పడుచున్నదే కాని, యద్వైతాదులవలె శ్రుతిపై నాధార పడుట లేదు. మఱి యీ యుక్తి పరుల హృదయముల సంస్కరించి యొప్పించుటకొఱకుఁ గాక యెవనికి వాఁడు తత్త్వము గ్రహింప నుద్దేశింపఁబడినది. మాధ్యమక మతమున యుక్తి యాధ్యాత్మిక మైన జుజుత్స.

మానవుఁడు తన జీవితమునందు విభిన్నానుభవములను బొందు చుండును. ఇట్టి యనుభూయమానావస్థలయం దొకప్పుడు వైరుధ్యము గోచరించును. ఆ వైరుధ్యము

గోచరించి నప్పుడే, యేది సత్య మను జిజ్ఞాస యతనియం దంకురించును. ఈ యంకురము తల యెత్తనంత వఱకు నతనికిఁ గనువిప్పు గలుగదు. అప్పుడే యతఁడు విచారణ మున కుపక్రమించును. "అట్లు చెప్పుకొన్న నిందులో నా చిక్కు లున్నవి. ఇట్లు చెప్పుకొన్న నీ బాధ లున్నవి," యని మానవుఁడు తనకుఁ దాను బరామర్శించుకొనును.

ఈ పద్ధతినే మాధ్యమకులు ననుసరింతురు. దీని కే ప్రాసంగిక పద్ధతి యని పేరు. ఈ పద్ధతి కేవల మొక దృక్పథమును గాని వాదమునుగాని నిరాకరింప నుపయోగ పడునే కాని, యొక సిద్ధాంతమును వ్యవస్థాపింప నుపకరింపదు. ఒక వాదము ప్రతిపాదిత మైనప్పుడు దాని నెదుర్కొని యందలి యనిష్టములను బహిర్గతము గావించి దాని మూల మున ప్రాసంగిక పద్ధతి యా వాదమును ద్రోసివేయును. ఇట్లు కావింపవలయునన్న నిరాకరిష్యమాణ వాద విధాన మంగీకరించిన ధర్మములను బురస్కరించుకొని దోషోద్ఘాట నము గావింపవలయును. ఉదాహరణమునకు న్యాయవాద పరామర్శము తీసికొందము. న్యాయసిద్ధమగు ననుమానము చేతనే యాన్యాయ వాదమందలి దోషములను జూపవలయును. ప్రాసంగిక పద్ధతి యీ మార్గమునే యవలంబించును.

ఈ సందర్భమున నొక శంక పొడమవచ్చును. ఒక ప్రతిజ్ఞను మాధ్యమకుఁడు ద్రోసివేసిన, దద్విరుద్ధ ప్రతిజ్ఞ నంగీకరించినవాఁ డగుటలేదా? రాజుగారి పెద్దభార్య పతివ్రతయన్న, చిన్నభార్య పతివ్రత కాదనికదా యర్థము! మాధ్యమకుఁ డీ యర్థము నంగీకరింపఁడు. రాజుగారి పెద్ద భార్య ప్రవృత్తి జ్ఞాతము గావచ్చును. ఆమెను బతివ్రత యనవచ్చును. చిన్నభార్య గుణగణము లజ్ఞాతము లగుటచే నామె వృత్తమును జెప్పకపోవచ్చును. కావున నగ్రమహిషీ

ప్రశంసా మాత్రమునఁ గనిష్ఠ భార్యా గర్హణ ముద్దిష్ట మనుట శాస్త్ర సమ్మతము గాదు. రెండు వస్తువులలో నేదే నొకటి యుండ వీలున్నప్పుడు ఒకటి లేదని తేలినచో విధిగా రెండవది యున్నదని చెప్పవచ్చును. అంతియకాని పెక్కు లుండుట కవకాశ మేర్పడియుండ నొకటిలేదు కాదనినంత మాత్రమున దద్విరుద్ధము నంగీకరించినట్లు దలంపరాదు. ఒక యావు తెల్లనిది కాదని నిరాకరింపఁగా నది నల్లనిదని యర్థముకాదు. అది పుల్లావు కావచ్చును. కాకున్న మైలావు కావచ్చును. లేదా దోరావు కావచ్చును. అట్లే తత్త్వము గూడ బహు విధములుగా నుండవచ్చును గదా! అట్టియెడ నొక ప్రతిజ్ఞను గాదనుట తద్విరుద్ధ ప్రతిజ్ఞ నామోదించుట కాదు. ఉదాహరణమునకు సత్కార్య వాదము నొకఁడు నిరాకరించె ననుఁడు. అంతమాత్రమున నతఁ డసత్కార్య వాదము నామోదించెనని చెప్పరాదు. సత్కార్యవాద ప్రతిషేధము కేవలము తన్నిరాకరణమునే తెల్పునుగాని తద్విరుద్ధమగు నసత్కార్యవాద విధానమును దెలుపదు. ఈ ప్రతిషేధము కేవలము ప్రసజ్య ప్రతిషేధమేకాని, విరుద్ధార్థ విధానము గాదు.

సామాన్యముగా నే విషయమందేని దృష్టులేమి, అభిప్రాయములేమి, వాదములేమి నాల్గు విధముల నుండ వచ్చును. (1) సత్కోటి, (2) అసత్కోటి, (3) సద సత్కోటి, (4) అనుభయకోటి. ఇంతకు మించియుండ వీలు పడదు. ఒకవేళ నున్నచో నవి యీ నాల్గింటిలో నెందో యొకదానియం దంతర్భూతముగాక తప్పదు. కార్యకారణ భావమునఁగూడ నీ నాలుగు దృష్టులే కానఁబడుచున్నవి. (1) సత్కార్యవాదము, (2) అసత్కార్యవాదము, (3) సద సత్కార్యవాదము, (4) తదనుభయవాదము.

మొదటిదగు సత్కార్యవాదము కారణకార్యముల కభేదమును బ్రతిపాదించును. రెండవదగు నసత్కార్యవాదము భేదమును, మూఁడవదగు సదసత్కార్యవాదము భేదాభేదమును, నాల్గవదగు తదనుభయకార్యవాదము కారణకార్య భేదాభేదముల యనుభయత్వమును బ్రతిపాదించును.

మాధ్యమకవాద మీ నాలుగు వాదములను బ్రసంగాపాదముఖమునఁ బ్రతిషేధించుచున్నది.

కారణము గార్యము నభిన్నములని ప్రతిపాదించు సత్కార్యవాద మంగీకరించినఁ గారణము కార్యము నొకటి కావలయును. ఈ పక్షమున నొక వస్తువు తనవలనఁ దానే పుట్టవలయును. కార్యకారణము లొకటియే యయిన ఈ పుట్టుక నిరర్థకము. పైఁగా నీ పుట్టుకకు ఆది కలుగక యనవస్థాదోష మేర్పడును. దోషములు రానిండు పోనిండు. ఇదియే యథార్థము. తత్త్వమట్లున్నది మనమేమి చేయఁగలమని కూర్చున్నచో అన్నభక్షకులను అమేధ్య భక్షకులని చెప్పవలసివచ్చును. వాస్తవమునకు మానవు లన్నము భక్షించుచున్నారుగాని యమేధ్యము భక్షించుటలేదుగదా!

ఈ సందర్భమున సత్కార్యవాది తన యసమ్మతిని సూచించుచు నిట్లడ్డు తగులవచ్చును. "మే మట్లు చెప్పుటలేదు. అభివ్యక్తము గాని దానిని కారణ మనియు, నభివ్యక్తమైన దానిని కార్య మనియుఁ జెప్పుచున్నాము. బీజమునం దంకుర మనభివ్యక్తముగా నున్నది. కావున బీజమును గారణ మనియు, బీజముచే వ్యక్తమైన యంకురమును గార్యమనియుఁ జెప్పుచున్నాము," అని తనవాదమును సమర్థింప వచ్చును.

మాధ్యమకుఁ డిదియు సమర్థనీయము గాదని త్రోసివేయుచు నిట్లు ప్రశ్నించును: "మీ చెప్పిన యభివ్యక్తికి,

అనభివ్యక్తికి భేద మున్నదా లేదా? భేదము లేదందురా యింతకు మున్ను పేర్కొనిన దోషము వెన్నాడు చున్నది. కలదందురా అసత్కార్య వాదు లగుచున్నారు గాని, సత్కార్య వాదు లగుటలేదు. కావున తమ సత్కార్య వాద మాదరణీయము గాఁ జాల" దని పెదవి విఱుచును.

మఱి యసత్కార్య వాద మంగీకరింప వీలగునా? కారణము కార్యము వేఱని నైయాయిక వైశేషికాదుల సిద్ధాంతము. ఇది యథార్థమయినఁ గారణమునకుఁ గార్యమునకు సంబంధ మేర్పడఁ జాలదు. అప్పుడు దేనినుండియైన నేదేని పుట్టవలసి వచ్చును. ఇసుకనుండి తైలము, గండశిలాగుళికలనుండి యంకురములు, వ్రణమునుండి క్షీరము, స్తనమునుండి చీము ప్రాదుర్భవింప వలసి వచ్చును. కావున వివేచనవంతుల కిది సమ్మతము గాఁ జాలదు.

ఈ పట్టున నసత్కార్య వాది తన యసమ్మతి నిట్లు సూచింప వచ్చును :— అయ్యా మీరు తొందర పడుచున్నారు. కారణ కార్యభావము నియమ రహితమని మేము చెప్పుట లేదు. ఏది విధిగా మున్నుండుటవలన మఱొకటి తరువాత కలుగుచున్నదో, ఏది లేక యీ మఱొకటి యుండదో, యా మఱొక దానిని గార్య మను చున్నాము. దేనివలన నియతముగా నుత్తర కాలమునఁ గార్యము గలుగు చున్నదో దానిని గారణ మనుచున్నాము. అంతియ కాని నియమ రహితములుగా నున్న వస్తువులకు కార్యకారణ భావమును మేము చెప్పుట లేదు. కావున మీ దూషణము మా వాదమునకు వర్తింపదు."

మాధ్యమకావతార కర్త యైన యాచార్య చంద్రకీర్తి దీని నిట్లు ప్రత్యుత్తరించుచున్నాఁడు:— ఏవం విధ కార్య కారణ వాదిని ఈ విషయ మడుగ వలయును, వరి

మొలకకు వరిగింజయే కాని, గురిగింజ కారణము గాదు. వరిగింజకు వరి మొలకయే కాని గురివెంద కార్యము కాదు. ఈ రూపముతో నున్న యీ నియమము దేనివలనఁ గలుగుచున్నది ? యని ప్రశ్నించిన, ప్రతివాది "నియమము గనిపించు చున్నది," గావున నని సమాధానము చెప్పును. "ఈ నియమ మేల కనిపించు చున్న"దని తిరిగి ప్రశ్నింప నాతఁడు "నియమము కనిపించు చున్నది. కావున నున్నది" యని ప్రత్యుత్తరము చెప్ప వచ్చును. ఇట్లు చెప్పుట యన హేతువును దెలుపక పోవుటయే. కావున నసత్కార్య వాది కిచటఁ బూర్వోక్తదోషము పరిహరింప శక్యము కాదు." ఈ విధముగా నసత్కార్యవాద మంగీకార యోగ్యము గాదు.

మఱి సదసత్కార్య వాదము సమంజస మగునా ? ఈ వాదము ననుసరించి కార్య కారణముల కొక విధముగా నభేదము, మఱొక విధముగా భేదము గలుగును. జైనులు, హెగెల్ మున్నగు వారు దీనినే ప్రతిపాదింతురు. ఇట్టి వాదమునఁ బూర్వోదాహృత వాద ద్వయమందలి దోషములన్నియుఁ బుంజీభవించి సాక్షాత్కరించు చున్నవి. పైఁగాఁ బరస్పర విరుద్ధ ధర్మము లేక కాలమున నేక స్థానమున నుండవు. వెలుఁగు చీఁకటు లొండొంటికి గిట్టవు. ఇవి రెండు నొకే చోట, నొకే తఱి నుండవు గదా ! కావున కార్య కారణ భావమునకు భేదాభేదము ప్రతిపాదించుట యసమంజసము. వాస్తవమునకు విరుద్ధధర్మాధ్యాసవంత మైనది యేక పదార్థము గాఁ జాలదు. కావున నీ వాదము ననాదరణీయమే.

ఇంక మిగిలినది సదస దనుభయ కార్య వాదము. ఈ వాద ప్రతిపాదకులు గాని, తదనుయాయులు గాని ఎవరో తెలియదు. మొత్తముమీఁద హేతువు లేకయే కార్యోత్పత్తి జరగునని యీ వాదము ప్రతిపాదించు

చున్న ట్లర్థము చేసికొన వలసి వచ్చుచున్నది. ఇది యథార్థ మగుచో విత్తకయే రైతు పంట సేకరింప సంచులు పట్టవలసి యుండును. కావున నిది సమ్మతము కాఁజాలదు. పైఁగా వాద రీతిచే నిందు వ్యాహతి పొడము చున్నది. ఏతద్వాది హేతువు లేదని సమర్థించుకోవలెను. సమర్థనమునకై యతఁడు హేతువు నుదాహరించెనా ప్రతిజ్ఞా భంగము వాటిల్లును. హేతువు నుదాహరింపక మానెనా కేవల ప్రతిజ్ఞవలనఁ బ్రయోజనము గలుగదు.

కావున నీ వాద చతుష్టయములో నేదియు నాదరణీయము గాదు. అగుచో దేని నాదరింప వలె నను పరిపృచ్ఛ కలుగక మానదు. దీనికి మాధ్యమక వాదము చెప్పు సమాధాన మొకటే. ఏ వాదము విచార క్షమము గాదు గావున, నే వాదమందు నభినివేశము దగదు. బోధిసత్త్వులు దృష్టినే పరిహరింప వలయును. దృష్టి యున్నంత కాలము సంసార నిమజ్జనోన్మజ్జనములు దప్పవు.

ఇంతకు మున్ను పరామృష్టములగు నాలుగు వాదములను సంగ్రహముగాఁ జెప్పవలయు నన్న, సద్వాదమనియు నసద్వాదమనియు వచింప వచ్చును. ఈ రెండు వాదములను బరిహరించుచున్నది కావున, మాధ్యమక వాదమున కద్వయ వాద మను పేరు వచ్చినది. ఈ యద్వయత్వ సమగ్రార్థము మున్ముందు స్పష్టము గాఁగలదు.

"మాధ్యమక వాదమునకుఁ బ్రతీత్య సముత్పాద వాద మను నామాంతర మున్న దని యింతకు మున్ను చెప్పు కొంటిమి. ఇప్పు డీ వాద మేమి చెప్పునో తెలిసికొనవలసి యున్నది.

## ప్రతీత్య సముత్పాదము

మన మనేక వస్తువులను గాంచుచున్నాము; ఊహించు చున్నాము; అనుభవించుచున్నాము. ఈ వస్తువుల తత్త్వ మేమి? మాధ్యమకుఁడివి యన్నియుఁ బ్రతీత్య సముత్పాదము లని చెప్పును. కావున ముందుగాఁ బ్రతీత్య సముత్పాద మను పదమున కర్థము గ్రహించు టావశ్యకము. ఇందుల కాచార్య చంద్రకీర్తి వివరణ మెంతయుఁ దోడ్పడఁగలదు.

అతఁడు చూపిన ప్రక్రియ యిట్లున్నది:—ఇ అనునది గత్యర్థకధాతువు. ప్రతి యనునది యుపసర్గము. ఉపసర్గము వలన ధాత్వర్థ మనేక విధముల మాఱునని వైయాకరణు లెఱింగిన విషయమే. ప్రతి యను నుపసర్గముతోఁ గూడిన ఇ ధాతువుయొక్క కృదంత రూపము ప్రతీత్యము. మిక్కిలి భంగురమైన యుత్పాదము ప్రతీత్య సముత్పాదము. ఈ యర్థము సర్వాస్తివాదులకే కాని, మాధ్యమకులకు సమ్మతము గాదు. ప్రతి యను నుపసర్గతోఁ గూడిన ఇ ధాతువు యొక్క ల్యబంతరూపము ప్రతీత్య. ఇది యవ్యయము. దీనికి పొంది యని యర్థము. పొంది పుట్టుటయే ప్రతీత్య సముత్పాదము. అనఁగాఁ గారణములను బొంది పుట్టుట యని భావము.

ప్రపంచమందలి యెల్లభావములు (ఉత్పాదస్థితి భంగములు గలవి) కారణములను బొంది కలుగుచున్నవి. అవి లేనప్పుడు కలుగవు. దృష్టాంతముగా ఘటమును స్వీకరింప వచ్చును. ఈ ఘటభావము మన్ను, కుమ్మరి, సారె, దండము మున్నగాఁగల కారణసామగ్రి యున్నపు డేర్పడుచున్నది. లేనప్పు డేర్పడుట లేదు. వాస్తవముగా ఈ ఘటము మృత్తిక యందు లేదు. ఉన్నచో దానిని ఘటమందుమే కాని మృత్తిక

యనము. అట్లే యీ ఘటము కుమ్మరియందు లేదు. అతని వ్యాపారమందుఁ గాని, దండమందుఁ గాని, సారెయందుఁ గాని, లేదు. వీని సామగ్రియందును లేదు. ఉన్నచో నా సామగ్రిని ఘట మనవలయును. అట్లనుట లేదు. కావున నా సామగ్రి యందును లేదు. పైని పేర్కొనిన వ్యస్తపదార్థములందుఁ గాని, సమస్తములందుఁ గాని లేనిదిగావున ఘటము నిఃస్వభావము. నిఃస్వభావము గావున నది శూన్యము.

ఘట మట్లే సర్వభావములు శూన్యములు. కారణములు పొంది కలుగునది సస్వభావము గాదు.

ప్రతీత్య య ద్య ద్భవతి న హి తావత్ త దేవ తత్ - మా. కా. 18 - 10

అప్రతీత్య సముత్పన్నమగు ధర్మ మొక్కటియు లేదు. కావున నశూన్యమగు ధర్మమును లేదు.*

కారణములను బొంది కలుగునది స్వభావముచే శాంతమే కాని యన్యము గాదు.

ప్రతీత్య యద్యద్భవతి త త్త చ్ఛాంతం స్వభావతః॥ మా. కా. 7 - 16.

ఇక్కడ శూన్యతా శబ్దార్థము సరిగా నవగతము గావించుకొన వలయును. సామాన్యముగా శూన్యమన వ్యవహార బలమునుబట్టి లేనిదని కాని, వైనాశికమని కాని యర్థము చేసికొందుము. నాగార్జునుని సమకాలికులు, నర్వాచీనులు నగు విమర్శకు లట్లే భావించి మాధ్యమిక పదార్థము గ్రహింపనోపక లేనిపోని దురర్థములు కల్పించుకొని చూపించిరి. కాని మాధ్యమికుల శూన్యమను పదమున కర్థ మది కాదు. కారణ ప్రత్యయాపేక్షమైన దని యర్థము. అంతే కాని యత్యంతాభావమని యర్థము గాదు. కారణ

---

*అప్రతీత్య సముత్పన్నో ధర్మో కశ్చి న్న విద్యతే
యస్మా త్తస్మాదశూన్యో హి ధర్మః కశ్చి న్న విద్యతే-మా. కా. 24-19.

ప్రత్యయము లుండఁగా నుండి, లేనప్పుడు కలుగని పదార్థము శూన్యమని పేర్కొనఁ బడుచున్నది. ఉదాహరణముగాఁ బ్రతిబింబమును గ్రహింపవచ్చును.

ఈ ప్రతిబిం బోపలబ్ధి యెప్పుడు కలుగుచున్నది? అద్దము, దానిముం దొక వస్తువు, వెలుఁగు కావలయును. అప్పుడు ప్రతిబింబ మేర్పడవచ్చును. కాని దాని జ్ఞానము పొందుటకు ద్రష్టయుఁ గావలయును. అప్పుడే ప్రతిబింబోప లబ్ధి కలుగుచున్నది. ఈ పేర్కొనిన కారణ సముదాయము లోనే యొకటి లోపించినను ప్రతిబింబ జ్ఞానము కలుగ నొల్లదుగదా! మాధ్యమకులు దీనినే చెప్పుచున్నారు.

ఈ ప్రతిబింబము పారమార్థిక సత్యమా యనునదియే ప్రశ్న. నాగార్జును లిది పారమార్థిక సత్యము కాదందురు. హేతు ప్రత్యయములను బొంది కలుగునదియెల్ల వ్యావహారి కమే కాని పారమార్థిక సత్యము గాదని యాతని సిద్ధాంతము. ఇది పారమార్థిక సత్యము గాదని నిర్ణయించు టెట్లు?

ఇంతకు మున్ను ఘటోత్పత్తినిగూర్చి కొంత ముచ్చ టించుకొంటిమి. ఘటము మృత్తికయందుఁ గాని, కులాలుని యందుఁ గాని, యతని కర్మమునందుఁ గాని, వాని దండ చక్రాదులందుఁ గాని లేదుగదా! అప్పు డది పారమార్థిక సత్య మెట్లగును?

ఈ విషయమును లీలా మాత్రముగా నైన గ్రహించుట కీ క్రింది దృష్టాంతము గొంతవఱకుఁ దోడ్పడు నేమో!

మన మొక కొండను దూరమునుండి చూచినప్పు డొక యాకారము కానఁబడును. దానిని సమీపించు చున్న కొలఁది భిన్న భిన్నాకారములు గోచరించును గదా! అట్లే యితర దిశలనుండి సమీపించు చున్నప్పుడు దృష్టపూర్వము

కంటె భిన్నరూపము లగపడును. ఈ విధముగా ననంత రూపములఁ బొంద నవకాశ మున్నది. పర్వతము ద్రష్టయు నేకైక స్వరూపము లనుకొన్నను అనంత రూపప్రాప్తి కవకాశ మున్నది. ఈ యనంత రూపములలో నేది సత్యము ? ఏది యసత్యము. ఇచట పూర్వ ప్రసక్త దృష్టి చతుష్టయము గలుగ వచ్చును. 1. అన్నియు సత్యములు, 2. అన్నియు నసత్యములు, 3. అన్నియు సత్యాసత్యములు, 4. అన్నియు ననుభయములు. ఈ నాలుగు దృక్పథములలో నేదియు నాదరణీయము గాదని కారణ కార్యభావ పరీక్షా సందర్భ మునఁ దేలినది గదా!

ఇంతకంటె సులభ గ్రాహ్య మగు మఱియొక దృష్టాంతము తీసికొందము. పచ్చని యద్దముల జోడు పెట్టుకొని చూచిన వస్తుప్రపంచ మంతయు పచ్చగాను, నీలి యద్దముల జోడు పెట్టుకొని చూచిన నీలముగాను గనిపించును. కావున వస్తుప్రపంచ వర్ణము అద్దముల వన్నెతో మాఱుచున్నది. స్వాభావిక నేత్రములతోఁ జూచి నప్పుడా వస్తువులే మఱొక తీరుగాఁ గనిపించు చున్నవి. పచ్చద్దముల జోడు ప్రపంచ మును బచ్చగాఁ జూపుచున్నట్లే, మన కన్నులు గూడ ఉన్న వానిని వేఱొక తీరుగాఁ జూపవచ్చును గదా! కాని వ్యవహార బలమునుబట్టి కన్నులు చూపు రూపమే యథార్థ మనియు నద్దములు చూపు రూప మయథార్థ మనియు భావించుచున్నాము. వాస్తవమునకు అద్దములు చూపు రూప మెట్టిదో, స్వాభావిక నేత్రములు చూపు రూపము నట్టిదే. ఇట్లని రెండు నొకటే యని యర్థము చేసికొన రాదు. కేవలము అద్దముల ద్వారమునఁ జూచిన రూపము కారణ సామగ్రివలనఁ గలుగు చున్నట్లే కంటితోఁ బొందు చున్న రూపము గూడ కారణ సామగ్రివలనఁ గలుగు

చున్నది. కారణ సామగ్రియందలి భేదములనుబట్టి యీ రూపముల భేద మేర్పడుచున్నది. ఈ భేదము నారింజ పండునకు నిమ్మ పండునకు నున్నట్టిదే. నారింజ పండు యథార్థ మనియు, నిమ్మపండు అయథార్థ మనియుఁ జెప్ప వీలులేదు గదా? కాని వ్యవహార మొక్కటి మాత్రమే సత్యమని విశ్వసించు వారు మాత్రము నిర్దుష్ట మగు కన్ను చూపు నది మాత్రమే యథార్థమనియు, అద్దములు మున్నగాఁగలవి చూపునవి అయథార్థము లనియుఁ దలంచుచున్నారు. ఇట్లు తలంచుట యన నింబ నారంగ ఫలములలో నొకటి యథార్థ మనియు, రెండవది అయథార్థ మనియు భావించుటయే.

ఈ సందర్భమున విచారణ పూర్వముగా నాగార్జునుఁడు ప్రదర్శించిన మానసి కైంద్రజాలము నిట నుటంకించుట యప్రస్తుతము కాఁ జాలదు :—

ఇంద్రియై రుపలబ్ధస్య విషయ స్యాకృతిం మనః ।
ఉపలభ్య వ్యతీతస్య కల్పయన్ మన్యతే సుఖమ్ ॥

రత్నావళి, 4—53

"ఇంద్రియ లబ్ధమైన విషయ రూపమును బొంది మనస్సు గతించిన దానిని గల్పించుచు సుఖ మని తలంచుచున్నది," యని యీ శ్లోకమున కర్థము. ఇంతకు మనస్సు గతించిన దానిని గల్పించుచున్నదా యను నాశ్చర్యము గలుగ వచ్చును. సావకాశముగాఁ బరిశీలించినచో నిందు నివ్వెఱ పడ నక్కఱ లేదు.

ఆధునిక పదార్థ విజ్ఞాన శాస్త్ర మేమి చెప్పుచున్నది? వెలుఁగు కిరణము మనము కనుఁగొనుచున్న వస్తువునుండి బయలుదేఱి కంటి పాపపైఁ బడవలయును. అది పిమ్మట మనస్సుచే గ్రహింపఁబడ వలయును. వెలుఁగు వేగ మెంత

య్యధిక మైనను బయలు దేఱిన కాలమునకు నదిపొందఁ బడు కాలమునకు వ్యవధాన ముండునని యంగీకరింపక తప్పదు. ఈ వ్యత్యాస మత్యంత సూక్ష్మ మన వచ్చును. ఎంత సూక్ష్మమైనను వ్యత్యాసము వ్యత్యాసమే. అనఁగాఁ బూర్వ క్షణమున బయలు దేఱినది యుత్తర క్షణమునఁ గాని మనస్సుచేఁ గ్రహింపఁబడుట లేదు. ఈవిధముగాఁ బూర్వ క్షణమునందలి దానిని ఉత్తర క్షణమునఁ గాని చూచుట లేదు. మనము వర్తమాన మని భావించుచున్నది వాస్తవమునకు భూత కాలము.

ఈ విషయము నాధునిక ఖగోళ శాస్త్రము చక్కఁగా విశదీకరించు చున్నది. కొన్ని నక్షత్రములనుండి వెలుఁగు కిరణము భూ లోకముఁ జేరఁ గొన్ని లక్షల సంవత్సరములు పట్టునఁట. ఇప్పుడు భూ లోకమున గ్రహింపఁబడుచున్న యేతాదృశ నక్షత్రము కొన్ని లక్షల సంవత్సరముల క్రిందట నశించిన నశించి యుండవచ్చు నని శాస్త్రకారులు చెప్పు చున్నారు. కావున మనము వర్తమాన మనుకొనుచున్నది వాస్తవముగా వర్తమానము గాదు.

కన్ను మున్నైన యింద్రియములవలన వ్యావహారిక జ్ఞానము గలుగు చున్నది. తల్లిదండ్రుల వలన పుత్ర జనన మట్లు చక్షూ రూప ద్వయమువలన విజ్ఞానము గలుగు చున్నది.*

ఇది పరమార్థము గాదు.

ఇఁకఁ బరమార్థ స్వరూప మేమి యను ప్రశ్నము గలుగక మానదు. ఇంద్రియ గోచర మగు నర్థ జాత మం

---

*ప్రతీత్య మాతా పితరా యథోక్తః పుత్ర సంభవః ।
చక్షూ రూపే ప్రతీత్యైవ ముక్తో విజ్ఞాన సంభవః ॥
రత్నా. 4—45

తయు వ్యావహారికము. వ్యావహారిక ప్రపంచ యథార్థ స్వరూపము శూన్య మని నాగార్జునుల సిద్ధాంతము. శూన్య మన నభావ మని యర్థము గాదు. అభావము గూడ వ్యావహారికమే కాని పారమార్థికము గాదు. పరమార్థము భావము గాదు; అభావముం గాదు; భావాభావము గాదు; అనుభయమకును గాదు. ఈ భావాది చతుష్టయము వ్యావహారికము. అచింత్య గుణ మగుటచేఁ బరమార్థము శూన్య మని మాధ్యమికాచార్యులు చెప్పుచున్నారు. యథార్థమున కది వాచా మగోచరము. వ్యవహారాపేక్షచే దానిని కారణము లేనిది (పర బోధనముచే నెఱుఁగ రానిది) ఉత్పత్తి స్థితి లయము లుడిగినది, మాటలచేఁ బ్రపంచింపఁబడనిది, నామ జాత్యాది యోజనా రహిత మైనది, అనానార్థ మైనది, అప్రహీణ మైనది, అసంప్రాప్త మైనది, అనుచ్ఛిన్న మైనది, అశాశ్వత మైనది, అనిరుద్ధ మైనది, అనుత్పన్న మైనది యని వర్ణించు చున్నారు.*

ఇట్లు సర్వ భావములు హేతు ప్రత్యయములను బొందికలుగుచున్నవి గావున ప్రతీత్య సముత్పన్నములు. కారణములవలనఁ గలుగునది యెల్ల వ్యావహారికమే. కారణ వినిర్ముక్త మైనపుడది నిఃస్వభావము. నిఃస్వభావము గావున నది శూన్యము. వాచా మగోచరము. ఇది పారమార్థికము. ఈ విధముగా ప్రపంచ వస్తు జాతమునకు రెండు రూపము లేర్పడు చున్నవి. (1) వ్యావహారిక రూపము, (2) పారమార్థిక రూపము. మొదటిది సాపేక్షము, రెండవది నిరపే

---

*అపర ప్రత్యయం శాంతం ప్రపంచై రప్రపంచితమ్।
నిర్వికల్ప మనానార్థ మేత త్తత్త్వస్య లక్షణమ్॥ (మూ. కా. 18-9)
అప్రహీణ మసంప్రాప్త మనుచ్ఛిన్న మశాశ్వతమ్।
అనిరుద్ధ మనుత్పన్న మేత న్నిర్వాణ ముచ్యతే॥ (మూ.కా.25-3)

ము. ఈ విభాగము మాధ్యమిక దర్శనమున కత్యంత ముఖ్యము. ఈ రెండును వ్యవహారస్థునకు సత్యములే. భాస్వన్మండల గతునకు తమము కలుగనొల్లనట్లు పరమార్థసిద్ధికి వ్యవహారసత్య మనునది కలుగదు. ఈ భేదము గ్రహింపఁజాలనివానికి మాధ్యమిక దర్శనము అంధదీపము. కావుననే నాగార్జునుఁడు మూలమాధ్యమక కారికలలో

> యేఽనయో ర్న విజానంతి విభాగం సత్యయో ర్ద్వయోః ।
> స్తే తత్త్వం న విజానంతి గంభీరం బుద్ధశాసనే ॥ 24-9

అని చాటియున్నాఁడు. ఈ సత్య ద్వయార్థము నాచార్య చంద్రకీర్తి యిట్లు వివరించుచున్నాఁడు :—

> ఉపాయభూతం వ్యవహార సత్యమ్ ।
> ఉపేయభూతం పరమార్థ సత్యమ్ ॥ మాధ్యమకావతారము 6-80

ఈ ప్రపంచ మంతయుఁ బ్రతీత్య సముత్పన్నమే. ప్రతీత్య సముత్పన్నమైన దెల్ల వ్యావహారికమే కాని పారమార్థికము గాదు. వ్యావహారికము తత్త్వముచే నిఃస్వభావము. నిఃస్వభావము గావున శూన్యము. అంతియకాని యీ ప్రపంచమందు నే వస్తువు, నే సిద్ధాంతము, నే దృష్టియుఁ బరమ సత్యము గాదు. మూలమాధ్యమక కారికలు ఒక్కొక్క పరిచ్ఛేదమున వ్యవహారసిద్ధమగు నొక్కొక్క విషయమును గ్రహించి యది ప్రతీత్య సముత్పన్నమనియుఁ, గావున నది నిఃస్వభావ మనియు, నిఃస్వభావ మగుటవలన నది శూన్యమనియు వ్యవస్థాపించుచున్నవి.

ఈ క్రింది పట్టికను బరిశీలించినచో మూలమాధ్యమక కారికా పరామృష్టార్థము స్పష్టము గాఁగలదు :—

| పరిచ్ఛేదము | పరీక్షితార్థము |
| --- | --- |
| మొదటి పరిచ్ఛేదము | ప్రత్యయములు |
| రెండవ ,, | గతి |
| మూఁడవ ,, | ఇంద్రియములు |
| నాల్గవ ,, | స్కంధములు |
| అయిదవ ,, | ధాతువులు |
| ఆఱవ ,, | గుణి గుణ సంబంధము |
| ఏడవ ,, | సంస్కృత పదార్థము |
| ఎనిమిదవ ,, | కర్మ కారకములు |
| తొమ్మిదవ ,, | పూర్వము |
| పదవ ,, | అగ్నీంధనములు |
| పదునొకండవ ,, | పూర్వాపరములు |
| పండ్రెండవ ,, | దుఃఖము |
| పదుమూఁడవ ,, | సంస్కారము |
| పదునాలుగవ ,, | సంసర్గము |
| పదునైదవ ,, | స్వభావము |
| పదునాఱవ ,, | బంధన మోక్షములు |
| పదునేడవ ,, | కర్మ ఫలము |
| పదునెనిమిదవ ,, | ఆత్మ |
| పందొమ్మిదవ ,, | కాలము |
| ఇరువదవ ,, | కారణ సామగ్రి |
| ఇరువదియొకటవ ,, | ఉత్పత్తి లయములు |
| ఇరువది రెండవ ,, | తథాగతుఁడు (ఈశ్వరుఁడు) |
| ఇరువది మూఁడవ ,, | విపర్యాసము |
| ఇరువది నాల్గవ ,, | ఆర్యసత్యములు |
| ఇరువది యైదవ ,, | నిర్వాణము |
| ఇరువది యాఱవ ,, | ద్వాదశాంగములు |
| ఇరువది యేడవ ,, | దృష్టి |

ఇంతకు మున్ను కార్యకారణ భావమున నాగార్జునుని సిద్ధాంతము పరిశీలించితిమి. ఇంక మిగిలిన వాని నన్నిటిని సాకల్యముగాఁ బరిశీలింప నవకాశము చాలదు. కావున ముఖ్యములుగాఁ దోఁచు గతి, కాలము, ఆత్మ, యీశ్వరుఁడు, స్వభావము, విపర్యాసము, నిర్వాణము, దృష్టి యను విషయములనుగూర్చి శూన్యవాదము చెప్పుచున్న సిద్ధాంతము గ్రహించుట యావశ్యకము.

## గతి

వైవాహిక క్రియకు వధూవరులవలె గమన స్వభావ గ్రహణమునకు గతి దేశము లావశ్యకములు. గమనము లేక ఇది గతము, ఇది యగత మని దేశ విభాగ మేర్పడదు. దేశ విభాగము లేక గమనము గోచరింపదు. అట్లే గమనము లేని గంత కర్థము లేదు. గంతృ హీన మగు గమన మగోచరము.

గమనమునుబట్టి యిది గతము, ఇది యగతము నిది గమ్యమానము నని దేశమును విభజించు చున్నాము. సామాన్యదృష్టి కిచ్చట సంశయము గలుగదు. కాని నాగార్జుఁ డిట్లు ప్రశ్నించుచున్నాఁడు :— "గమింపఁబడినది గతము. ఇంక గమింపఁబడఁగలది యగతము. ఇంత వఱకు సంశయింప నక్కఱలేదు. కాని గమ్యమాన మగు దేశము గతాగతములను విడిచి యెందున్నది ?"

ఇట్లు ప్రశ్నించుట యందలి నాగార్జునుని తాత్పర్య మిది :— గమ్యమాన మగు దేశము గతమునందు లేదు; అగతమందును లేదు. దేవదత్తుఁడు పాదము మోపినాఁడు. ఆ పాదము దేశమును విభజించినది. కాలు మోపిన దేశము

గతము. మిగిలినది యగతము. ఈ గతాగతములలో గమ్యమాన దేశ మెక్కడ నున్నది?

గమన మొక చేష్ట. కాలు తీయుట మోపుట యనునవి యా చేష్ట కుపలక్షణములు. ఈ లక్షణములు లభించుచున్న దేశమే గమ్యమానము. అది గతము గాదు. అగతమును గాదు. కేవలము గమ్యమాన మని తోఁప వచ్చును.

ఇది యథార్థ మగుచో గమ్యమానము గమింపఁబడుచున్నదని చెప్పవలయును. ఇట్లు చెప్పు వాక్యమున కర్థమేమి? గమ్యమానమునకు గమనము లేదని యర్థము చేసికో వలయును. లేదా, గమ్యమానమునకు గమన ద్వయము గల్పింప వలయును. మొదటి పక్షమున గమ్యమానము గమన రహితము గావలయును. అట్లగుచో గమి క్రియాయోగ శూన్యమును గమ్యమాన మనుట యెట్లు? తత్క్రియా యోగమువలననే కదా దానిని గమ్యమాన మనుట! కావున గమ్యమానము గమన క్రియా యోగ రహితము గాఁ జాలదు. కావున రెండవపక్ష మాశ్రయింప వలయును. అట్లు చేసిన గమన ద్వయ మంగీకరింప వలయును. ఎట్లన గమ్యమాన మని పేర్కొనుటకు హేతువైన గమన మొకటియు, నందుఁ బ్రవర్తిల్లుచున్న గమనము మఱొకటియుఁ గలిసి వెరసి రెండు గమనము లగుచున్నవి. ఈ గమన ద్వయ మంగీకరించిన గంతృ ద్వయమును గూడ నంగీకరింప వలయును. కారణ మేమన గంతృ రహితమైన గమనము లేదు. కర్తను విడిచి పదును, నెలను విడిచి వెన్నెల, నిప్పును విడిచి వేఁడిమి కలుగవు గదా? కావున గతాగత వినిర్ముక్త మైన గమ్యమానము లేదు.

గమ్యమానము లేకపోయిన పోవుఁ గాక. పోవు వాఁడున్నాఁడు. కావున గమన మున్న దని తలంప వచ్చును.

కాని యిచ్చటఁ గొంత జాగరూకతతో నాలోచింప వల యును. పోవు వాఁడు పోవునా? పోవని వాఁడు పోవునా? పోవని వాఁడు పోవు ననిన వ్యాఘాతము కలుగును. పోవు వాఁడు పోవు నను మాటను బరిశీలింప వలయును. పోవు వాఁడు పోక కలవాఁడేని గావలె, లేదా లేని వాఁడేని గావలె. పోక లేని వానిని పోవు వాఁ డనము. పోక కలవా నిని మాత్రమే పోవు వాఁ డందుము. పోవు వాఁడు పోవు నన్నచో రెండు పోకల నంగీకరింప వలసి వచ్చును. పోకలు రెం డున్నప్పుడు వానికిఁ గర్త లిరువు రుండ వలయును. ఆ కర్తలలో నొకఁడు పోవు వాఁడని యంగీకరింత మనుకొనుఁడు. ఇంక నీ రెండవ వాఁడెక్కడనుండి యూడిపడుచున్నాఁడు?

కావున పోవు వాఁడు పోవుట లేదు. పోవని వాఁడు పోవుట లేదు. వీ రిద్దఱుఁ గాక యింక పోవు వాఁ డెవ్వఁడు? కావున గమనము లేదు.

ఇట్లనఁగానే, "గమనము లేక పోవు టేమి? నిలుచున్న దేవదత్తుఁడు కదలి చనుటను గాంచు చున్నాము గదా! కావున గమనము కలుగ వలయును. లేనిచో దేవదత్తుఁడు కదలి చనుట సంభవింపదు. ఇంతకు మున్ను పేర్కొనిన చిక్కు లన్నియు గమన మెం దున్నది యను ప్రశ్నవలన వచ్చి చుట్టుకొను చున్నవి. అట్లు గాక గమన ప్రారంభ మును బరిశీలించిన దాని యునికి సిద్ధింపక తప్పదు," అని భావింప వచ్చును.

ఈ కల్పనయు సమాలోచనీయమే. దేవదత్తుని గమన మెపుడు ప్రారంభ మగుచున్నది? గతమునందా? అగతము నందా? గమ్యమానమందా? గమనము గతమం దారంభ మైన దని తలఁప వీలు లేదు. ఏల యన భూత వర్తమానములకు విరోధముగదా! అది ముఱియగ తారంభ మనియుఁ జెప్పరాదు,

కారణమేమి ? భవిష్య ద్వర్తమానములకు విరోధము గలదు గదా! గమ్యమానమున గమన ప్రారంభము వచింప వీలు లేదు. ఏలయన గమ్యమానము లేదని యింతకు మున్నే తేలిపోయినది. కాదు, ఉన్న దని పిడివాదమునకు దిగిన, క్రియా ద్వయ ప్రసంగము, కర్తృ ద్వయ ప్రసంగము నేర్పడును.

కావున గతాగత గమ్యమానములందు గమనారంభము గోచరించుటలేదు. ఇంక గమన ప్రారంభ మెచ్చట ?

"గతాగత గమ్యమానములందు గమన ప్రారంభము గలుగక పోవుఁగాక, గతాగత గమ్యమానము లున్న," వని తలంపవచ్చును. కాని గమన మున్న గతాగత గమ్యమానములు సిద్ధింపఁ గలవు. ఏల యన గమిక్రియ ప్రారంభమై యది యుపరత మైనప్పుడు గతమనియు, నది వర్తిల్లు చున్నప్పుడు గమ్యమాన మనియు, నా క్రియ యజాతముగా నున్నప్పుడు అగతమనియు నందుము. కాని గమనప్రారంభ లబ్ధియే లేదు. ఇంక గతాగత గమ్యమాన పరికల్పన మెట్లు పొసఁగును ?

కేవల గమనమునే విచారించిన నది కనిపింపక పోవచ్చును. కాని స్థితి యున్నది. అస్తిప్రతిపక్షము నత్తు. వెలుగునకుఁ జీకటి, పారమున కవారము ప్రతిపక్షములు. ఆంధ్యము నవారము నున్నవి. కావున ప్రకాశావారము లున్నవి. అట్లే గతికిఁ బ్రతిపక్షము స్థితి. స్థితి కలదు. కావున గతి కలదు. ఇట్లు సిద్ధించు గతి లేదనుట యుక్తి సహము గాదని వాదింపవచ్చును.

ఈ యుక్తియుఁ బరిశీలనార్హమే. స్థితియున్న గతి యుండును. కాని స్థితి యున్నదా ? ఉన్న దన నది యెందు న్నది ? గంత స్థాత కాఁడు. ఏల యన గమన సహితుఁడే కద్దా

గంత! అట్టి గంత స్థాత యగుట యెట్లు? ఇంక నగంతయు స్థాత గాఁడు; అగంతయే స్థాత యనుచో పూర్వోక్త న్యాయమున స్థాతృద్వయ ప్రసంగము, స్థితిద్వయ ప్రసంగము గలుగును. కావున నగంత స్థాత గాఁడు. ఇంక గంత్ర గంతలకంటె నన్యుఁడై స్థాత యెక్కడున్నాఁడు? స్థాత లేక స్థితి యెట్లు గలుగును? అగ్ని లేక యౌష్ణ్యము గలుగునా?

ప్రారంభమునుబట్టి స్థితిని సాధింత మన్ననుఁ బొసఁగ కున్నది. ఏలయన గతి నివృత్తియే స్థితి. గతి ప్రారంభమున్న స్థితి ప్రారంభముగూడ లభించును. కాని గతి ప్రారంభము గతాగత గమ్యమానములం దెందును లభింప దని పూర్వ పరిశీలనము చాటుచున్నది. ఇట్లు గతి లభింప నప్పుడు తన్నివృత్తిప్రారంభ రూప మగు స్థితిప్రారంభ మెచట లభించును?

పోనిండు, కేవల స్థితి యున్నఁ దత్ప్రతిపక్ష మగు గతి కలుగఁగలదు. కాని స్థితి లభించుట లేదు. గత్యభావ నిరూపక కారణములే స్థిత్యభావమును వ్యవస్థాపించుచున్నవి. ఇట్లు స్థితియొక్క యనుపపత్తిచే గతియు సిద్ధింప కున్నది.

ఇతఃపూర్వ సిద్ధార్థముల నుపేక్షించి గతి యున్న దను కొందము. అగుచో గతి ఎందున్నది? ఎట్లున్నది? ఈ గతి గంతకంటె నన్యమగునా? లేక గంతయే గమనమగునా? గతియే గంత యనుచో కర్తృకర్మముల కైక్యము వాటిల్లును. అప్పు డగ్నీంధనములు, పితాపుత్రులు, కుఠార కాష్ఠము లొకటి కావలసివచ్చును. అప్పు డితఁడు గంత, యిది గమన మను విభేద మేర్పడఁజాలదు. పైఁగ గంత నిరంతర గమనుఁడు గావలసి వచ్చును. మీఁదుమిక్కిలి గంతృగమనము మఱొక ధాఁనికి సంక్రమింపఁజేయ శక్యము గాదు.

ఇఁక రెండవ పక్ష మాశ్రయించి గతికంటెఁ గంత యన్యుఁడని చెప్పఁకొన్న పక్షమున గమనము లేని గంత, గంతృరహిత మగు గమనము గలుగ వలయును. ఘటపటాదులు ఒకదానిని దాటఁగి మఱియొకటి వేఱువేఱుగ లభించుచున్నట్లు గంతృగమనములు విడివిడిగా ఒకదానిని విడిచి మఱొకటి లభించుట లేదు.

ఈవిధముఁగా నేకీభావముచేఁగాని, నానాభావముచేఁగాని గంతృగమనములు సిద్ధింపకున్నవి.

నాగార్జును లిట్లు గతిని మాత్రమే కాక స్థితిని గూడ నిరాకరించు చున్నారు. గ్రీక్ తత్త్వవేత్త జీనోయేమి, శంకరులు మున్నుగాఁ గల యద్వైతులేమి స్థితిని మాత్ర మంగీకరించి గతిని ప్రతిషేధించు చున్నారు. బెర్గసన్ గతిని మాత్ర మంగీకరించి స్థితిని ప్రత్యాఖ్యానించు చున్నాఁడు. మాధ్యమ కాచార్యుఁ డగు నాగార్జునుఁడు స్థితి గతులు రెండును సాపేక్షము లనియుఁ దాత్త్వికములు గావనియు సిద్ధాంతీకరించు చున్నాఁడు. అంతేకాని వ్యావహారికముగా స్థితిగతులను గాని, ప్రపంచమును గాని ప్రతిషేధించుట లేదు.

## కాలము

ఇపుడు క్రమప్రాప్త మగు కాల విషయమున మాధ్యమక మత మాలోచింప వలయును.

కాలము నిత్యద్రవ్య మని కొందఱు భావింతురు. మఱికొందఱు భూత భవిష్య ద్వర్తమానము లున్నవి గావున కాల మున్న దందురు. వేఱొక కొందఱు లవ ముహూర్తాదికముచేఁ గొలువఁబడు చున్నది గావున కాలము కల దందురు. ఇంకొక కొందఱు కాల వృద్ధ్యాది

భావము లున్నవి గావునను, సోత్పాద స్థితి భంగము లగు విషయములు గోచరించు చున్నవి గావునను కాల మున్న దందురు.

ఈ నాలుగు వాదములలో నొక్కొక్క దానిని బరీక్షించి, యది యుక్తిసహము గాదని ప్రదర్శించి నాగార్జునుఁడు కాలమును ప్రతిషేధించు చున్నాఁడు.

కాలము నిత్య ద్రవ్యమని భావించువారు సర్వ భూతములు దానివలననే పుట్టుచు గిట్టుచున్న వందురు.

> కాలః పచతి భూతాని కాలః సంహరతే ప్రజాః
> కాలః సుప్తేషు జాగర్తి కాలో హి దురతిక్రమః ॥

అని కాలమును వర్ణించుచుఁ జరాచర ప్రపంచమున కెల్ల నదియే కారణ మని యందురు. యథార్థముగా కాలము నిత్య పదార్థమై సర్వమునకుఁ గారణమగుచో నంకు రావిర్భావమునకుఁగూడ నా కాలమే కారణము గావలయును. కాలము నిత్యము గావున కార్యమగు నంకురోత్పత్తియు నిరంతర ప్రవృత్తి కావలయును. కాని యంకురోద్భవము నిత్యప్రవర్తి కాదు. కొన్ని సమయములందే యది ప్రవర్తిల్లుచున్నది. కావున కారణభూత మగు కాలముగూడఁ గొన్ని సమయములందే యుండి యితర సమయములందుఁ గలుగక పోవలయును. లేదా యంకురోత్పత్తి యట్లే కాలము ననిత్యము గావలయును. కాల మనిత్య మయిన నది హేతు ప్రత్యయములవలనఁగలుగు నది కావలయును. అనఁగా హేతు ప్రత్యయములున్నపుడుండి యవి లేనప్పుడు లేకపోవుచు కాలముఁ గాదాచిత్క మగును. అట్లగుచో కాలమునకు నిత్యత్వము గలుగదు.

పైఁగా కాలము కారణ మను పక్షమున నది ఫలోత్పాదమునకుఁ దోడ్పడ వలయును. తోడ్పడని దానిని

గారణ మనరాదు. కాలము నిజముగా కారణ మయిన, నది కార్యము గావలయును. ఈ మార్పు కలుగక ఫలోత్పాదము సంభవింపదు. బీజము మాఱి మొలక యగును. మొలక యేర్పడిన పిమ్మట బీజము గలుగదు. అట్లే కాలముగూడ మాఱిపోయి కార్యరూపము పొందవలెను. కార్యరూపము పొందనిచో కాలము కారణము కాక పోవలయును. లేదా కారణాపేక్ష లేకయే ఫలోత్పాదము సంభవింపవలయును.

కాలము మాఱదేని ఫలోత్పత్తి కది కారణముగాదు. పైఁగా నిత్యమైన కారణమువలన నుత్పన్నమైన కార్యము గూడ నేల నిత్యము గాదు? హేతుఫలములకు వైలక్షణ్యము సమంజసము కాదు. సుభంజన మగు మృత్తికనుండి సుభంజన మగు భాండము, దుర్భేదమగు హేమమునుండి దుర్భేదమగు కలశము కలుగుచున్నవి. ఆవు చేనిలో మేయ దూడ గట్టున మేయదు.

ఇప్పటి వఱకు సాగించిన పరిశీలనము కాల కారణతను బ్రతిషేధించును గాని కాలమును బ్రతిషేధింపదు. కావున నిప్పుడు కాల మున్నదా లేదా యను విషయమును బరీక్షింప వలయును.

కాలము సత్పదార్థ మయిన, నది సంస్కృత పదార్థమో, యసంస్కృత పదార్థమో యగును. హేతు ప్రత్యయ సంజాత మగునది సంస్కృత పదార్థము. ఈ పదార్థ ముత్పాదస్థితిభంగసంగతము. ఈ యుత్పాద స్థితి భంగ ములు సాపేక్షములు గాని తాత్త్వికములు గావు. కావున తాత్త్వికముగాఁ, బారమార్థికముగా సంస్కృత పదార్థము లేదు. సంస్కృత పదార్థ మున్న నసంస్కృత పదార్థ ముండును. సంస్కృత పదార్థము పారమార్థికముగా లేనపుడు అసంస్కృత పదార్థము గూడ నుండదు. కావున

కాలము సంస్కృత పదార్థముగా నైన సిద్ధింపదు. అసం స్కృత పదార్థముగా నైనను సిద్ధింపదు. మఱెట్లు సిద్ధించును?

కావున కాలము పారమార్థికముగా లేదు.

ఇఁక రెండవ వాదము "భూత భవిష్యద్వర్తమానము లున్నవి; కావున కాల మున్న,"దని ప్రతిపాదించు చున్నది. భూత భవిష్య ద్వర్తమాన విభాగ శూన్యముగా కాల మర్థము కాదు. అట్లే యగుచో భూతమునకు భవిష్య ద్వర్త మానములకుఁ గల సంబంధమేమి? భూత మపేక్షించి తక్కినవి రెండు కలుగవలెను. లేదా యపేక్షింపక కలుగ వలెను.

భూతము నపేక్షించి భవిష్యద్వర్తమానములు గలుగు నేని, యీ రెండు కాలములు భూతమునం దుండవలయును. ఏల యన నొకదానియందు మఱొకటి లేనప్పుడు, ఆ మఱొకటి యీ తొలిదాని నపేక్షింపదు. ఇసుకయందుఁ దైలము లేదు. కావునఁ దైల మిసుక నపేక్షింపదు.

ఈ సందర్భమున నొక శంక కలుగ వచ్చును. చీఁకటి ప్రత్యేక పదార్థము గాదు. కావున నది లేదు. అయినను దత్ప్రతిపక్ష మగు ప్రకాశ మున్నది. అట్లగుటచే తమము ప్రకాశముచేతను, ప్రకాశము తమముచేతను నపేక్షితము లగుచున్న వని వాదింప వచ్చును. కాని యిది సాధ్యసమ మగుటచే యుక్తము గాదు.

ప్రకృత మనుసరింతము. బీజమునం దంకుర కాండ ములవలె భూతమునందు భవిష్య ద్వర్తమానము లున్నవని తలంప వచ్చును. భూతమునఁ దక్కుఁగల రెండు కాలము లున్న, నవి రెండును భూతమే యగును గాని భవిష్య ద్వర్తమానములు గాఁజాలవు పైఁగా వర్తమా నావస్థాతి

క్రాంత మైనది భూతము; ప్రవర్తమానావస్థ వర్తమానము. అసంప్రాప్త మైనది భవిష్యము. ఈ మూఁడును భూత మగుట యెట్లు ? ఒకదానియందు మఱొకటి యుండు టెట్లు ?

ఈ చిక్కు లన్నిటినిఁ బరిహరింప నెంచి భూతమునందు భవిష్య ద్వర్తమానములు లేవన వచ్చును. కాని యంత మాత్రమున భవిష్య ద్వర్తమానములు గలుగక పోవని వాదింప వచ్చును. ఈ పక్షమున భూతమునకు భవిష్య ద్వర్తమానములకు నపేక్ష యుండదు. భూత కాలాపేక్ష లేని భవిష్య ద్వర్తమానములు తురగ విషాణములు. భవిష్య ద్వర్తమానములు లేనప్పుడు భూత కాల మెట్లు సిద్ధించును ?

ఈ విధముగా భూత మపేక్షించి కాని, యపేక్షింపక కాని భవిష్య ద్వర్తమానములకు సిద్ధి లేదు. అట్లే వర్తమానాపేక్షచేఁగాని యనపేక్షచేఁ గాని భూత భవిష్యత్కాలములకు, అనాగ తాపేక్షచేఁ గాని యనపేక్షచేఁ గాని భూత వర్తమానములకు సిద్ధి లేదు.

తృతీయ వాదపరు లిట్లు చెప్పుదురు :— కాలము పరిమాణవంతము. కావున నది యున్నది. కలుగని గాడిద కొమ్ములు మూరెఁడును గావు, బారెఁడును గావు. కాలమున కట్లుకాక లవ ముహూర్త దివసాది పరిమాణ మున్నది. కావున కాల మున్నది.

ఈ వాద మొకప్పుడే సమర్థనీయము. కాలము క్షణాది వ్యతిరిక్తముగా నవస్థితమై యున్నచోఁ, క్షణాదులతోఁ గొలిచి గ్రహింపవచ్చును. కొలత పాత్రలకంటె

ఇట్లే ఉత్తమ మధ్య మాధమములు, కుశ లాకుశ లావ్యాకృతములు, ఉత్పాద స్థితి భంగములు, పూర్వాం తాపరాంత మధ్యాంతములు, కామరూ ప్యారూప్య ధాతువులు, ఏకత్వ ద్విత్వ బహుత్వములు, తక్కుంగల త్రిపదార్థ సంబం ధావస్థితములు నిద్ధింపవు.

నన్యము గావున ధాన్యమును గొలిచి గ్రహించుచున్నాము. కాని కాలము ధాన్యమట్లు తన్నుఁగొలుచుకొమ్మని కూటస్థముగా నవస్థితమై క్షణాదికముకంటె వేఱుగాలేదు. కావున క్షణాదికముచే గ్రహింపఁ బడుట లేదు. ఇట్లగుటచే స్థితమైన కాలము లేదు. లేని దానిని నెవ్వఁడు గ్రహింపఁ గలఁడు? గ్రహింపఁబడని కాల మెట్లు ప్రజ్ఞప్యమాన మగును?

"పోనిండు, నిత్యమై స్వభావ సిద్ధముగా రూపాది వ్యతిరిక్తముగా కాలము లేదు. కాని రూపాది సంస్కారములను బొంది ప్రజ్ఞప్యమాన మగుచు కాలము క్షణాది శబ్దముచే వాచ్యమగుచున్న" దని యనవచ్చును.

ఇదియు సిద్ధింపదు. ఏల యన భావమును బొంది కాలము కలుగుచున్నచో భావము లేనప్పుడు కాలము లేకపోవలయును. అద్ద మున్నప్పుడు ప్రతిబింబ నావకాశ మేర్పడుచున్నది. అద్దము లేనప్పుడు ప్రతిబింబము గలుగదు. వాస్తవముగా భావములు ప్రతిబింబ సమానములు. కావున నవి పారమార్థికములు గావు. భావమే పారమార్థికముగా లేనప్పుడు కాలము మాత్ర మెట్లు కలుగును? కాలమే లేనప్పుడు క్షణాది భేదము లెట్లేర్పడును?

కావున కాలము పారమార్థికముగా లేదు.

## ఆత్మ

కాల స్వరూపానంతరము పరీక్షణీయ మాత్మ. వైదిక దర్శనము లన్నియు నాత్మ నంగీకరించును. ఉగ్గుఁబాలతోపాటు ఆత్మ వాదముతోఁ బెరిగిన మన మీ సందర్భమున మాధ్యమక వాదమును నిర్లిప్తులమై విని జాగరూకతతో

ననుశీలనము గావించి యీ పిమ్మటనే సత్యము గ్రహింప వలయును.

రూపము, వేదన, విజ్ఞానము, సంజ్ఞ, సంస్కారము లను వానిని బౌద్ధులు పంచ స్కంధము లందురు. ఈ స్కంధ ములకు నాత్మకుఁ గల సంబంధ మేమి? ఇది తేలిన, నాత్మ స్వరూపము గూడ నిశ్చిత మగును. నాగార్జునుఁడు ప్రసంగా పాద ముఖమున ఆత్మను బ్రతిషేధించుచున్నాఁడు :—

స్కంధములే యాత్మ యనుచో దోష పరంపర వాటిల్లుచున్నది. స్కంధములు జనన మరణములకుఁ బాల్పడు చున్నవి. స్కంధములే యాత్మ యయినచో నాత్మ యుత్పాద భంగములు పొందవలయును. పైఁగా మున్ను లేని యాత్మ పుట్టవలసి వచ్చును. పుట్టుకవలన నది కృతకము గావలసి వచ్చును. మీఁదుమిక్కిలి కారణము లేకయే యాత్మ జన్మింప వలయును. దీనివలన నాత్మ కనిత్యతా దోషము సంప్రాప్తించును.

ఇంతియ కాదు; స్కంధములే యాత్మ యను పక్షమున స్కంధము లనేకములుగావున, నాత్మలనేకములు గావలయును. స్కంధములు పుట్టుచు గిట్టుచున్నవి. కావున నివి పుట్టుక గిట్టుకల ముందు వెనుకలఁ గలుగ నొల్లవు. ఇట్లే యాత్మయు నుత్పత్తి లయములు పొందుచు జనన మరణములకుఁ బూర్వా పర కాలములందు లేక పోవలయును. ఒకవేళ వీని నంగీక రింత మన్న కర్త చేసిన కర్మమునకు ఫలము గలుగక పోవలసి వచ్చును. విశేషించి యొకని కర్మ ఫలము వేఱొకఁ డను భవింప వలసి వచ్చును. అనఁగా దేవదత్తుని యౌషధ సేవనము విష్ణుగుప్తునకు స్వాస్థ్యము గలిగింప వలయును.

పైఁగా స్కంధములే యాత్మ యగుచోఁ గర్తృ కర్మ ముల కైక్యము వాటిల్లును. ఆ పక్షమున నగ్నీంధనములు,

ఛేత్తృచ్ఛేద్యము లొకటి కావలయును. ఇట్లొకటి యగుట లోక విరుద్ధము. అనుభవ విరుద్ధము.

ఈ హేతువులచే స్కంధము లాత్మ గాఁజాలవు.

పోనిండు, స్కంధములకంటె నాత్మ యన్య మగునా?

ఇదియు యుక్తి సహము గాదు. ఏల యన నీ పక్షమున స్కంధ లక్షణములకంటె నాత్మ లక్షణములు భిన్నములు గావలయును. అశ్వ లక్షణములకంటె గో లక్షణములు భిన్నములైనట్లే, స్కంధ లక్షణములకంటె నాత్మ లక్షణములు భిన్నములు గావలయును. అశ్వమునకు రింఖా హేషలు ప్రత్యేక లక్షణములు. ఇవి గోవునం దుండవు. అట్లే స్కంధములకు హేతు ప్రత్యయావాప్తియు, నుత్పాద స్థితి భంగముల కలిమియుఁ బ్రత్యేక లక్షణములు. ఈ లక్షణము లాత్మకుఁ గలుగరాదు. అప్పు డాత్మ హేతు ప్రత్యయోత్పాద స్థితి భంగరహితమై యకర్మకమై గగన సదృశము గావలయును. అజాతుఁడైన మానవునకు నామమైనఁ గలుగనట్లే, యాత్మ పదార్థమున కాత్మ యను పేరైనఁ గలుగక పోవలయును. మీఁదుమిక్కిలి యీదృశ మగు నాత్మకు తద్వ్యతిరిక్త లక్షణవంతములగు స్కంధములతో సంబంధ మేర్పడరాదు. "స్పర్శరహిత మగు భావమునకుఁ బ్రేరణము సంభవింపదు. కావున దేహ చేష్టకుఁ గర్త యయిన జీవుఁడే కలుగఁడు. పైఁగా నిష్క్రియమగు నది నాస్తితా సమానము."

ఈ సందర్భమున నిట్లాశంకింప వచ్చును. ఆత్మ వేఱు, స్కంధములు వేఱు. స్కంధ విలక్షణమైన విజ్ఞానమే యాత్మ యని తలంప వచ్చును. కాని చిత్త మెప్పుడును దనకంటె నన్యలక్షణము గల విషయమును గ్రహించుచున్నది. అట్టి చిత్తము పృథగ్లక్షణ సిద్ధమగు నాత్మను గ్రహింప వలయును.

కాని చిత్త మట్టి యాత్మను గ్రహించుట లేదు. కావున నాత్మ స్కంధవ్యతిరిక్తము గాఁజాలదు. ఇంతకు మున్ను నిశ్చయించిన రీతిగా స్కంధము లాత్మ గాదు.

పైని చెప్పుకొన్నట్లు గాక స్కంధముల నపేక్షించి యాత్మయు, నాత్మ నపేక్షించి స్కంధములును గలుగుచున్నవా? ఈ పక్షమున చెట్టుముందా విత్తుముందా యను ప్రశ్న పొడమును. అట్లుకాక ఆత్మ స్కంధములు సమకాలసిద్ధు లనుచో, నొండొంటికి సంబంధమే లేకపోవలయును. ఏకకాలోద్భవము లగు గోవిషాణ ద్వయమునకుఁ బరస్పర సంబంధ మేర్పడుటలేదు. వాస్తవమునకుఁ బరస్పరాపేక్షము లలో నేదియు సిద్ధింపదు.

ఇంతకు స్కంధముల నపేక్షించి కాని, యపేక్షింపక కాని యాత్మ సిద్ధించుటలేదు. అట్లే యాత్మ నపేక్షించికాని, యపేక్షింపక కాని స్కంధములకు సిద్ధి లేదు.

ప్రకృత సందర్భమున మఱొక యాలోచనము గలుగవచ్చును. దేవదత్తుఁడు ధనవంతుఁడు, లేదా బుద్ధిమంతుఁడని పలుకుచుందుము గదా! అట్టి సంబంధమే స్కంధములకు నాత్మకు నుండవచ్చునని యేల తలంపరాదు?

దేవదత్తుఁడు ధనవంతుఁడని పలికినపుడు ధనము వేఱు, దేవదత్తుఁడు వేఱు. అట్లే ఆత్మయు స్కంధములకంటె వేఱైనది గావలయును. ఇది యుక్తిసహము గాదని అన్యత్వ ప్రతిషేధ సందర్భమునఁ దేల్చికొంటిమి. ఇఁక దేవదత్తునకు బుద్ధికిఁ గలుగు సంబంధమే యాత్మకు స్కంధములకుఁ గలుగు ననుచో, నీ రెంటికి నైక్య మంగీకరింపవలయును. కాని యీ యైక్యము యుక్తిక్షమము గాదని యేకత్వ ప్రతిషేధ సందర్భమునఁ దేల్చికొంటిమి.

పైని చెప్పినట్లు గాక కూపములయం దుదకమట్లు గాని, ఘటమందు జలము లట్లుగాని స్కంధములం దాత్మ కాని, ఆత్మయందు స్కంధములుగాని యున్నవని చెప్ప వీలు గలుగకున్నది. ఏలయన ఆత్మ స్కంధముల కన్యత్వసిద్ధి లేదు గదా!

ఈ హేతువులనుబట్టియే యార్య నాగార్జునుఁడు,

ఆత్మనశ్చ సతత్త్వం యే భావానాం చ పృథ క్పృథక్।
నిర్దిశంతి న తా న్మన్యే శాసన స్యార్థ కోవిదాన్॥

అని వ్యాహరించెను.

ఇక్కడి ట్లాశంకింప వచ్చును. తర్కమే మైనఁ బ్రతిపాదింప వచ్చును. కాని గతమును స్మరించు కర్తయు, కర్మ ఫలములఁ గుడుచు భోక్తయు నున్నాఁడని యనుభవము చెప్పు చున్నది. యుక్తి లేదని సాధించు చున్నను వహ్ని దహింపక మానదు. కడిగి యెసటఁ బోసిన బియ్యము ముడుకక మానవని తలంప వచ్చును. మాధ్యమకు లీ యనుభవమును ద్రోసి రాజనుట లేదు. వారు విషయములకు వ్యావహారిక సత్త నంగీకరించు చున్నారు. "అద్దము గ్రహించి ముఖ ప్రతి బింబము పొందు చున్నాము. వాస్తవముగాఁ బ్రతిబింబము లేదు. స్కంధములను బొంది యహంకారము గోచర మగు చున్నది. ప్రతిబింబమువలె నహంకారమును వాస్తవము గాదు. ఆదర్శము గ్రహింప నప్పుడు ప్రతిబింబము గలుగ నట్లే, స్కంధములు లేనప్పు డహంకారమును గలుగదు," అని యార్య నాగార్జునుఁడు చెప్పుచున్నాఁడు.

ఇదియే సిద్ధాంత మగుచో బౌద్ధ శాసనమున నొక్కెడ నాత్మ యున్న దనియు, వేఱొక యెడ లేదనియు నింకొక యెడ నుండియు నుండ దనియు, మఱొక్క యెడ నున్న దియుఁ

గాదు లేనిదియుఁ గాదనియుఁ గానఁబడుచున్నది. ఈ విభిన్నోపదేశముల కైక్య మెట్లు సిద్ధింపఁగల దని సంశయ పడవచ్చును. కాని వైద్యు లెల్లరోగములకు నేకైకౌషధము వాడుట లేదు. రోగ భేదమును బట్టి యౌషధ భేదము గలుగుచున్నది. అట్లే వినేయ జనుల యధికారితా తారతమ్యమునుబట్టి యుపదేశ తారతమ్యము గలుగుచున్నది. దీనిని దృష్టియం దిడుకొనియే యార్యదేవుఁడిట్లు చెప్పియున్నాఁడు:-

> వారణం ప్రాగపుణ్యస్య మధ్యే వారణ మాత్మనః।
> సర్వస్య వారణం పశ్చా ద్యో జానీతే స బుద్ధిమాన్॥

చంద్రకీర్తి యాత్మ స్కంధముల వ్యావహారికత్వము చాటు నీ ప్రాచీనోక్తి నుదాహరించినాఁడు :—

> యథా యంత్ర కృతం తూర్యం వాద్యతే పవనేరితమ్
> న చాత్ర వాదకః కశ్చి న్నిశ్చరం త్యథ చ స్వరాః॥
> ఏవం పూర్వ సుశుద్ధత్వాత్ సర్వ సత్వాశ యేరితా।
> వా గ్నిశ్చరతి బుద్ధస్య నా స్యాస్తీహ కల్పనా॥

ఇట్లు వ్యావహారికము లగు నాత్మ స్కంధములు పరస్పరాపేక్షవలననే సిద్ధించుచున్నవి. పరస్పరాపేక్షచే సిద్ధించునవి పరమార్థములు గావు. ఈ కారణముచే ఆర్య నాగార్జునుఁడు

> ఏవం నాన్య ఉపాదానా న్న చోపాదన మేవ సః।
> ఆత్మా నా స్త్యనుపాదానో నాపి నా స్త్యేవ నిశ్చయః॥

అని సిద్ధాంతీకరించి యున్నాఁడు. ఇక్కడ "ఈ నిశ్చయమును లేనిదే," యను నాగార్జునుని వాక్యమే యతని నితరాచార్యులనుండి వేఱు పఱుచు చున్నది.

## తథాగతుఁడు (ఈశ్వరుఁడు)

ఆత్మయే పారమార్థికముగ లేనప్పుడు తథాగతుఁడు (ఈశ్వరుఁడు) గూడఁ బారమార్థికముగాఁ గలుగ నవకాశము లేదు. ఆత్మ నిత్యత్వ ప్రతిషేధ సందర్భమునఁ బ్రదర్శితము లగు నుపపత్తులే తథాగత నిత్యత్వ ప్రత్యాఖ్యాన సందర్భమున నాగార్జునుఁడు చూపియున్నాఁడు.

తథాగతుఁ డను నొక పదార్థ మున్న పక్షమున, నది యమలము నిష్ప్రపంచము గావలయును. లేదా స్కంధ స్వభావము గావలయును. కాకున్న స్కంధవంతుఁడు గావలయును. అదియుఁ గాకున్న స్కంధములందు తథాగతుఁ డుండవలయును. ఈ పక్షములం దేదియు విచార క్షమముగాదు.

స్కంధములే తథాగతుఁ డయిన, నింధనమే యగ్ని గావలయును. అప్పుడు కర్తృ కర్మముల కైక్యము వాటిల్లును. మఱియు తథాగతుఁడు గూడ నుత్పాదస్థితి భంగములకుఁ బాల్పడును.

ఈ దోషములఁ బరిహరింప నెంచి తథాగతుఁడు స్కంధములకంటె నన్యుఁడని చెప్పుచో స్కంధములకంటె వేఱుగా తథాగతుఁడు గలుగవలయును. కాని యింధనము విడిచి వేఱుగా వహ్ని లేదుగదా! ఒకవేళ నిట్టి యునికి సంభవమేని యగ్ని నిర్హేతుకమై యెప్పుడును బ్రజ్వరిల్లవలయును. అట్లే తథాగతుఁడును హేతు రహితుఁడై స్కంధములతో నిమిత్తము లేక నిత్యుఁడై యుండవలయును. అప్పు డతఁ డకర్మకుఁ డగును. అనఁగా ప్రపంచ స్రష్టగాక యస్కంధ లక్షణుఁ డగును. ఇట్లగుట యుక్తము గాదు.

పై పక్షములనుఁ బోవిడిచి కూపమందు జలములవలె తథాగతునియందు స్కంధము లున్నవని కాని, ఘటము

లందుఁ జలమట్లు స్కంధములందు తథాగతుఁ డున్నాఁడని కాని చెప్ప నవకాశములేదు. కాదని చెప్పఁగొన్న వీని రెంటికి పరస్పరాన్యత్వ మంగీకరింపవలసి వచ్చును. ఈ యన్యత్వము యుక్తిక్షమము గాదని యింతకుముందు జరపిన పరీక్షవలనఁ దేలినది గదా!

దేవదత్తుఁడు ధనవంతుఁడు రూపవంతుఁడని చెప్పు చున్నట్లు తథాగతుఁడు స్కంధవంతుఁ డనియేని చెప్ప వీలుగాదు. ఏలయన దేవదత్తునకు ధనమునకుఁ గలుగు సంబంధమే తథాగతునకు స్కంధములకుఁ గల దనుచో, వీనికిఁ బరస్పర విభిన్నత నామోదింప వలయును. ఈ విభిన్నతయు నంగీకార్యము గాదని యితః పూర్వమే నిశ్చితము గదా! దేవదత్తునకు రూపమునకుఁ గల సంబంధమే తథాగతునకు స్కంధములకుఁ గల దనుచో, నీ యుభయమునకు నైక్య మంగీకరింప వలసి వచ్చును. ఈ యైక్య మంగీకార్యము గాదని మున్నే తేలిపోయినది.

ఇ ట్లీపక్షములలో దేనివలనను తథాగతుఁడు సిద్ధింప కున్నాఁడు. ఇంక వీని కతీతుఁడై తథాగతుఁ డెట్లు కలుగును?

ఈ పక్షములను బరిత్యజించినను తథాగతుఁడు సిద్ధింపఁగలఁడు. అమలము లగు స్కంధములనుబట్టి తత్త్వా తో౽న్యుఁ డగు తథాగతుఁ డనిర్వాచనీయుఁ డని వ్యవస్థాపింప వచ్చునని తలంప వచ్చును. ఇట్లగుచో కారణ సామగ్రిని బట్టి ప్రతిబింబము వలె, అమలస్కంధములనుబట్టి తథా గతుఁడు ప్రజ్ఞప్యమానుఁ డగు నని చెప్పవలయును. కాని ప్రతిబింబము సస్వభావము గాదు. అట్లే తథాగతుఁడును సస్వభావుఁడు గాఁడు.

సస్వభావుఁడు గాక పోవుఁ గాక. దీనివలన బాధ యేమి? పర భావమువలననే తథాగతుఁడు ప్రజ్ఞప్యమానుఁ డగు నని

యందు మేని, పర భావము గూడ సిద్ధించుట లేదు. ఏల యన స్వభావమే కలుగ నప్పుడు పర భావ మెట్లు కలుగును?

ఇట్లు స్వభావ పరభావములు సిద్ధింప నప్పుడు తథాగతుఁ డెట్లు సిద్ధించును ? పదార్థ మొకటి యున్న, నది స్వభావమో, పరభావమో కాఁగలదు. కాని స్వభావ పర భావములు రెండును గలుగ నప్పుడు తథాగతుఁ డను నీ యపర పదార్థ మేమి ? కావున తథాగతుఁడు లేఁడు.

పంచ స్కంధములును ప్రతీత్య సముత్పన్నములే కాని, స్వభావముచే లేవు. ఏల యన వీనికిఁ గూడ హేతు ప్రత్యయము లున్నవి. తథాగ తాపేక్ష (ఉపాదాతయొక్క యపేక్ష) వీనికిఁ గలుగు చున్నది. ఉపాదాత్రపేక్ష లేనప్పుడు ఉపాదానము (పంచస్కంధములు) గలుగదు. కావున నుపాదానము స్వభావ సిద్ధము గాదు.

స్వభావముచే లేనిది పరభావముచే నెట్లు కలుగును ? కావున నుపాదానము శూన్యము. శూన్య మగు నుపాదానముచే శూన్యుఁడగు తథాగతుఁడెట్లు ప్రజ్ఞప్యమానుఁ డగును? కావున స్కంధములనుబట్టి తథాగతుఁడు ప్రజ్ఞప్యమానుఁ డనుట సిద్ధింపదు.

ఈ రీతిగా తథాగతుఁడు మాయోపముఁడు, స్వప్నోపముఁడు. బుద్ధధర్మములు స్వప్నోపములే. ప్రకృతమున నొక విశేష మవశ్యము గ్రహింప వలయును. అనిర్వాచ్యుఁడైన తథాగతునకు మాధ్యమికులు సర్వథా నాస్తిత్వము చెప్పరు. ఏల యన అనిర్వాచ్యుఁ డగు తథాగతుని శూన్యుఁ డని కాని యశూన్యుఁ డని కాని, శూన్యాశూన్యుఁ డని కాని, తదనుభయుఁ డని కాని చెప్ప నెట్లు శక్య మగును ? అనిర్వచనీయతను ప్రతిపత్త యెట్లు ప్రతిపాదింపఁ గలఁడు? కావున వ్యవహార సత్యమునందు నిలిచి మాధ్యమికులు వినేయ

జనానుగోధముగాఁ దత్త్వమును శూన్య మని, యశూన్యమని, శూన్యాశూన్య మని, యేత దనుభయ మని చెప్పుచున్నారు.

తత్త్వ మిట్టి దైనప్పుడు లోకము శాశ్వత మని కాని, యశాశ్వత మని కాని, శాశ్వతాశాశ్వత మని కాని, తదనుభయ మని కాని, అంతవంత మని కాని, యనంతవంత మని కాని, యంతానంతవంత మని కాని, తదనుభయ మని కాని, తథాగతుఁడు మరణానంతర మున్నాఁ డని కాని, లేఁడని కాని ఉండియు లేఁడని కాని, ఉన్నవాఁడు గాఁడు లేని వాఁడును గాఁడని కాని చెప్ప శక్యము గాదు. అట్లే శరీరమే జీవుఁడు; శరీరము వేఱు, జీవుఁడు వేఱని కాని నిర్ధరింప వీలు లేదు. ఈ విధముగా నీ పదునాలుగు వస్తువు లవ్యాకృత ములు గావున నవ్యాకృత వస్తువు లని వ్యాహరింపఁ బడు చున్నవి.

ప్రపంచాతీతుఁడు, నవ్యయుఁడు నయిన బుద్ధుని (ఈశ్వరుని) ప్రపంచించు వారందఱు దత్ప్రపంచోపహతులై తథాగతుని గ్రహింప లేకున్నారు.

ప్రపంచము వస్తు నిబంధనము. తథాగతుఁ డవస్తుకుఁడు. కావున నతఁడు ప్రపంచాతీతుఁడు; అనుత్పాద స్వభావుఁడు; స్వభావాంత రాగమనుఁడు. కావున నతఁ డవ్యయుఁడు. ఇట్టి తథాగతుని స్వోత్ప్రేక్షిత మిథ్యా పరికల్పిత మలిన మానసతచే నభూతములు వివిధములు నయిన పరికల్ప విశేషములచే బాలురు బుద్ధుని ప్రపంచించు చున్నారు. స్వకీయ ప్రపంచోపహతులై తథాగత గుణ సమృద్ధి కత్యంత పరోక్షవర్తు లగుచున్నారు.

తథాగతుని స్వభావ మెట్టిదో, జగత్స్వభావము గూడ నట్టిదే. తథాగతుఁడు నిఃస్వభావుఁడు. ఈ జగత్తును నిఃస్వభా

వము. ఈ యర్థమునే మాధ్యమక కారిక యిట్లు చెప్పుచున్నది :

తథాగతో యత్స్వభావ స్తత్స్వభావ మిదం జగత్ ।
తథాగతో నిఃస్వభావో నిఃస్వభావ మిదం జగత్॥ 22 - 16.

ఈ సందర్భమున నొక విషయమును బేర్కొన వలసి యున్నది. "మాధ్యమికులు కుశలాకుశల ధర్మములు, కర్తృ కర్మ ఫలములు, నీసమస్త లోకము భావ స్వభావ శూన్య మని చెప్పుచున్నారు. నాస్తికులు నివి లే వనుచున్నారు. కావున నాస్తికులకంటె మాధ్యమికు లవిశిష్టులు," అను పరిచోదనను బ్రస్తావించి యాచార్య చంద్రకీర్తి యిట్లు సమాధానించుచున్నాఁడు :—

"నాస్తికులు మాధ్యమికులు నొకటికాదు. హేతు ప్రత్యయములను బొంది యిహ పరలోకములు, సర్వభావ ములు గలుగుచున్నవి గావున నివి నిఃస్వభావములని ప్రతీత్య సముత్పాద వాదులగు మాధ్యమికులు చెప్పుచున్నారు. నాస్తికులు యథా స్వరూప వాదులు గారు. ప్రతీత్య సముత్పాద వాదము వ్యవస్థాపించు శూన్యత పరలోకాదుల యభావమును బ్రతిపాదించుట లేదు. ఐహాలౌకిక వస్తు జాతమునుబట్టి యిది యిహ లోకమునుండి పరలోకమునకు, పరలోకమునుండి యిహాలోకమునకుఁ బోవుటను మాత్ర మంగీకరించుట లేదు. నాస్తికులు కేవల మిహాలోకోపలబ్ధ పదార్థ సదృశ పదార్థాంతరమును నిరాకరించు చున్నారు.

"అట్లైనను నాస్తికులు గూడ వస్తు స్వరూపముచే లేని దానికే నాస్తిత్వము చెప్పుచున్నారు. ఈ విధముగా నైనను మాధ్యమక దర్శనముతో నాస్తిక వాదమున కీ మాత్రము సామ్య మున్నది గదా," యన వచ్చును. కాని వాస్తవముగా

నే మాత్రము సామ్యము లేదు. మాధ్యమకులు సంవృతి సత్యము నంగీకరించుచున్నారు.

"వస్తుతా మాత్రముగా నైన నీయిరు పక్షములకుఁ దుల్యత యున్నది కదా!" యన వచ్చును. కాని యిట్లును దుల్యత లేదు. ఏల యన ప్రతిపత్తృ భేద మున్నది? ఎట్లన నొకఁడు దొంగతనము చేసె ననుఁడు. ఆ చేసిన దానిని జక్కఁగా నెఱుఁగకయే యా చోరుని శత్రువుచేఁ బ్రేరితుఁడై మఱొకఁడు న్యాయస్థానమునం దా చోరుడు దొంగతనము చేసె నని వాదించె ననుఁడు. వేఱొక న్యాయవాది వాని దొంగతనమును గనులారఁ గాంచి యతఁడు దొంగ యని వాదించె ననుఁడు. ఈ న్యాయవాదుల వాదార్థమునందు వాస్తవ భేదము లేదు. కాని పరిజ్ఞాతృ భేదమునుబట్టి యొకఁడు మృషావాది యనియు, వేఱొకఁడు సత్యవాది యనియుఁ, బేర్కొనఁబడుచున్నారు. ఒకఁ డపయశస్సు నపుణ్యము లెస్సగాఁ బరిశీలించి ప్రమాణ మగుచున్నాఁడు. రెండవవాఁడు ప్రమాణేతరుఁ డగుచున్నాఁడు. ఇట్లే యథాభూతముగా, వస్తు స్వరూ పాభావమును జెప్పుచు, పొందుచు మాధ్యమకులు యథాభూతముగా వస్తు స్వరూపము దెలియని నాస్తికులతో సమాను లగుటలేదు. ఇరువురకు జ్ఞానాధానాద్వయమందుఁ దుల్యత లేదు.

"ఒకఁడు జ్ఞానియై మఱి యొకఁ డజ్ఞానియై యుపేక్ష వహించు చున్నారు. ఈ యిరువురకు నుపేక్ష సామాన్యమే. విషమ ప్రదేశ ప్రపాతమున జనుపాంధునకుఁ జక్షుష్మంతునకు సామ్యమున్నది. ఇట్టి సామ్యమే పృథగ్జ నార్హతుల కున్నది. అంత మాత్రమున నిరువు రొకటి కాదు. వీ రిరువురకు గొప్ప యంతరు వున్నది గదా! అట్లే నాస్తికులకు మాధ్యమకులకు మహావిశేషము గలదని పూర్వాచార్యులు చెప్పుచున్నారు."

# స్వ భా వ ము

మాధ్యమక వాదమున తథాగత స్వభావము జగత్స్వభావము నొకటియే యని పేర్కొనఁ బడినవి. ఈ జగత్తు నిః స్వభావ మని నాగార్జునుల వ్యాహృతి. నిః స్వభావ మను పదము నర్థ మెఱుఁగ వలయు నన్న స్వభావ మను పదమున కర్థము మున్ను గ్రహింప వలయును.

సామాన్యముగా జలమునకు శైత్యము, నగ్ని కౌష్ణ్యము స్వభావమని యందుము. జలముల యౌష్ణ్యము కృతక మందుము. ఈ పరిచ్ఛేద మెట్లు కలుగు చున్నది ? పదార్థాంతర సంపర్కముచే నజాత మగునది స్వభావ మనియు, తత్సంపర్క జన్య మగునది కృతక మనియు వ్యవహరింపఁ బడుచున్నవి. ఈ యర్థమును భంగ్యంతరమున నిట్లు చెప్ప వచ్చును. హేతు ప్రత్యయ రహితమగునది స్వభావము. హేతుప్రత్యయ సంజాత మగు నది కృతకము.

స్వభావ మని లోకము పేర్కొను నర్థమెల్లఁ గృతకమే. ఉష్ణ మగ్ని స్వభావ మని యందుము. కాని వహ్నిని విడిచి యుష్ణము వేఱుగా లేదు. ఈ వహ్నియు నిర్హేతుకము గాదు. హేతు ప్రత్యయములను బొందియే యిది యుద్భవించు చున్నది. కావున నుష్ణము గూడ హేతు ప్రత్యయ సంజాతము. ఇట్లగుటచే స్వభావ మని పేర్కొనఁ బడుచున్న యీ యుష్ణము నీటి వేఁడిమి యట్లు కృతకమే కాని స్వాభావికము గాదు.

ఇక్కడ స్వభావ మనఁబడు దాని యర్థము పరిశీల నార్హము. తనయొక్క భావము స్వభావము. అనఁగాఁ బదార్థపు టాత్మీయ రూపము స్వభావము. ఆత్మీయము గాని రూపము కృత్రిమము. ఏది యెద్దాని కాయత్తమై యుండునో,

యదియు నాత్మీయమే. పరాయత్త మగు నది స్వభావము గాదు. తాత్కాలి కాయాచితక మైనది యస్వతంత్రము.

అగ్ని హేతు ప్రత్యయ ప్రతిబద్ధమై ప్రభవించు చున్నది. కావున నుష్ణత యగ్నికి స్వభావముగాదు. స్వభావమే యగుచో నయ్యది త్రైకాల్యమునఁ బ్రత్యయాపేక్ష లేకయే యుండవలయును. హేతుప్రత్యయము లున్నప్పు డగ్ని యుండుటయు నవి కలుగునప్పుడు లేకపోవుటయు సంభవించు చున్నది. ఇట్లు కానిచో వలయు నెడ నగ్ని నుత్పాదించుటయు, వలవనియెడ నిర్వాపణ మొందించుటయు దుశ్శక మయ్యెడివి. కావున నగ్ని కుష్ణము స్వభావము గాదు. అగుఁగాక, మఱి దాని స్వభావమేమి? ఆ స్వభావము స్వభావముచే నున్నదికాదు. లేనిదియుఁగాదు. అట్లయినను మాధ్యమకులు శ్రోతల యుత్త్రాస పరివర్జనార్థము సంవృతిచే దాని నారోపించి యున్నదని చెప్పుచున్నారు. వాస్తవముగా

> శూన్య మితి న వక్తవ్య మశూన్య మితి వా భవేత్ ।
> ఉభయ న్నోభయం చేతి ప్రజ్ఞప్త్యర్థం తు కథ్యతే॥

అధ్యారోపమునఁ జేసి యున్నదని చెప్పుచో నది వాస్తవముగా నెట్లుండును?

"ధర్మముల ధర్మతయే దాని స్వరూపము. ఈ ధర్మముల ధర్మత యేమి? ధర్మముల స్వభావము. ఈ స్వభావ మేమి? ప్రకృతి. ఈ ప్రకృతి యేమి? శూన్యత. ఈ శూన్యత యేమి? నైఃస్వాభావ్యము. ఈ నైఃస్వాభావ్య మేమి? తథత. ఈ తథత యేమి? తథాభావము, అవి కారిత్వము, 'సదైవ స్థాయిత్వము.' సర్వదా అనుత్పాదము."

ఈ రీతిగా నకృత్రిమ మైన స్వభావము పరనిరపేక్షము. భావముల కనుత్పాదక మైన స్వభావ మకించనము. కావున భావమునకు స్వభావము లేదని మాధ్యమకు లందురు.

స్వభావము లేనప్పుడు పర భావము గూడ నుండదు. ఏల యన స్వభా వాంతా రాపేక్షచే స్వభావము పేర్కొనc బడుచున్నది. శైత్య భావ సలిలాపేక్షచే నగ్నికి నుష్ణత స్వభావ మని చెప్పుదుము. కాని స్వభావమే లేనప్పుడు పర భావ మెట్లు కలుగును ? కావునc బరభావము లేదు, స్వభావమును లేదు.

ఇక్కడ భావము (వస్తువు) యొక్క స్వభావ పర భావములు మాత్రమే ప్రతిషిద్ధములు గాని, భావము ప్రతిషిద్ధము గాదని తోcప వచ్చును. కాని పరభావమో స్వభావమో కలుగని భావము లేదు. కావున భావమే లేదు. భావము లేక పోయినను అభావము కలుగవచ్చునని యాశంకింప వచ్చును. కాని భావ మున్న నభావ ముండును. ఉన్న ఘటాదులు వర్తమానావస్థా ప్రచ్యుతములై యన్యథాభావమును బొంది యభావ ధ్వని వాచ్యము లగుచున్నవి. ఘటాదులు భావ రూపముతో సిద్ధింప నప్పుడు అవిద్యమాన స్వభావములకు నన్యథాత్వ మెట్లు సిద్ధింపc గలదు ? కావున నభావము గూడ లేదు.

ఇట్లు స్వభావము గాని, పర భావము గాని, భావము గాని, యభావము గాని సిద్ధింపదు.

> స్వభావం, పరభావం చ, భావం, చాభావ మేవ చ ।
> యే పశ్యంతి, న పశ్యంతి తే తత్త్వం బుద్ధ శాసనే ॥
>
> మా. కా. 15_6

" కాశ్యప ! యున్నది యనునది యొక యంతము. లేదను నది మఱియొక యంతము. ఈ రెండంతములలో

మధ్యమ మగునది యరూప్యము, అనిదర్శనము, అప్రతిష్ఠి తము, అనాభాసము, అనికేతనము, అవిజ్ఞప్తికము. కాశ్యప! యీ ధర్మముల భూత పర్యవేక్ష మధ్యమా ప్రతిపత్తని చెప్పఁబడు చున్నది.''

ప్రకృతిచే నొకదాని కస్తిత్వము కలుగు నేని, దానికి నాస్తిత్వము కలుగఁ జాలదు. అగ్ని మున్నగు నవి ప్రకృతిచే నున్న వగు నేని, వాని ప్రకృతి మాఱరాదు. ప్రకృతి యవికారిణి గదా! ఆకాశపు టనావరణత్వమున కన్యథాత్వము గలుగదు. అట్లే యగ్న్యాదులకుఁ బ్రకృతి యున్నచో నది మాఱదు. కాని వాని కన్యథాత్వ మగు నుపశమాదికము గానిపించుచున్నది. కావున నగ్న్యాదుల కౌష్ణ్యాదికము ప్రకృతి కాదు.

నిక్కముగాఁ బ్రకృతి యన్యథాత్వము పొందదు. కాని యన్యథాత్వము లోకమున గనఁబడు చున్నది. కావున భావములకుఁ బ్రకృతి లేదని చెప్పవచ్చునా?

ప్రకృతియే కలుగ నప్పు డన్యథాత్వ మెద్దానికిఁ గలుగును?

ఇక్కడ శంక యొకటి పొడమ వచ్చును. అవిద్యమాన ప్రకృతికమున కన్యథాత్వము గలుగదు. కాని యన్యథాత్వము గనిపించు చున్నది. అగ్ని శాంత మగు చున్నది. కావున స్వభావ మున్న దేమో?

ఇంతకు మున్ను ప్రకృతి యవికారిణి యని తేలినది. కాని మీరు భావముల కన్యథాత్వము గానిపించు చున్న దనుచున్నారు. దీనినిబట్టి వానికి ప్రకృతి లేదని నిశ్చిత మగు చున్నది. అట్లయ్యు ఈ నిశ్చితి పరప్రసిద్ధాన్యథాత్వ దర్శనమునుబట్టి యేర్పడుచున్నది. అంతే కాని మాధ్యమ

కులు దేనికి నన్యథాత్వము చెప్పుట లేదు. అత్యంతము ప్రకృతి లేని దగుచు, సర్వ ధర్మము లస్వాభావములై యసం విద్యమానము లగుచుండ, అన్యథాత్వ మనునదియు నవిద్య మాన మగుచుండఁగా భావమున కస్తిత్వము నాస్తిత్వము గల్పించు వారికి ఉన్నది యను శాశ్వత గ్రాహము లేదను నుచ్ఛేద దర్శనము గలుగును. ఈ గ్రాహము, దర్శనము స్వర్గాపవర్గ మార్గాంతరాయకరములు. కావున నిది మహా నర్థకము. ఇట్లగుటచే విచక్షణుఁడు అస్తి నాస్తిత్వముల నాశ్ర యింపరాదు. ఏలయన స్వభావముచే నున్న దానికి లేమి లేదను శాశ్వతగ్రాహము, ఇప్పుడు లేదు పూర్వమున్న దను నుచ్ఛేద గ్రాహమును గలుగును.

## వి ప ర్యా స ము

ఇప్పుడు దార్శనికులకుఁ గంటక ప్రాయ మగు విపర్యా సమును బరిశీలింప వలయును. సర్వభావములు ప్రతీత్య సముత్పన్నములై నిఃస్వభావములై శూన్యము లగుచున్న ప్పుడు విపర్యాసము గూడ సాపేక్షమై శూన్యము గాక తప్పదు. ఈ యర్థమునే యార్య నాగార్జునుఁ డిట్లు ప్రతిపా దించుచున్నాఁడు :—

రాగ ద్వేష మోహములు క్లేశములని చెప్పఁబడు చున్నవి. ఈ క్లేశములు సంకల్ప ప్రభవములు. ఇవి శుభాశుభ విపర్యాసములను బొంది పుట్టుచున్నవి. అనఁగా చిత్తమో, యాత్మయో శుభాశుభ విపర్యాసములను బొంది రాగ ద్వేష మోహములను గల్పించుకొనుచున్నది. గోడ యున్నఁ జిత్రము, వెంద్రుకలున్నఁ గొప్పు గలుగ వలను పడును. అట్లే యాత్మయో, చిత్తమో యున్న రాగ ద్వేష మోహములు సంభవము లగును. కాని చిత్తమేని,యాత్మయేని

సిద్ధింపదని యితః పూర్వమే తేలిపోయినది. కాని క్లేశము లనుబట్టి క్లిష్టమగు చిత్తము సిద్ధింపఁగూడదా యను నాశంక కలుగవచ్చును. ఇది యథార్థ మగుచో క్లేశములే చిత్తము గావలయును. లేదా, క్లేశములకంటెఁ జిత్త మన్యము గావలయును. లేదా, క్లేశములందుఁ జిత్తము గలుగవలయును. లేదా, చిత్తమందుఁ గ్లేశములు గలుగవలయును. ఈ నాలుగు పక్షములం దేదియు సమ్మతము గాఁ జాలదు. ఒకవేళ నంగీకరింతమన్న నెదురించు దోషములు ఆత్మస్కంధ పరీక్షలో సుసంఖ్యాతములైనవి. కావున క్లేశములు లేవు, ఆత్మయును లేదు.

క్లేశములు శుభాశుభ విపర్యాసములను బొంది కలుగు చున్నవని పేర్కొనఁబడినవి గదా! క్లేశములు గలుగ కున్నను శుభాశుభ విపర్యాసము లుండ వచ్చును గదా! యను శంక పొటమరింప వచ్చును. కాని యివియు రూప శబ్ద స్పర్శ రస గంధ ధర్మములను బొంది కలుగు చున్నవి. ఈ రూపాది షట్కము పరికల్ప నా మాత్రము, నిఃస్వభావము, గంధర్వనగ రాకారము, మరీచి స్వప్న సన్నిభము.

పైఁగా నశుభము నపేక్షించి శుభము, శుభము నపే క్షించి యశుభము గలుగుచున్నవి. కావున హ్రస్వ దీర్ఘ ములు, బీజాంకురములు, పారావారములు వలె నీ శుభా శుభములు అస్వతః సిద్ధములు. శుభాశుభములు సిద్ధింప నప్పుడు రాగ ద్వేష మోహము లెట్లు సిద్ధింపఁగలవు?

ఇంక విపర్యయమును బరీక్షింప వలయును. అనిత్య త్వము, దుఃఖత్వము, అశుచిత్వము, అనాత్మత్వము అని విపర్యయము నాలుగు విధములు. అనిత్యమందు నిత్య మను గ్రాహము విపర్యయ మని ప్రాయికముగాఁ బేర్కొనఁబడు

చున్నది. తత్త్వము శూన్య మైనప్పు డనిత్యత్వము లేదు. అగుచో నిత్య దర్శన మను విపర్యాస మెట్లు కలుగును ?

వైదిక దార్శనికులను నాగార్జునుడు ప్రకృత సందర్భమున నిట్లు ప్రశ్నించుచున్నాడు:— అనిత్యమందు నిత్యమను గ్రాహము విపర్యయ మయిన, అనిత్య మను గ్రాహము గూడ విపర్యయ మేలకాదు ?

నిత్యానిత్యములు గూడ విపర్యాసము లగు నప్పుడు వీని కపరమై విపర్యయము గానిది లేదు. అవిపర్యాసమే లేనప్పుడు విపర్యాసము దేని నపేక్షించి కలుగును? ఇట్లే న్యాయముచేఁ గూడ విపర్యయము లేదు. విపర్యయము లేదు గావున స్వరూపముచే నవిద్య లేదు. అప్పుడు అనిత్యమందు నిత్యమను విపర్యాసము గలుగదు.

అనిత్యమందు నిత్య మను గ్రాహము విపర్యయము గాక పోవచ్చును. కాని యీ గ్రాహమనునది యున్నది. ఇది సంగ్రహణ మగు భావ రూపము. దీని కవశ్యము నిత్యత్వాది కరణము, సాధనము గలుగవలసి వచ్చును. అప్పుడు స్వతంత్రమగు నిత్యాత్మయో, చిత్తమో కర్త గావలసి వచ్చును. కర్త కప్పు డీప్సిత రూపాది విషయ కర్మము కలుగ వలయును. ఈ విధముగా భావ కరణ కర్తృ కర్మములకు సిద్ధి గలుగుచుండఁగా సర్వము సిద్ధించుచున్న దని ప్రతిపక్షి భావింప వచ్చును.

కాని యెవఁడు దేనిచే (నిత్యత్వాదికమగు నే కరణభూతముచే), నే వస్తువును (కర్మభూత మగు నే రూపాదికమును) గ్రహించుచున్నాఁడు ? కర్త లేఁడు. ఏల యన నాత్మ కస్తితా నాస్తితలు రెండును సిద్ధింపవని మున్నే నిశ్చితము. కర్మమును లేదు. ఏల యన రూప శబ్ద స్పర్శ

రస గంధ ధర్మములు సాపేక్షములు. ఇంక ననిత్యాదిక మగు కరణము లేవని యితః పూర్వము నిరూపితము. ఈ విధముగా కర్తృ కర్మ కరణములకు సిద్ధి లేదు. మఱి గ్రాహ మెట్లు గలుగును ? కావున గ్రాహమును లేదు. ఇట్లు సర్వ ముపశాంతము.

ప్రకృతమున నిట్లాశంకింప వచ్చును. విపరీతుఁ డున్నాఁడు. కావున విపర్యయ మున్నది యని యనుమా నింప వచ్చును. కాని యింతకు మున్ను మిథ్యా గ్రాహము గాని, సమ్యగ్గ్రాహము గాని లేవని నిరూపింపఁబడినవి. ఇట్లు లేని యీ విపర్యయ మెవనికిఁ గలుగును ? విపరీతునకుఁ గలు గునా ? ఇది యసంభవము, ఏల యన విపరీతుఁడు విపరీ తుఁడే. అతనికిఁ గ్రమ్మఱ విపర్యయ సంబంధ మెట్లు కలు గును ? పైఁగా విపరీతునకు తిరిగి విపర్యయము కలుగుట వలనఁ బ్రయోజనము లేదు. ఇంక నవిపరీతునకు విపర్య యము గలుగుటయు యుక్తముగాదు. యుక్తమే యనుచో నజ్ఞాననిద్రా తిమిరోపశమమువలన విబుద్ధి బుద్ధి నయనులగు బుద్ధులకు విపర్యయము గలుగ వలయును.

ఇఁక విపర్యయము విపరీ తావిపరీతులకంటె నన్యుఁ డగు వానికిఁ గలుగవలయును. అట్టివాఁ డెవఁ డున్నాఁడు ?

ఇది యిట్లుండ విపర్యయము, విపరీతుఁడు అనునవి భావములు. భావములు తమవలనఁ గాని, అన్యమువలనఁ గాని, యీ యుభయమువలనఁ గాని, యీ యనుభయము వలనఁగాని కలుగుటలేదు. కావున విపరీతుఁడుగాని విపర్య యముగాని యెట్లు కలుగును ?

కావున విపర్యయములేదు. ఇది లేబర మైనప్పుడు ఆత్మ, శుచి, నిత్యత్వము లేనివని తలంపవచ్చును. ఇట్లాత్మ

దులు లేని వగుచుండఁగా ననాత్మాదికము లేమగును? అవి విపర్యయములని భావింపవచ్చును. కాని యీ భావముకూడ త్యాజ్యము. ఏలయన ప్రతిషేధ్యార్థము లేనప్పుడు ప్రతిషేధము గలుగదు. ఆత్మాదికము కలుగనప్పుడు అనాత్మాదికమున్న దనుట విపర్యాసమే యగును. కావున జాతి జరా మరణ సంస్కార చారకాగార బంధన ముముక్షువు లను నెనిమిది విపర్యాసములు త్యాజ్యములు.

విపర్యయ నిరోధమువలన నవిద్యా నిరోధము, అవిద్యా నిరోధమువలన సంస్కారాది నిరోధము గలుగును.

ఇట్లు చెప్పు చున్నప్పు డొక సందేహము గలుగ వచ్చును. విపర్యాస నిరోధమువలన నవిద్యా నిరోధ మగు నని పలుకు చున్నారు. అప్పు డవిద్య యున్నది గావలయును. లేనిదే యయిన విపర్యాస నిరోధముచే నవిద్యా నిరోధ మెట్లు సంభవించును? లేని దానికి నిరోధము గలుగదు. నిరోధార్థ ముపాయము లక్కఱ లేదు. లేని గగన చూత లతా ప్రహాణమున కుపాయాన్వేషణ మేల? కావున నవిద్య సత్వదార్థము గావలయును. ఏల యన నిరోధోపాయా న్వేషణ మున్నది గదా! అవిద్య యున్నప్పుడు క్లేశములు, క్లేశాస్తిత్వముతో భవసంతతి గలుగుచున్నది.

మీ రాశంకించునట్లు క్లేశములు స్వభావ సిద్ధములే యయిన నవి యెట్లు నశించును? అవి యెవని కెట్లు కలుగ కుండును? ఎవఁడు స్వభావము చెఱుపఁ గలఁడు? అట్లు కాక క్లేశములు స్వభావముచే నభూతములగు నేని యవి నశించు టెట్లు? అసద్భావము నశింపఁజేయ నెవనికి శక్య మగును? అగ్నికి శైత్యము లేదు. లేని యీ శైత్యము తొలగింప నెట్లు సాధ్యపడును? క్లేశాదులు గలుగనివానికిఁ గల క్లేశ రాహిత్యమెవఁడు నశింపఁజేయఁగలఁడు?

కావున క్లేశ ప్రహాణము లేదు, క్లేశ ప్రహాణోపా యాన్వేషణమును లేదు.

## దృష్టి పరీక్ష

జిజ్ఞాసు వైన మానవుఁడు లోకమును గూర్చి తన్ను గూర్చి యాలోచింపక మానఁడు. అట్టివానికి స్వాత్మలోకముల పూర్వాపరాంతముల నాశ్రయించి పదునారు దృష్టులేర్పడ నవకాశ మున్నది. పూర్వాం తాశ్రిత దృష్టు లెనిమిది. అపరాం తాశ్రితము లెనిమిది. పూర్వాంతమున నాత్మాశ్రిత ములు నాలుగు లోకాశ్రితములు నాలుగు. అట్లే యపరాం తమునందును నేర్పడఁ గలవు. అవి :— 1. పూర్వముంటిని, 2. పూర్వము లేను, 3. ఉండియు లేను, 4. ఉన్నవాఁడను గాను లేనివాఁడను గాను, 5. లోకము శాశ్వతము, 6. లోక మశాశ్వతము, 7. లోకము శాశ్వతా శాశ్వతము, 8. లోక మేత దనుభయము, 9. భవిష్యమున నుండఁగలను, 10. భవి ష్యమున నుండను, 11. భవిష్యమున నుండగలను ఉండఁ బోవను, 12. భవిష్యమున నుండఁ బోవను, ఉండక పోవుట యుఁ గలుగదు, 13. లోకమున కంతము గలుగఁ గలదు, 14. లోకమున కంతము గలుగఁ బోదు, 15. అంతము గలుగఁ గలదును, కలుగఁ బోవదును, 16. అంతము కలుగఁ బోవుటయు లేదు, కలుగఁ బోవకుండుటయు లేదు.

ఈ దృష్టులలో నొక్కటియు సమర్థనీయము గాదు. పూర్వాంతాశ్రిత దృష్టి చతుష్కమును, అపరాంతాశ్రితదృష్టి చతుష్కమును బరిశీలించినచో తత్త్వము సువ్యక్తము గాఁగలదు.

పూర్వ ముంటి నను దృష్టి యుక్తము గాదు. పూర్వ జన్మములం దున్న వాఁడే వీఁడనుట పొసఁగదు. ఏల యన

నిత్యత్వ ప్రసంగము గలుగును. నిత్యునకు సంసరణోపపత్తి గలుగదు. ఏక గతిస్థునకుఁ గూడ నానాగతి సంగృహీతత్వ ప్రసంగ మేర్పడును. ఇంతకు మున్ను నరకాది గతికుఁడనై యుండి కర్మ వైచిత్ర్యమువలన మనుష్యులందు జన్మించితి నని కల్పించుచో నేను నారకుఁడ నైతి ననవలసి వచ్చును. ఇది యుక్తము గాదు. మానవుఁడ నగుచు నారకాదికుఁడ నగుట యెట్లు?

మాధ్యమక వాద గ్రహణమున కవతార వాద పరిశీలన మెంతయుఁ దోడ్పడఁ గలదు. రాముఁడు ద్వాపరమునఁ గృష్ణుఁడై జన్మించె నని యందుము. నిజముగా రాముఁడే కృష్ణుఁడై యుద్భవించిన, రామకృష్ణుల పంచస్కంధ లక్షణమున విశేషము గలుగ రాదు. కాని విశేషమున్నది. అగుచో రాముఁడు కృష్ణావతార మెత్తుట సంభవింపదు.

అవతార వాది యీ యాక్షేప మిట్లు త్రోసివేయ వచ్చును. పంచ స్కంధముల కంటె నాత్మ వేఱు. కావున రామ పరమాత్మ కృష్ణ పరమాత్మగా నుద్భవించెను. ఇంక దోష మెక్కడ?

ఈ వాదము సమర్థనీయముగాఁ దోఁపదు. రాముఁడు కృష్ణావతార మెత్తె నను నప్పుడు రాముఁడు తత్పంచస్కంధముల కంటె నన్యుఁడుగా గ్రహింపఁబడుట లేదు. ఏల యన రాముఁడు కృష్ణుఁడై యవతరించె నని చెప్పుచున్నారు. రాముఁడను దానిచే స్కంధ వ్యతిరిక్త మగు నాత్మయే యుద్దిష్ట మయిన, నవతారము సిద్ధింపదు. అట్లుగాక రాముఁడను పదము ఉపాదానోపాదాతల యభేదము చెప్పు నన్న, కర్మ భేదము కారక భేదము గలుగక పోవలయును. ఆ దోషము లట్లుంచి ఉదానోపాధాతల కభేద మంగీకరించినను రాముఁడే

కృష్ణుఁడుగా నవతరించుట యసంభవము. ఏల యన రామ కృష్ణుల కుపాదాన భేద మున్నది.

ఉపాదానము వేఱు, ఉపాదాత వేఱు. ఒకే మానవుఁడు భిన్న భిన్న కాలములందు భిన్న భిన్న వస్త్రములను దాల్చుచున్నాఁడు. వస్త్రములు మాఱుచున్నను వ్యక్తి మాఱుట లేదు. అట్లే ఉపాదానములు మాఱుచున్నను ఉపాదాత (ఆత్మ) మాఱక యట్లే యుండును. ఈ విధముగా ఆత్మ నిత్యత్వ మూహింప వచ్చును. ఈ వాదము ననుసరించి నేను పూర్వ ముంటినను దృష్టి సిద్ధింపగలదని చెప్ప వచ్చును. ఈ పక్షమున నిది యాత్మ, ఇది స్కంధ పంచక మని వేఱుపఱిచి చూపవలయును. కాని యుపాదానా విశిష్టమగు నుపాదాత సిద్ధించుట లేదు. ఉపాదాత పంచ స్కంధములకంటె వే అనుచో, నా యుపాదాత క హేతుకత్వ ప్రసంగము పృథ గ్గ్రహణ ప్రసంగము గలుగును.

ఉపాదానమే యుపాదాత యందమన్న ఆత్మ యుత్పత్తిలయములకుఁ బాల్పడును. విశేషించి కర్తృ కర్మముల కైక్యము వాటిల్లును. అనఁగా ఛేత్తృ చ్ఛేత్తవ్యములకు, కుంభకార కుంభములకు, నగ్నీంధనములకు నేకత్వము కలుగును. ఇది యనుభవ విరుద్ధము.

కావున నుపాదాత యుపాదానముకంటె నన్యము గాదు. ఉపాదాన ముపాదాత గాదు. అనుపాదానమైన యుపాదాతయు లేదు. స్కంధములను బొంది యాత్మ గ్రహింపఁబడు చున్నది. కావున నాత్మ లే దనుట యెట్లు? కాఁబట్టి యాత్మ లేదను నిశ్చయముగూడ నుపపన్నము గాదు.

"పూర్వము నేను లేను" అను దృష్టియు సిద్ధింపదు. పూర్విక మైన యాత్మ వేఱు, ఇప్పటి యాత్మ వే అయిన

పూర్వము నేను లేనను తలంపేని గలుగరాదు. తన యిల్లాలు తనకు భోజనము వడ్డింపలేదను తలఁపు పెండ్లి కాని వానికిఁ గలుగదు. అట్లే యాత్మ పూర్వము లేకున్న, నేను పూర్వము లేనను భావమైనను గలుగ రాదు. కాని యిది లోకులయందుఁ గానిపించు చున్నది. కావున నేను పూర్వము లేనను దృష్టియు సిద్ధించుట లేదు.

అది యట్లుండ నిప్పటి యాత్మ పూర్వాత్మకంటె వేఱయినఁ, బూర్వాత్మను వర్జించి యిప్పటి యాత్మ గలుగ వలయును. అప్పుడు పూర్వాత్మతోపాటిప్పటి యాత్మయు నుండవలయును. అనఁగాఁ బూర్వాత్మ నశింపక యిప్పటి యాత్మ పుట్ట వలయును. కాని పూర్వాత్మ మగు దేవాత్మాదికమట్లే నిలిచియుండి యిప్పుడు మానవాత్మ పుట్టదు. కావునఁ బూర్వము నేను లేనను దృష్టి సిద్ధింపదు.

విశేషించి పూర్వాత్మ నశించి యన్యాత్మ యుద్భవించిన దని చెప్పిన, పూర్వాత్మ చేసిన కర్మములు ఫలము లొసఁగక భోక్త లేమిచే నాశము పొంద వలయును. పూర్వాత్మ చేసిన కర్మముల ఫల ముత్తరాత్మ యనుభవించు నన్న నొకని కర్మ ఫలము వేఱొకఁ డనుభవింప వలయును. ఈ పక్షమున నకృతాభ్యాగమ భయ మనివార్య మగును. కావున పూర్వాత్మ నశించి యన్యాత్మ పుట్టు చున్నదని చెప్ప శక్యముగాదు.

పైఁగా పూర్వాత్మకంటె నిప్పటి యాత్మ వేఱనిన, నిప్పటి యాత్మ పూర్వము గలుగక తరువాత జన్మించిన దగును. ఈ పక్షమున నాత్మ కృతకమయి యనిత్య ప్రసంగము వాటిల్లును. అప్పుడు సంసార మాదిమంత మగును. పూర్వము లేని జీవుఁడు పుట్టవలసి వచ్చును. అట్లే పుట్టునని,

యన్న, అహేతుక ప్రసంగము గలుగును. కావున "పూర్వము నేను లేను" అను దృష్టి పొసఁగదు.

ఈ విధముగా పూర్వ ముంటినను దృష్టికాని లేనను దృష్టికాని సిద్ధింపదు. ఒం డొండుగా సిద్ధింపని యీ దృష్టి ద్వయము సమాహారముగా మాత్ర మెట్లు సిద్ధించును? కావున పూర్వ ముండియు లేనను తృతీయ దృష్టియు నుపపన్నము గాదు. పూర్వ ముంటిని, పూర్వము లేను అను దృష్టులు రెండును సిద్ధింపనప్పుడు తత్ప్రతిషేధ రూపమగు పూర్వ మున్నవాఁడను గాను, పూర్వము లేనివాఁడను గాను అను నాల్గవ దృష్టియు సిద్ధింపదు.

పూర్వాంతాశ్రిత ఆత్మదృష్టి చతుష్టయము వలెనే, యపరాంతాశ్రిత ఆత్మదృష్టి చతుష్టయమును సిద్ధింపదు.

ఇంకఁ బూర్వాంతాశ్రిత శాశ్వతాది దృష్టి చతుష్టయ మెట్లు పొసఁగదో పరీక్షింప వలయును.

మనుష్య జన్మఁ డొకఁడు కుశల కర్మము లొనర్చి దేవ గతిని బొందె ననుకొనుఁడు. అప్పుడు మానవుఁడే దేవుఁ డగును. ఈ విధముగా నైననే యిరువుర కైక్యము కలిగి శాశ్వతత్వము పొసఁగును. కాని మానవుఁడు మానవుఁడే, దేవుఁడు దేవుఁడే. మానవుఁడు దేవుఁడు గాఁడు, దేవుఁడు మానవుఁడు గాఁడు. పైఁగా దేవుఁడు పుట్టుక లేనివాఁడు. పుట్టువు గలది శాశ్వతము గాదు. శాశ్వత మగు వస్తువు పుట్టదు. కాని కృత కుశల కర్ముఁడు దేవ గతి పొందుచున్నాఁ డనుచున్నాము. కావున శాశ్వత వాదము యుక్తము గాదు.

మఱి యశాశ్వత వాదము గూడ యుక్తము గాదు. దేవుఁడు వేఱయి మానవుఁడు వేఱయి నప్పుడు పూర్విక మనుష్యాత్మ నష్ట మయి యన్యము పుట్ట వలయును.

అట్లయిన నశాశ్వతత్వము గలుగఁ గలదు. అప్పుడు దేవునకు మానవునకు సంబంధమే యుండ రాదు. నింబ వృక్షమునకు ఆమ్ర తరు సంతానము గలుగ నట్లు దేవ మానవులకు ఏక సంతాన పతిత్వము గలుగ రాదు. కాని యీ ఏక సంతాన పతిత్వము గోచరించు చున్నది. కావున నశాశ్వత వాదము సిద్ధింపదు.

ఇంక మూఁడవదగు శాశ్వతాశాశ్వత వాదము గూడ పొసఁగదు. ఈ వాద మాదరించిన నొక భాగము దివ్యమై మఱియొక భాగము మానుషము గావలయును. అనఁగా కాళులు భూమిమీఁద, శీర్షము స్వర్గమందు నుండవలయును. అప్పుడే శాశ్వతాశాశ్వత వాదము సిద్ధింపఁగలదు. కాని యిది యసంభవము. సగము కోడి కూరయై తక్కిన సగము గ్రుడ్లు పెట్టదు. కావున శాశ్వతాశాశ్వత వాదము సిద్ధింపదు.

ఇంక, 'శాశ్వతము గాదు, అశాశ్వతము గాదు' అను నాల్గవ దృష్టి పొసఁగునేమో పరీక్షింపవలయును.

శాశ్వతమగు నొక వస్తువుండి యా పిమ్మట నశాశ్వత వస్తు దర్శనము సంభవించిన, నా వస్తువు శాశ్వతము గాదను బుద్ధి కలుగును. అట్లే యశాశ్వతమగు నొక వస్తువుండి యా పిమ్మట శాశ్వతవస్తు దర్శనము గలిగిన, నది యశాశ్వతము గాదను బుద్ధి కలుగును. కాని శాశ్వ తాశాశ్వత వస్తువులు రెండు నప్రసిద్ధము లైనప్పుడు తత్ప్రతిషేధ రూపమగు "శాశ్వతము గాదు, అశాశ్వతము గాదు," అను వాద మెట్లు సిద్ధించును?

ఈ సందర్భమున నిట్లాశంకింప వచ్చును. జన్మ మరణ పరంపరా ప్రవృత్తమై యవిచ్ఛిన్న క్రమమగు సంసార

ప్రబంధమువలన నాత్మ శాశ్వతమని తోఁచు చున్నది. శాశ్వతమగు నొకానొక పదార్థ మున్నది. అది యనాదిమంతమైన సంసారమందు పరిభ్రమించుచు నిప్పుడు గూడ లభించు చున్నది.

ఈ యాశంకితార్థము సిద్ధింపదు. గత్యాత్మలు సిద్ధింపవని యితః పూర్వ పరీక్షలవలన నిష్పన్నమే కదా! ఆత్మ గలుగనప్పుడు ఆగమన నిర్గమము లెవనికి సంభవించును? గమనమే కలుగ నప్పుడు జన్మ మరణ పరంపరకు అతిదీర్ఘత్వముకాని ఆద్యనుపలంభము గాని యెట్లు సంభవించును? విశేషించి సంసర్తయు లేఁడుగదా! అట్లగుటచే సంసార మనాదియుఁ గాదు, నాదియుఁ గాదు. కావున ననాది మంతమైన సంసారమందుఁ బరిభ్రమించుచు శాశ్వతమగు నొకానొక పదార్థ మిప్పుడును లభించుచున్న దనుట యుక్తము గాదు.

ఇట్లు శాశ్వతమగు పదార్థమే లేనప్పుడు అశాశ్వత పదార్థ మెట్లు గలుగును? శాశ్వత వస్తువేని, యశాశ్వత వస్తువేని లేనప్పుడు శాశ్వతాశాశ్వత వస్తువుగాని, యేత దనుభయ రూప వస్తువుగాని యెట్లు గలుగును? కావున పూర్వాంతాశ్రితమగు శాశ్వతాది దృష్టి చతుష్టయము సంసారమునకుఁ గలుగఁ జాలదు.

ఇప్పు డంతానంతాది అపరాంతాశ్రిత దృష్టి చతుష్టయమును బరీక్షింప వలయును.

లోక మంతవంత మగు నేని, తద్వినా శానంతరము పూర్వ లోకము కలుగఁ జాలదు. పూర్వ లోకము గలుగ నప్పుడు పర లోకము గూడఁ గలుగదు. కాని పరలోకము (వ్యావహారికముగా) ఉన్నది. కావున లోక మంతవంత మనుట పొసఁగదు.

లోక మనంతవంత మను పక్షమునఁ బరలోక మెట్లు కలుగును ? కాని పరలోక మున్నది. కావున లోక మనంత వంత మనుటయుఁ బొసఁగదు. లోకమున కంతానంతవత్త్వము గూడ సిద్ధింపదు. ఏల యన పూర్వోత్తర హేతు ఫలభావ సంబంధ నైరంతర్య క్రమము దీప శిఖయందు వలె లోకము నఁ గానఁబడు చున్నది.

ఈసందర్భమునఁ బ్రతిపక్షి యిట్లన వచ్చును. ఒక వస్తువునందలి యొక భాగమునకు వినాశము గల్గి మఱి యొక భాగమునకు గత్యంతర గమనము గలుగ వచ్చును. ఇట్లయిన లోక మంతవంతము అనంతవంతము నగును గదా ?

ఇది సమంజసము గాదు. ఒక భాగము నశించి మఱి యొక భాగము నశింపక పోవు టర్థము గాదు. ఇంతకు నీ యేక దేశము దేనిది ? ఆత్మైక దేశమా ? ఉపాదానైక దేశమా ? ఆత్మైక దేశ మయిన ఏక దేశము నశించి తదన్యము నశింప దని చెప్ప వీలు లేదు. ఏల యన ఒక భాగము నశించి మఱి యొక భాగము నశింపమికి హేతువు కానఁబడదు.

అది యట్లుండ నాత్మ పంచ స్కంధములఁ గలుగఁ జాలదు గదా! కలుగని ఆత్మయొక్క యేక దేశమునకు వినాశము తదన్యమున కవినాశ మెట్లు గలుగును ? పైఁగా నాత్మైక దేశము నశించి తదన్యము నశింప దన్న నొక యంశమందు మర్త్యత్వము మఱియొక యంశమందు అమర్త్యత్వము గలుగ వలయును. ఇది యసమ్మతము.

అట్లు గాక యుపాదానైక దేశము నశించి తదన్యము నశింపఁ దనుటయుఁ బూర్వోక్త న్యాయముగా సిద్ధింపదు.

ఇఁక లోక మంతవంతము గాదు, అనంత వంతము గా దను దృష్టిని బరీక్షింప వలసి యున్నది.

ప్రతిషేధ్య వస్తువు గలుగ నప్పుడు ప్రతిషేధము గలుగదు. అంతవత్త్వము అనంతవత్త్వము సిద్ధింపవు గదా. ఇంక అంతవంతము గాదు, అనంతవంతము గాదను దృష్టి యెట్లు ప్రసిద్ధి పొందును ?

సర్వ భావములు ప్రతీత్య సముత్పన్నములు. కావున శూన్యములు. దృష్టులును సర్వ భావాంతర్గతములు. దాన నవియు శూన్యములు. శూన్యముల నెవఁడు గ్రహింపఁ గలఁడు ? సర్వము శూన్యము గావున గ్రహీత గాని, దృష్టి గాని, తదాలంబనము గాని లభింపదు.

> అథవా సర్వ భావానాం శూన్యత్వా చ్ఛాశ్వ తాదయః।
> క్వ కస్య కతమాః కస్మా త్సంభవిష్యంతి దృష్టయః॥

## నిర్వాణము

ప్రకృత విచార క్రమమందుఁ గడపటిదగు నిర్వాణము లేక ముక్తిని బరీక్షింపవలసి యున్నది. నాగార్జునుని మతమున నిర్వాణతత్త్వ మెట్టిదో గ్రహింపవలసి యున్నది.

ఈ ప్రపంచము శూన్యమని కదా మాధ్యమకుల మతము. తత్త్వము శూన్యమగుచుండఁ బ్రహాణము గాని నిరోధముగాని కలుగఁజాలదు. అప్పుడు నిర్వాణ ప్రాప్తియుఁ గలుగఁజాలదు. ఈ ప్రపంచము శూన్యముగాదు. పారమార్థికముగా నున్నది యను పక్షమున నుత్పత్తి నాశములు గలుగవు. అగ్ని దాహకశక్తి స్వాభావికము. అది పుట్టునది గాదు, నశించునది గాదు. ఆ శక్తిని మాన్పరాదు. ఈ ప్రపంచము గూడ నట్లే స్వాభావికమే యగుచో నంతరింపదు. అప్పుడు మోక్షప్రాప్తికే యవకాశము గలుగదు. అనఁగా స్వాభావికమై యీ దేహాదిక మిట్లే యుండి మోక్షము గలుగరాదు.

కావున నీ ప్రపంచము శూన్యము. నిర్వాణప్రాప్తియు లేదు. ఇట్లు వచించినప్పుడు ఆశ్చర్యము గలుగక మానదు. ఈ సిద్ధాంతమున నిర్వాణ స్వరూప మెట్లుండునను ప్రశ్న మంకురింపక తప్పదు.

నిర్వాణము రాగాదులవలె నంతరించునది కాదు. శ్రామణ్య ఫలమువలె పొందఁబడునది కాదు. అది స్వభావముచే ననిరుద్ధము, అనుత్పన్నము. సర్వ ప్రపంచోపశమము దాని లక్షణము. నిరవశేష కల్పనా క్షయమే నిర్వాణము. క్లేశకర్మ జన్మ లక్షణము లద్దానికిఁ గలుగవు.

ఈదృశమగు నిర్వాణమును బ్రతిపాదింపక కొందఱిది భావరూప మనియు, మఱికొందఱు అభావ రూప మనియు, వేఱొక కొందఱు భావాభావ రూప మనియు, నింకొక కొందఱు భావాభావానుభయ రూప మనియుఁ జెప్పుదురు.

నాగార్జుఁ డీ నాలుగు వాదములను బరిశీలించి యివి యుక్తి క్షమములు గావని నిశ్చయించెను.

నిర్వాణము సత్పదార్థ మనువా రిట్లు ప్రతిపాదింతురు:- జాతి జరామరణ ప్రవాహము నిరోధింపఁబడ వలయు నన్న సేతుసదృశమగు పదార్థ మొకటి యుండవలయును. ఈ పదార్థము లేనిచో ప్రవాహ నిరోధము గలుగదు. ఏలయన అసత్పదార్థము కార్యకారి గాదు. లేని యగ్ని దహించుట, కలుగని ఖడ్గము ఛేదించుట సంభవము గాదు. కావున నిర్వాణ మను సత్పదార్థ మున్నది. దానివలన జాతి జరా మరణ ప్రవాహ నిరోధము గలుగుచున్నది. కావున నిర్వాణము సత్పదార్థము. అది భావరూపమే కాని యన్యము గాఁజాలదు.

కాని నిర్వాణము భావమనుట యుక్తము గాఁజాలదు. భావమునకు జాతి జరామరణము లవ్యభిచారి లక్షణములు. విజ్ఞానము భావము. అది నశించుచున్నది. నిర్వాణము గూడ భావమే యగుచో విజ్ఞానమట్లు నశింప వలయును. నిర్వాణము నశించు నని తత్ప్రతిపాదకు లెవ్వరు నంగీకరింపరు. విశేషించి నిర్వాణము భావ మగుచో నది సంస్కృత పదార్థము, అనఁగా హేతు ప్రత్యయ సముత్పన్నము గావలయును. కాని నిర్వాణ ముత్పన్న మనుట యెవరికిని సమ్మతము గాదు. బౌద్ధులెల్లరు నిర్వాణ మసంస్కృత పదార్థ మందురు. అయిన నేమి, నిర్వాణము అసంస్కృత పదార్థ మగుచు భావము గావచ్చును గదా యని యాశంకింప వచ్చును. కాని హేతు ప్రత్యయ సంజాతము గాని భావము లేదు.

భావము నియతముగా సోపాదానము. నిర్వాణము భావ మగుచో నది స్వకారణ సామగ్రి కలితమై భావము గావలయును. అట్లగు నేని నిర్వాణ ముత్పాద స్థితి భంగము లకుఁ బాల్పడవలయును. నిర్వాణ మిట్లగుట సమ్మతము గాఁ జాలదు.

ఉదాహృత దోషములఁ బరిహరింప నెంచి నిర్వాణ మభావ మని తలంప వచ్చును. పైఁగాఁ గ్లేశ జన్మములు నిర్వాణమం దుండవు. కావున వాని యభావమే నిర్వాణ ముగాఁ దోఁప వచ్చును. ఈ పక్షమున క్లేశ జన్మముల యనిత్యతయే యభావ మగును. ఈ యభావమే యప్పుడు నిర్వాణ మగును. కాని భావ మున్నప్పుడే యభావ ముండును. భావము లేక యభావము గలుగదు. పైఁగా భావము వలెనే యభావ మనిత్యము. నిర్వాణ మభావ మగు నేని యది యనిత్యము గావలయును. అనిత్యమే యగుఁ

గాక దోషమేమి యనుచో ననిత్యతవలన యత్నము లేకయే నిశాంత సంభూతాూహస్సు వలె నిర్వాణము సిద్ధింప వలయును. ఇది యిష్టము గాదు. కావున నిర్వాణ మభావము గాదు.

పైఁగా నిర్వాణ మభావ మయిన నది స్వకారణ సామగ్రి సహితము గావలయును. ఏల యన భావ మాశ్రయించి యభావము, అభావము నాశ్రయించి భావము గలుగును. అంతియ కాని నిరపేక్ష మగు భావము గాని యభావము గాని లేదు. నిర్వాణ మభావ మగునేని సాపేక్ష మగును. నిర్వాణము సాపేక్ష మగుట, స్వకారణ సామగ్రి కలితమగుట సమ్మతములు గావు.

ఇక్కడ నిట్లు శంకింప వచ్చును. ఉపాదానము లేక యభావము గలుగ దేని వంధ్యా పుత్రాదులు గూడ స్వకారణ సామగ్రిని బొంది యభావములు గావలయును.

నిజముగా వంధ్యా పుత్రాదు లభావము లగునేని స్వకారణ సామగ్రిని పొందక తప్పదు. కాని వంధ్యా పుత్రాదిక మభావము గాదు. భావము లేక యభావము సిద్ధింపదు. అభావమని పేర్కొనఁబడు చున్న యర్థము ప్రాయికముగా భావవైపరీత్యము దక్క యన్యము గాదు. సామాన్యముగా జనుల మతమున భావము లెట్టివో, వంధ్యా పుత్ర శశ విషాణ గగనప్రసూనములు నట్టివే. వాస్తవమునకు వంధ్యా పుత్రార్థము భావమును గాదు, అభావమును గాదు.

ఇంతకు నిర్వాణము భావమునుగాదు. అభావమును గా దని చెప్పుచున్నారు. ఇంక దాని స్వరూప మేమి ?

హేతు ప్రత్యయములను బొందుటచేఁ గాని, పుట్టుటచేఁ గాని యాజవంజవభావ (ఆగమన గమన రూప మగు

జన్మ మరణ పరంపర) మేర్పడుచున్నది. ఆజవంజవ భావము విగళిత ప్రత్యయ మైనను, పుట్టుక లేని దైనను నిర్వాణ మగును.

ఈ నిర్వాణము భావాభావ రూపము గాదు. ఏత దుభయ రూపమను పక్షమున మోక్షము గూడ భావా భావము గావలయును. అప్పుడు సంస్కారముల కలిమి లేముల కలయికయే మోక్షము గా వలయును. విశేషించి భావాభావములు రెండును సోపాదానములు గావున, నిర్వా ణము సోపాదానము గా వలయును. అప్పు డది సంస్కృత పదార్థమగును. కాని నిర్వాణము సంస్కృత పదార్థము గా దనుట యెల్లరకు సమ్మతము.

ప్రకృతమున నిట్లన వచ్చును. నిర్వాణము భావా భావ రూపము కాదు కాని నిర్వాణమునందు భావాభావములు రెండు నుండ వచ్చును గదా ?

ఇట్లనుట యుక్తము గాదు. వెలుఁగు చీకటు లొక్కే చోట నుండవు. అట్లే భావాభావములు రెండు నొకేచోట వర్తిల్లఁ జాలవు.

ఇంక నిర్వాణము భావాభా వానుభయ రూపమగు నేమో పరీక్షింప వలయును.

భావము సిద్ధించు నేని, తత్ప్రతిషేధముచే నభావము, అభావ ప్రతిషేధముచే నభావము గాదను నర్థము సిద్ధింపఁ గలదు. కాని భావాభావములే సిద్ధింప కున్నవి. ఇంక నా రెంటి ప్రతిషేధ మెట్లు సిద్ధించును ?

ఒక వేళ భావాభావాన్య రూపమగు నిర్వాణ మున్న దన్నను దాని నెవఁడు గ్రహించు చున్నాఁడు ? అది యెట్లు ప్రకాశ్యమాన మగుచున్నది ? అట్టిదానిని సంసారావస్థ

తుఁడు గాని, నిర్వాణస్థుఁడు. గాని గ్రహించి వెల్లడింప వలయును. నిర్వాణము భావరూపము గాని, యభావరూపము గాని కాదని యింతకుమున్నే నిశ్చయించుకొన్నారము. అట్టి నిర్వాణమందు భావరూపమగు నాత్మ కలుగఁజాలదు. ఏల యన స్వకారణ సామగ్రి విరహితమైన యాత్మ లేదు. కావున నిర్వాణము పొందినవాఁడా నిర్వాణ తత్త్వమును గ్రహించు చున్నాఁడని కాని, ప్రతిపాదించు చున్నాఁడని కాని చెప్ప నయితికాదు.

అట్లుగాక సంసారావస్థితుఁడు నిర్వాణ మున్నదని పరిచ్ఛేదము గావించు చున్నాఁడా? ఇతఁడే కావించు చున్నాఁడేని విజ్ఞానమును బురస్కరించుకొని చేయవలెను. లేదా జ్ఞానమును బురస్కరించుకొని చేయవలయును. విజ్ఞానము వ్యావహారికము. వివిక్తములగు పదార్థముల యాలంబనము పొందియే యీ విజ్ఞానము గలుగును. నిర్వాణ మున వివిక్త పదార్థములు లేవు. కావున విజ్ఞానముచే నిర్వాణము పొందఁబడుట లేదు.

ఇంక జ్ఞానమును బురస్కరించుకొని సంసా రావస్థితుఁడు నిర్వాణమును బ్రతిపాదించు చున్నాఁ డన నవకాశము లేదు. ఏల యన జ్ఞానము శూన్య తాలంబనము. అది యనుత్పాద రూపము. ఈ విధముగా నవిద్యమాన స్వరూపము ప్రపంచా తీత స్వభావము నగు జ్ఞానముచే నిర్వాణము భావాభా వాను భయ రూప మని యెట్లెఱుఁగఁబడుచున్నది ?

కావున నిర్వాణము భావాభా వానుభయ రూపమును గాదు. తథాగతులు గూడ నీ నిర్వాణము వంటివారే.

బుద్ధ దేవుండు నిర్వాణమునకు వెనుక
పరగునో మఱి పరగఁడో పరగి పరగ

కందునో పరగి పరగ కంట లేదొ
యెట్టి ధీశాలి కైన నూహింపరాదు.

తిష్ఠమానుఁ డైనను బుద్ధ దేవుఁ డరయఁ
బరగునో మఱి పరగఁడో పరగి పరగ
కందునో పరగి పరగ కంట లేదొ
యెట్టి ధీశాలి కైన నూహింప రాదు.

ఈ సంసారము గూడ బుద్ధ దేవులవంటిదే. ఇది భావ మని కాని, యభావ మని కాని, భావాభావ మని కాని, ఏత దనుభయ మని కాని చెప్ప శక్యము గాదు. అప్పుడు నిర్వాణ సంసారములకు భేద మేమి ? ఈ ప్రశ్నమునకు నాగార్జునుఁ డిట్లు సమాధానము చెప్పుచున్నాడు :—

స్వల్ప మగు భేద మేని సంసారమునకు
నల్ల నిర్వాణమునకు వర్తిల్లఁ బోదు;
స్వల్ప మగు భేద మేని నిర్వాణమునకు
నల్ల సంసారమునకు వర్తిల్లఁబోదు.

ఏది నిర్వాణ కోటియై యొసఁగుచుండు
నదియ సంసార కోటియై యవతరించు;
ఆ ద్వయమ్మునకు నడుమ నంతరమ్ము
చొప్పడఁగఁ బోదు సూక్ష్మాతి సూక్ష్మమైన.

కావున సంసార నిర్వాణములు రెండును ప్రకృతి శాంతములు, ఏకరసములు.

సంగ్రహముగా మాధ్యమక వాద మిది. కలరూపీ విధముగా నున్నప్పుడు దేశ కాలములు, జీవేశ్వరులు, సంసార నిర్వాణములు, ఇహ పరములు, స్థితి గతులు, ప్రమాణ ప్రమేయములు, సదసత్తులు, సామాన్య విశేషములు

బహిరంతరములు, వ్యష్టి సమాజములు, ధర్మా ధర్మములు, దేవ దానవత్వములు, శీతోష్ణములు, జాతీయ తాంత ర్జాతీయతలు, మున్నగాఁ గల సకల ద్వంద్వములు, జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములు, భూత భవిష్య ద్వర్తమానములు, ఉత్తమ మధ్య మాధమత్వములు, ఉత్పాద స్థితి భంగములు మున్నగాఁగల సకల త్రికములు, రూప శబ్ద గంధ రస స్పర్శ ధర్మములు మున్నగాఁగల సకల బహుత్వములు, ఎల్ల భావ ములు హేతు ప్రత్యయ సముత్పన్నములు. ఆయా హేతు వులు గలుగు నపుడు గలుగుచున్నవి. లేనపుడు గలుగవు. కావున భావములు వ్యావహారికములే కాని పారమార్థిక ములు గావు. పరమార్థము వాచా మగోచరము, అచింత్యము. "చాలుంజాలు విచారము ల్పలుపుచో సత్యంబు సాధింతురా ?" యని మాధ్యమకు లితర దార్శనికులను బ్రశ్నింతురు.

ఇంతకుఁ బరమార్థ మున్నదా ? ఉన్నచో దాని లక్షణము లెవ్వి ? లేనిచోఁ బరమార్థ పదమునకే ప్రసక్తి కలు గదు గదా!

సత్తాసత్తలు పరస్ప రాపేక్షములు, హేతు ప్రత్యయ సముత్పన్నములు. కావున నవి వ్యావహారికములు. పర మార్థము సత్తన్నను, అసత్తన్నను భావమగును. భావము వ్యావహారికము. కావునఁ బరమార్థము సత్తనియేని చెప్ప రాదు. అట్టి పర మార్థమును గుర్తింప వలసి యున్నది. గుర్తించుటకై యది యనిరోధము, అనుత్పాదము, అనుచ్ఛే దము, అశాశ్వతము, అనేకార్థము, అనానార్థము, అనా గమము, అనిర్గమము అని మాధ్యమకులు చెప్పుదురు. ఈ లక్షణములచేఁ జేయు సూచనయు వ్యవహార మాశ్ర యించి చేయు సూచనమే కాని పరమార్థము గాదు.

ఇట్టి పరమార్థమునుండి యుత్పాదస్థితి భంగములు గలిగిన జగత్తెట్లు వచ్చినది? సంసార నిర్వాణములకుఁ గల సంబంధ మేమి?

సంసార నిర్వాణములు విభిన్న పదార్థములు గావని నాగార్జునుని సిద్ధాంతము. కావుననే యతఁడు రెంటిని గూడ శూన్య శబ్దముతోఁ బేర్కొనును. దృష్టి సమవచ్ఛిన్న మగునది సంసార మనియు, దృష్టి విరహిత మగునది పరమార్థ మనియు నతని తాత్పర్యము. ఆదర్శ ముఖాది హేతు ప్రత్యయము లున్నంతవఱకు ప్రతిబింబము గలుగు నట్లే, దృష్టి యున్నంత వఱకు నీ జగత్తు, సంసారము నుండును. హేతు ప్రత్యయములు లేనప్పుడు జగత్తు గూడఁ గలుగదు. గారడి వాని కుందేలు వాస్తవమునకుఁ బుట్టుటయు లేదు, గిట్టుటయు లేదు. కనుకట్టు వలన నది పుట్టినట్లుగాఁ, గిట్టినట్లుగాఁ గనిపించు చున్నది. అట్లే యీ జగత్తును బుట్టు చుండుటయు లేదు, గిట్టు చుండుటయు లేదు. ఇట్లు చెప్పుచున్న దగుటచే మాధ్యమిక వాద మజాత వాద మనియుఁ బేర్కొనఁబడుచున్నది.

వ్యావహారికముగా జగత్తున్నది గదా? ఇది యెట్లు వచ్చినది? నాగార్జునుఁడు గాని, యితర మాధ్యమికులు గాని యీ ప్రశ్నకు సమాధానము చెప్పలేదని నవీన మాధ్యమిక వ్యాఖ్యాతలు గూడ నొకకొందఱు తమ యసంతృప్తిని వెల్లడించుచున్నారు. కాని జాగరూకతతోఁ బరిశీలించిన నిది పటాపంచలు గాకమానదు.

నాగార్జునుని మతము ననుసరించి ప్రతిభావము హేతు ప్రత్యయములవలనఁ బుట్టుచున్నది. కావున నది సాపేక్షము. సాపేక్ష మెల్ల వ్యావహారిక సత్యమే కాని పారమార్థిక సత్యము గాదు. ఈ జగత్తు గూడ నొక భావము. ఈ భావము హేతు ప్రత్యయములవలనఁ బుట్టుచున్నది.

కావున వ్యావహారిక మగు చున్నది గాని, పారమార్థిక మగుట లేదు. విమర్శకు లభిలషించునట్లు నాగార్జునుఁడు హేతు ప్రత్యయములను వరుసగాఁ జెప్పెనేని ప్రయోజన మేమి ? అవి పారమార్థిక సత్యములు గాఁజాలవు. కేవలము వ్యావహారికములే యగును. నేఁడొక వాదము వచ్చును. ఱే పీ వాద మంతరించి మఱియొక వాదమువచ్చును. అంతియ కాని యీ వ్యావహారిక వాదము నిత్య సత్యముకాఁ జాలదు గదా ! నిత్య సత్యాన్వేషణమే తత్త్వాన్వేషికి ముఖ్యము గాని వ్యావహారిక సత్యము గాదు. వ్యావహారిక సత్యము చాటవలసినవారు విజ్ఞాన శాస్త్రకారులు గాని తత్త్వాన్వేష కులు గాదు. ఒకవేళ నాగార్జునుఁడు జగ దవతరణమును విజ్ఞాన శాస్త్రకారుఁడై వర్ణించె ననుఁడు. ఆ వర్ణితార్థము వ్యావహారిక సత్యమే యగును గాని తత్త్వ ప్రతిపాదనము కాఁ జాలదు. వైశేషిక సాంఖ్యాద్వైత వాదులు సృష్టిక్రమ మభివర్ణించిరి. నేఁ డావర్ణనల కున్న విలువ యేమి ? అవి కేవల కల్పనా కథలే కదా !

అది యట్లుండనిండు. డార్విన్ మున్నగు జీవ శాస్త్ర జ్ఞులు, భూగర్భ శాస్త్రజ్ఞులు, ఖగోళ శాస్త్రజ్ఞులు సృష్టినిగూర్చి పెక్కు వాదములు ప్రతిపాదించుచున్నారు. అవి యన్నియుఁ బరమ సత్యములా ? భవిష్యమున నవి యెన్ని సంస్కార ములకుఁ బాల్పడ వలయునో యెవరి కెఱుక ? నిక్కమున కా యా శాస్త్రజ్ఞు లేమి చెప్పుచున్నారు ? ఈ యీ కారణ ములనుబట్టి, యీ యీ యనుభవములనుబట్టి, యీ యీ విధ ముగాఁ దలంపవలసి వచ్చుచున్న దని చెప్పుచున్నారే కాని పరమ సత్యము దెలిసికొంటి మని చెప్పుచున్నారా ? ఒక వేళ యట్లు చెప్పుచో వారు విజ్ఞాన శాస్త్రకారులే కాదు.

ఈ సాపేక్షతను, ప్రతీత్య సముత్పన్నతను గుర్తించియే నాగార్జునుఁడు గాని, మాధ్యమక వాదము గాని సృష్టి క్రమముగూర్చి యెట్టి కట్టు కథ లల్ల లేదు. ఒక వేళ నల్లి యున్న వారు ప్రతీత్య సముత్పాద వాదులయి యుండెడి వారు గారు.

మఱియొక యాశంక:—సర్వభావములు ప్రతీత్య సముత్పన్నము లగుటవలన నిః స్వభావములు. నిః స్వభావము లగుటవలన నవి శూన్యము లని కదా నాగార్జునుని నిశ్చితార్థము? ఈ వాదము ననుసరించి మాధ్యమక వాదము గూడ నొక భావమే. కావున నది శూన్యము. ఇక్కడ శూన్య శబ్దమునకు వ్యావహారికము, అపారమార్థిక మను నర్థము గ్రహించియే ప్రశ్నించుచున్నాము. మాధ్యమక వాదము గూడ వ్యావహారిక మే యగుచున్నది గదా. అప్పుడీ వాద మితరములకంటె నెట్లు విశేషించుచున్నది?

ఈ ప్రశ్న మార్య నాగార్జునుఁడు మున్నుగానే గ్రహించి తన సిద్ధాంతము నామూలాగ్రము దిద్ది తీర్చికొని యెను. తన వాదముగూడ వ్యావహారిక మేయని విస్పష్టముగాఁ జాటుకొనియెను. హేతు ప్రత్యయముల వలనఁ దన వాద ముద్భవించిన దని యంగీకరించెను. అనఁగా నాఁటి శాశ్వతవాదమును, ఉచ్ఛేద వాదమును బొంది తనవాదము వచ్చినదనియు, నా రెండు సిద్ధాంతములలో దేని నంగీకరింపక తన సిద్ధాంతము మధ్యే మార్గ మనుసరించు చున్నదనియు నతఁడు దెలిపెను. అంతే కాని తాఁబట్టిన కుందేటికి మూఁడే కాళ్ళని యాయన చెప్ప లేదు.

కావుననే పారమార్థికముగా మాధ్యమకులకుఁ బ్రతిజ్ఞా హేతు దృష్టాంతములు, ప్రమాణములు లేవని నాగార్జునుఁడు చర్చించి యున్నాఁడు. ఈ వాక్యమును గూడ

నపార్థము చేసికొనియో, యీర్ష్యా ద్వేషములు పొందియో, ప్రమాణము లంగీకరింపని యున్మత్తులతో వాదమే లేదని మండూక ప్లుతితో వైదొలఁగిన వారున్నారు.

తన వాదము వ్యావహారిక మని తెల్పుటయే కాక మాధ్యమక సిద్ధాంతము పరమ సిద్ధాంతముగా భావించు వానికి నివృత్తి యసంభవ మని యాచార్యుఁడు ముక్త కంఠముతో నుద్ఘోషించి యున్నాఁడు. భాష్యకారుఁ డార్య చంద్రకీర్తి యీ యర్థమునే సోదాహరణముగా నిట్లు వివరించు చున్నాఁడు :—ఒకఁడు పొరపాటున విషము మ్రింగె ననుఁడు. మ్రింగిన యా విషమును గ్రక్కించి ప్రాణ రక్షణార్థ మతనిచే మఱొక యౌషధము త్రావించితి మనుకొనుఁడు. ఈ యౌషధము లోపలికిఁ బోయి యచటి విషమును బయటికి నెట్టివేసి తాను విషమై నిల్చినచో, ఆ నిర్భాగ్యుని నే వైద్యుఁడు రక్షింపఁ గలఁడు? ఏ మం దాతనిని గాపాడఁగలదు? అట్లే శూన్యతా వాదము పరమ సిద్ధాంత మని విశ్వసించు వానినే వాదము రక్షింపఁ జాలదు. అతని కెవఁడును మోక్ష భిక్ష ప్రసాదింప లేఁడు.

ఇంత గట్టిగా మాధ్యమకు లేల హెచ్చరింప వలసి వచ్చెనా యను శంక కలుగ వచ్చును. కాని శూన్యతా వాదము పరమ సిద్ధాంత మని నమ్మువాఁడు దానిని అభావ ప్రతిపాదకముగా నర్థము చేసికొనక తప్పదు. వానికి ధర్మా ధర్మములు గూడ లోపించును. వాని కింక ముక్తి యెట్లు?

వ్యావహారిక మగుచున్న మాధ్యమక వాద విశిష్టత యేమి యను ప్రశ్న మట్లే యున్నది. జాగ్ర దవస్థ, స్వప్నావస్థ - యీ రెండును వ్యావహారికములే. ఏల యన రెండును ప్రతీత్య సముత్పన్నములు. అంత మాత్రమున జాగ్ర దవస్థయే స్వప్నావస్థ, స్వప్నావస్థయే జాగ్ర దవస్థ యని యెవ్వఁడు

వ్యావహారికముగాఁ జెప్పఁడు. జాగ్రదవస్థానుభూ తార్థ ములు యథార్థము లనియు, స్వప్నావ స్థానుభూ తార్థము లయథార్థము లనియుఁ జెప్పుచున్నాము. కారణ మేమి? మొదటివి యుక్తి యుక్తములు, కడపటివి యుక్తి యుక్తములు గావు. అట్లే మాధ్యమక వాదార్థము జాగ్రదవస్థార్థ సదృశము. ఇతరములు స్వాప్ని కార్థ సదృశములు. యుక్తి యుక్తము గానిచో మాధ్యమక వాద మాదరింప వలసిన యక్కఱ లేదు. అంత మాత్రముచేతనే యితర వాదములు నిర్హేతుకము లని భావింప రాదు. ఇతర వాదములకంటె మాధ్యమక వాద ముచితము.

ఇప్పటికి మాధ్యమక వాదము యుక్తి యుక్తముగానే కనిపింప వచ్చును. దీ పింతకంటె మిక్కిలి యుక్తియుక్త మైన వాదము వెలువడ వచ్చును గదా, యనుచో దీనిని నాగార్జునుఁడు గాదనుట లేదు. తనవాదమును బరమ సత్యముగా స్వీకరించు వానికి ముక్తి లేదను వాక్యమును జ్ఞప్తికిఁ దెచ్చుకొన్ననీ సంశయము నిర్మూలము గాకమానదు.

ఈ శూన్యవాదము వలనఁ బ్రయోజన మేమి? నేఁటి ప్రపంచము వివిధ సమస్యలలో మునిఁగి తేలుచున్నది. జాతీయముగా, నంతర్జాతీయముగాఁ బెక్కు చిక్కు లెదుర్కొను చున్నవి. నాగార్జునుని కాలము వేఱు, నాఁటి సామాజిక స్థితిగతులు వేఱు; ఆధునిక యుగము వేఱు, నేఁటి స్థితిగతులు వేఱు. సర్వము శూన్య మని గ్రహించినంత మాత్రమున క్షుధార్తుల కుక్షులు నిండవు. స్పర్ధలు, సంఘర్షణ ములు దప్పవు. రోగాదికమువలని బాధ తొలఁగదు.

మాధ్యమకుఁ డీ వ్యావహారిక జగత్తును, కల్లోలిత ప్రపంచమును గాదని త్రోసివేయుటలేదు. క్షుధార్తుఁడు, రోగపీడితుఁడు, రాగద్వేషాది వివశుఁడు నాట్యాదు లాస్వా

దింపఁ జాలనట్లే యవిద్యా పీడితుఁడు శూన్యతా వాదమును గ్రహింపఁజాలఁడు. దానివలని మేలును బొందఁజాలఁడు. సర్వము శూన్యమని జపించినంత మాత్రమున వ్యావహారిక వస్తుజాత మదృశ్యము గాదు. ఆదర్శాదిక మున్నంత కాలము ప్రతిబింబోపలబ్ధి గలుగుచున్నట్లే, పంచస్కంధము లున్నంత కాల మీ ప్రపంచము వర్తిల్లును. కాని శూన్యతా వాదమును గ్రహించినవానికిఁ బ్రపంచము యథార్థ మనుకొను వానికి భేద మున్నది. ప్రతిబింబ తత్త్వము మన కెఱుక యే. కాని పిచ్చుకలు మున్నగు వానికి దాని తత్త్వము దెలియదు. ప్రతిబింబతత్త్వ మెఱిఁగిన మానవుఁ డద్దానిని తిలకధారణాది ప్రయోజనములకు వినియోగించుకొనుచున్నాఁడు. ఆతత్త్వ మెఱుఁగని పిచ్చుకలు మున్నైనవి రాగద్వేషాదులకు లోనై పెక్కు పాట్లు పడుచున్నవి. అట్లే మాధ్యమకతత్త్వ మవగతము చేసికొనిన వానికిఁ జేసికొనని వానికిని విశేష మేర్పడుచున్నది. ఇతరుల తోపాటే మాధ్యమకుఁడు జగత్తు కంటకమయ మని యంగీకరించును. కాని కర్తవ్యతా విషయమందే యతఁడు విశిష్టుఁ డగుచున్నాఁడు. కంటక మయమైన జగత్తు సంచరణ యోగ్యము గావింప రెండు మార్గము లున్నవి. ఒకటి రత్నకంబళ సంఛన్నము గావిం చుట, రెండు పాదుకా ధారణము. రెండవది సుకరము. అట్లే ప్రపంచమును మార్చి భూలోక స్వర్గము స్థాపింప యత్నించుకంటె స్వకీయ దృష్టిని మార్చుకొనుట సుకరము. కావున మాధ్యమక వాదము వ్యక్తిని తనదృష్టిని సంస్కరించు కొనవలయునని హెచ్చరించుచున్నది.

అగుచో మాధ్యమక వాదము వ్యక్తియం దభిలషించు సంస్కార మేమి ? సంసార ప్రవృత్తికిఁ బ్రధాన కారణములు రెండు. ఒకటి యాత్మ వ్యామోహము, రెండు కార్య

వ్యామోహము. ప్రపంచమందలి సర్వానర్థములకు నాత్మ వ్యామోహము హేతువు. మంచికి కార్య వ్యామోహము కారణము. కావున విద్వాంసుఁడు 'నా' యను విష బీజము నొకే పరి గాకున్నను గ్రమముగానైనఁ బరిహరించును. దానిని బరిహరింప నోపని వానికి నివృత్తి గలుగదు.

సర్వభావములు వ్యావహారికములే కాని పారమార్థికములు గావని గ్రహించిన మనీషి వాని నితరులకొఱకుఁ ద్యజింప సంకోచింపఁడు. ఒక వేళ సంకోచించు నేని వానికి నింకను శూన్యత సిద్ధింప లేదనియు, నాత్మ వ్యామోహముడుగ లేదనియు గ్రహింపవచ్చును. అంతే కాక ధర్మ మాత్సర్యము, లాభ మాత్సర్యము, ఆవాస మాత్సర్యము, కుశల మాత్సర్యము, వర్ణ మాత్సర్యము నను పంచమాత్సర్యము లున్నంత కాల మాత్మవ్యామోహము చిగుర్చు చున్నదని గ్రహింప వలయును. కుల మత జాతి దేశ భేదములెన్ని, ప్రవర్తించు వాఁడు ఆత్మ వ్యామోహావిద్ధుఁడే కాని శూన్యతా వాద తత్త్వ మాకళించుకొనిన వాఁడు గాఁడు. అతఁడు పెడత్రోవఁ బట్టుచున్నాఁడు.

ప్రకృతమున నొక సందియము గలుగ వచ్చును. సర్వభావములు శూన్యము లైనప్పుడు కర్మములును శూన్యములు గదా! అప్పుడు ధర్మాధర్మములును, పాపపుణ్యములును శూన్యములు. ఇంక ధర్మ మనుష్ఠింపవలయును. అధర్మము పరిహరింప వలయు నను విధి నిషేధము లేల ? "అన్నమైతే నేమిరా మఱి సున్నమైతే నేమిరా అందుకే యీ పాడు పొట్టకు అన్నమే వేతామురా" అని చెప్పుట కాదా ?

ఇంత దూరము వచ్చిన పిమ్మట నీ ప్రశ్న మసందర్భ ప్రలాపమే యగును. ఏల యన సర్వభావములు శూన్యములన వ్యావహారికముగా నవి లేవని యర్థము గాదు. వ్యావ

హారికముగా నవి యున్నవి. బీజానుగుణమైన యంకుర ముద్భవించుచున్నట్లు కర్మానుగుణమగు ఫలము వ్యావహారిక ముగాఁ గలుగుచున్నది. సత్కర్మములకు సత్ఫలము దుష్కర్మములకు దుష్ఫలము వ్యావహారికముగా ననివార్యము. పారమార్థికముగా మాత్రము సుకృత దుష్కృతములు గలుగవు. కావుననే శూన్యవాది సోపధి నిర్వాణము పొంది నను బుణ్యకర్మములను బరిహరింపఁడు. వానికి స్వర్గ నరక ములు ప్రాప్తించునను రాగభయములు హేతువులు గావు. సంసారకూపమునఁ బడి క్రమ్మగుచున్న సత్త్వలోకమందలి మహాకరుణయే కారణము. ఇతరులకుఁ దాను సాయము చేయుచున్నాననికాని, తన కీర్తి భూలోకమున సుస్థిరముగా నిల్చు కట్టుకొనుననిగాని, స్వర్గమునఁ దనకు శాశ్వతావాసము లభించుననికాని, తనవలన సాయము పొందుచున్న జీవ లోకము తన్ను శ్లాఘించుననికాని యతఁ డాకాంక్షింపఁడు. తనవలెనే సమస్త సత్త్వలోకము సంసారము తరించి నిర్వా ణము పొందవలెనని యాశించును. ఇట్లాతఁడు నిష్కామ కర్మ మాచరింపవలయును.

ప్రతివానికి షట్పారమిత లనుష్ఠేయములు. దానము, శీలము, వీర్యము, క్షాంతి, ధ్యానము, ప్రజ్ఞ పాటింపవలయును. మొదటివి రెండు పారమితలు సమాజాభ్యున్నతికి, తరువాతి రెండును వ్యక్తి యభ్యున్నతికి, నా తరువాతి రెండు పారమితలు మోక్షప్రాప్తికిని నుద్దిష్టములు. ఆద్యము లగు పారమిత లయిదింటికిఁ బ్రజ్ఞ నాయకత్వము వహింప వలయును. అనఁగా దానాదులు ప్రజ్ఞాచోదితములై ప్రవర్తిల్ల వలయును. ఇచటఁ బ్రజ్ఞ యనఁ యథార్థ జ్ఞానము. లేదా భూతపర్యవేక్ష.

పారమితలను గూర్చి వివరింపక ముందు సామాజిక వైయష్టిక విషయములలో మాధ్యమకుల యభిప్రాయము గ్రహించు టావశ్యకము. సమాజము ప్రధానము, వ్యక్తి యప్రధాన మని ప్రతిపాదించు వాదములను గాని, తద్విపరీత వాదములను గాని, వ్యక్తి సమాజములకుఁ దుల్య ప్రాధాన్య మిచ్చు వాదములను గాని, రాజ్యార్థమై పౌరుఁడుండు నను వాదమును గాని, తద్విపరీత వాదమును గాని మాధ్యమక వాద మంగీకరింపదు. ఈ వాదము లెల్ల వ్యావహారికములు. ఆ యా దేశ కాల పాత్రలను బట్టి యవి పుట్టుచు గిట్టు చుండును. ఈ వాదము లట్లే మానవుఁడు స్వభావముచే మంచివాఁ డను సూత్రమును బురస్కరించుకొని వెలువడిన వాదములను, దుష్టుఁ డను సూత్రమును మున్నిడుకొని వెలువడిన వాదములను మాధ్యమకుఁ డంగీకరింపఁడు. సర్వభావములు హేతు ప్రత్యయ సంజాతము లగుటచే నిఃస్వభావములు. మానవుఁడును హేతుప్రత్యయ సంజాతుఁడే కాని యన్యుఁడు గాఁడు. కావున నతఁడు స్వభావముచే శూన్యుఁడు అనిర్వచనీయుఁడు గాని, దేవుఁడు గాఁడు. దానవుఁడును గాఁడు.

ఈ విషయములను గ్రహించినపుడు నేఁటి సమాజములో మాధ్యమకుఁ డెట్లు ప్రవర్తించునో స్థూలముగా నైన నూహింప వచ్చును. 'నా' 'మా' యను వానికిఁ దావుండదు. కావున నతఁడు దాన శీలి గావలయును. కుల మత జాతి దేశ భేదము లెన్నక యతఁ డెల్లరకుఁ దోడ్పడవలయును. వీఁడు తీర్థికుఁడు, వీఁడు పంచముఁడు, వీఁడు శ్రావకయాన సమాశ్రితుఁడు, వీఁడు మహాయాన సమాశ్రితుఁడు; కావున వీఁడు దానమున కపాత్రుఁడు, వీఁడు పాత్రుఁ డను విషమబుద్ధి యతనికిఁ గలుగరాదు.

మాధ్యమక వాదమునకు మానవ మాత్రుఁ డగు నెల్లవాఁడు నధికారియే. అంత మాత్రమున గ్రహణ ధారణ విచారణ తారతమ్యములు లేవని యర్థము గాదు. వైద్యుఁడు రోగమునుబట్టి మందును వాడు నట్లు వినేయుని మానసిక పక్వావస్థనుబట్టి యుపదేశము మాఱును. మాధ్యమక దర్శనమున నెల్ల యుపదేశములకు మధ్యమా ప్రతిపత్తే గమ్యము. అంతియ కాని యపశూద్రాధికరణాదుల కతని శాస్త్రములో నెక్కడ తావు లేదు.

బౌద్ధమున శీలమున కున్న ప్రాముఖ్యము సుప్రసిద్ధము. ప్రతి మాధ్యమకునకుఁ జతుర్బ్రహ్మ విహారములు-మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష-ముఖ్యములు. అద్వేషము, అలోభము, అమోహ మను త్రికుశలమూలములను బొంద వలయును. సిద్ధాంత వైరుధ్యము తాండవించుచున్న యాధునిక యుగమునం దతఁడు తన దర్శనమునుబట్టి యెట్లు నడచుకొన వలయునో చెప్పఁకొన వచ్చును. ఎల్ల వాదములు వ్యావహారికములే కాని పారమార్థికములు గావు. మాధ్యమక వాదము సర్వపద వాచ్యాంతర్గతము. కావునఁ దన వాద మందలి దురభిమానముతో నతఁ డితర వాదములను ద్వేషింపరాదు. సంసారమునందు మునుకలు వేయు సత్త్వ కోటికిఁ దోడ్పడు నే మార్గము నైన రాగ ద్వేషాతీతుఁడై యనుసరింప వచ్చును. తమ శాస్త్రములు పేర్కొన లేదనియుఁ, దమ సంప్రదాయములకు విరుద్ధము లనియుఁ దలఁచి యాధునిక విజ్ఞాన శాస్త్రములు గనుఁగొన్న విషయములను సౌలభ్యములను నతఁడు త్రోసిరా జనఁడు. వాని నతఁడు విధిగా లోక సంగ్రహార్థము వాడుకొనును. విశేషించి తన సిద్ధాంత మంగీకరింపని వానిని ద్వేషించుటకు, స్వపక్షాభి

మానముతోఁ జిందులు ద్రొక్కుటకు, నతని కతని దర్శనమును బట్టి యధికారము లేదు.

వీర్యము, క్షమ యను పారమితలు రెండును వ్యక్తి యభ్యున్నతికై యుద్దిష్టములు. జీవితము సుఖతర యాత్ర కాదు. ఎన్నో ఆటుపోటులు గలుగు చుండును. ఎన్నో సంక్షోభములు, ఎన్నో యంతరాయములు సంభవించు చుండును. కావున వాని నెదుర్కొనఁజాలు ధీరత యావశ్య కము. ఆజీవికా భయము, శోక భయము, మరణ భయము, దుర్గతి భయము, పర్షదసాధ్య భయ మను పంచ భయము లను జయింప వలయును. ఈ భయములను దిగఁద్రావని వానికిఁ దత్త్వ విచారము గాని, పరైకాంత హితాచరణము గాని దుస్సాధము. పైఁగాఁ దన నిశ్చయించుకొన్న మార్గము గమించుటకుఁ గూడ వీర్య మావశ్యకము.

పూర్వోక్త విషయములను విన్న పిమ్మట నిట్లు తోఁప వచ్చును. ఎల్ల మతములు నెల్ల వాదములు సత్కార్యాచరణ మును బోధించు చున్నవి గదా! ఇంక మాధ్యమక వాద విశేష మేమి ?

సర్వము ప్రతీత్య సముత్పన్నము. కావున షట్పార మితా మూలమున ననిర్వచనీయ మగు నిర్వాణము పొందు టయే కర్తవ్య మను వానికిని, దేశ కాల జీవేశ్వరాదులు నిత్య మనియో, మిథ్య యనియో శబ్దైక శరణులై బ్రహ్మ సాయుజ్యమో, బ్రహ్మైక్యమో లక్ష్యముగా భావించు వానికి ప్రవర్తనమునందు వ్యత్యాసము లేదా ? మాధ్యమకుఁడు వివృత హృదయుఁడు. శబ్దైక శరణుఁడు సంవృత చిత్తుఁడు. దేశ కాల పాత్రముల నెఱిఁగియు నధిగమించియు మొదటి

వాఁడు చూడఁగలఁడు. రెండవ వాఁడు తన ప్రామాణిక గ్రంథావరణము దాఁట లేఁడు.

ఇంత మాత్రముచే నాగార్జునుఁడు తననాఁటి సంఘమును, ఆచారములను, భావములను, విశ్వాసములను బూర్ణముగా నధిగమించి సర్వకాల సర్వావస్థల కనుగుణ మగు స్థితిని దాను జూచి యితరులకుఁ జూపెనని యూహింపరాదు. ఆయన వాదమే ప్రతిభావము ప్రతీత్య సముత్పన్నమనియు, మాధ్యమక వాదము తాదృశమే యనియు ఘంటాపథముగాఁ జెప్పుచున్నది. జీవేశ్వరులు శూన్యులని యతఁడు చాటినను వారిని వ్యావహారికముగా నామోదించెను. కావుననే యతనికి త్రికాయములందు, షడ్గతులయందు, జన్మ పరంపరయందు పంచ బుద్ధులయందు సప్త తథాగతులయందు, షోడశ నరకములయందు నమ్మక మున్నది. కావుననే 'రత్నావళి'లో రాజున కతఁడు ధర్మాస్పదము నిర్మింపు మనియు, మహాయాన నిందకులు వీచి నరకమునందు ప్రమగ్గుదు రనియు సూచించి నాఁడు.

సంగ్రహాముగా నిదియే మాధ్యమక వాదము. ఈ వాదము వెలువడినంతనే యటు బౌద్ధ దార్శనిక ప్రపంచమందు, నిటు వైదిక శాస్త్ర జగత్తునందును సంక్షోభము బయలు దేఱెను. సర్వము శూన్య మనినప్పుడు పరమ పవిత్రములుగా భావింపబడుచున్న సిద్ధాంతములు మతము లెగిరిపోవక తప్పదు గదా! ఇట్టి పని జరుగుచుండఁగా నభినివేశము, దానికిఁ దగిన బుద్ధిబలము గలవాఁ డూరకుండఁ గలఁడా? కావున నలుమూలలనుండి నాగార్జునుని వాదముపై దొమ్మిగా తీవ్ర విమర్శనములు దూఁకినవి. ఆ దూఁకుడు లింకను సాగుచున్నవి.

మాధ్యమిక వాదముపై వెలువడిన విమర్శనముల సాకల్య పరిశీలన మావశ్యకము. ఏల యన నివి మాధ్యమక వాద పరిపూర్ణార్థమును గ్రహించుటకే కాక ప్రకృత ప్రకరణ గ్రంథమగు నాగార్జునుని విగ్రహవ్యావర్తని తాత్పర్యమును, ప్రాముఖ్యమును, నాగార్జునుని ప్రతిభను నెఱుంగుటకుఁ దోడ్పడఁ గలవు. కాని మాధ్యమక దర్శన విమర్శన మపారము. క్రీస్తుశకము మొదటి శతాబ్దినుండి నేటి వఱకు దార్శనిక సంప్రదాయ వేత్తలు దానిని ప్రస్తావించి ఖండనమో మండనమో కావించుచున్నారు. వాని నన్నిటి నిట నుటంకింప స్థలము చాలదు. కావున దిఙ్మాత్రముగా వాని నీ వ్యాస మిటఁ బ్రదర్శింపఁ గలదు.

## నైయాయిక విమర్శనము

మాధ్యమకులు సర్వభావములు శూన్యము లనుచున్నారు. ఇది యథార్థ మగుచోఁ బ్రమాణములు లేక పోవలయును. ఇది సమంజసము గాదను దృష్టితో గోతముఁడు తన న్యాయదర్శనమందలి ద్వితీయాధ్యాయ ప్రథమాహ్నికమందు పూర్వపక్షమును ముందనువదించి, యాపిమ్మట దానిని ఖండించి, ప్రమాణములను వ్యవస్థాపింప యత్నించెను.

ప్రమాణము ప్రమేయమునకంటె మున్ను సిద్ధించునేని, యింద్రియార్థ సన్నికర్షమువలన ప్రత్యక్ష ముత్పన్నము గాదు. ప్రత్యక్షమే యిట్లు కలుగ నప్పుడు తక్కుంగల ప్రమాణములును సిద్ధింపవు. అట్లుగాక ప్రమేయములకుఁ బశ్చాత్కాలమున 'ప్రమాణములు' సిద్ధించు నను పక్షమునఁ బ్రమాణములచేఁ బ్రమేయ సిద్ధి యగుట లేదు. అట్లుగాక ప్రమాణ ప్రమేయములు యుగప త్సిద్ధ లనుచో, బుద్ధులకు

క్రమ వృత్తి త్వాభావము గలుగును. కాని యిది యనుభవ విరుద్ధము. ప్రత్యర్థ నియతత్వము గానఁబడు చున్నది.

కావునఁ బ్రమాణములు ప్రమేయములకంటె ముందు గాని, వెనుకగాని, సమకాలమునఁగాని సిద్ధింపవు. త్రైకాల్య మున నిట్లు సిద్ధింపని ప్రత్యక్షాదులకుఁ బ్రామాణ్యము గలుగదు.

ఇట్లనూదితమైన ప్రతిపక్షము నుద్యోతకారుఁ డిట్లు ప్రత్యుత్తరింపఁ జూచుచున్నాఁడు:—

ప్రత్యక్షాదులకుఁ బ్రామాణ్యము లేదని ప్రతిపక్షి ప్రతిజ్ఞ. "నేను గాఢనిద్రలో నున్నాను. మా యమ్మ గొడ్రాలు," ఇత్యాది వాక్యముల యట్లే పై ప్రతిజ్ఞావాక్యము స్వయంబాధిత మగుచున్నది. ఏలయన నతఁడు ప్రత్యక్షాదు లను బడసియే వానికిఁ బ్రామాణ్యము లేదనుచున్నాఁడు. అట్లు పడయఁడేని ప్రత్యక్షాదులని యేని పేర్కొనఁజాలఁడు.

ఈ సందర్భమునఁ బ్రతిపక్షి యిట్లనవచ్చును:— "ప్రత్యక్షాదులు ప్రతిషిద్ధములు గావు, వాని ధర్మ మగు ప్రామాణ్యము మాత్రము ప్రతిషిద్ధము." ఈ పక్షమున ధర్మము (లేదా భావము) ద్రవ్యమును విడిచి వేఱుగా నుండ వలయును. కాని ధర్మము స్వతంత్రము గాదు. కావున ధర్మ ప్రతిషేధము ధర్ములగు ప్రత్యక్షాదుల ప్రతిషేధమే యగును. అప్పుడును వ్యాఘాత మనివార్యము. ఎట్లన ప్రత్యక్షాదులు గలుగవని చెప్పువాఁడు వేనిని బురస్కరించు కొని వానిని బ్రతిషేధించును? ప్రత్యక్షాదులు గలుగ నప్పుడు, అవి కలుగ వని చెప్పుట కుపాయము గలుగదు.

అది యట్లుండఁ బ్రత్యక్షాదులకుఁ బ్రామాణ్యము లేదను నపుడు ప్రతిపక్షి యా ప్రత్యక్షాదులకంటె నన్యమును

బ్రమాణముగా నంగీకరించు చున్నాఁ డని యూహింప వలసి వచ్చుచున్నది. మఱొక దానిని బ్రమాణముగా నతఁ డంగీకరింపఁ జేని బ్రమాణములు గలుగవని చెప్పవలయును. అట్లు చెప్పక బ్రత్యక్షాదులకుఁ బ్రామాణ్యము లేదని వచించుటయందలి విశేష మేమి ? బ్రమాణములు గలుగ వనుటయే తాత్పర్య మయిన నది సిద్ధింపదు. కావున వ్యాఘాత మేలము కొనుచున్నది.

అట్లు కాక బ్రత్యక్షాదులు మాత్ర మంగీకృతములు గావు గాని, యన్యప్రమాణము అభ్యనుజ్ఞాత మందురా ? అట్లైనను అ య్యభ్యనుజ్ఞాత బ్రమాణము మాత్ర మెట్లు సిద్ధించును ? ప్రతిపక్షి చూపిన త్రైకాల్యాసిద్ధి హేతువు చేతనే యతనికి సమ్మత మగు నా బ్రమాణాంతరమును సిద్ధింపదు. కావున వ్యాఘాత మనివార్యము.

బ్రత్యక్షాదులకుఁ బ్రామాణ్యము గలుగ దను వాక్య మున కర్థ మిది కాదు. "వీఁడు రాజ పురుషుఁడు గాఁడు," అను వాక్యము పురుషత్వము నిషేధింపక రాజ పురుషత్వ మును మాత్రము బ్రతిషేధించు నట్లు బ్రకృత వాక్యము బ్రత్యక్షాదుల బ్రామాణ్యమును మాత్రము బ్రతిషేధించును గాని, బ్రత్యక్షత్వమును బ్రతిషేధింప దని బ్రతిపక్షి చెప్ప వచ్చును. ఈ పక్షమునఁ బ్రత్యక్షాదుల స్వరూప మేమి ? దీని నతఁడు వివరింపఁ బూనెనా, మా వాదమున కాపాదించిన దూషణముతే యతని వాదమునకుఁ బ్రాప్తించును.

ఈ వ్యాఘాతము లట్లుండ నిండు. బ్రత్యక్షాదుల బ్రామాణ్యము సిద్ధంపమికి త్రైకాల్యాసిద్ధి హేతువుగాఁ బ్రతి పక్షి పేర్కొనుచున్నాఁడు. త్రికాలముయొక్క భావము త్రైకాల్యము. త్రైకాల్యముయొక్క యసిద్ధి త్రైకాల్యా సిద్ధి. ఇట్టి యసిద్ధి త్రైకాల్య విషయ మగుటవలన వ్యధి

కరణ మగు చున్నది. అంతే కాని యీ యసిద్ధి ప్రమాణ సంబంధి కాదు. కావున నిది ప్రమాణాసిద్ధికి హేతువు గాదు. ఈ చిక్కునుండి తప్పించుకొనుటకై "త్రైకాల్యాసిద్ధి వలన" అను పదమునకు మూఁడు కాలములందును నర్థసాధనము గలుగమి యను నర్థము చెప్పు నేని ప్రతిజ్ఞా వాక్యము హేతువు నాక్షిప్తము గావించును. హేతువు గలుగకున్న ప్రమాణము లర్థము సాధింప వను నర్థ మెట్లు సిద్ధించును?

ఈ దోష మట్లుంతము. త్రైకాల్యాసిద్ధి వలనఁ బ్రత్యక్షాదులకుఁ బ్రామాణ్యము లేదని చెప్పు ప్రతిషేధము సంభవ ప్రతిషేధమా, లేక ప్రత్యక్షాది సామర్థ్య ప్రతిషేధమా? సంభవ ప్రతిషేధ మందురేని యది ప్రమాణ సామాన్య ప్రతిషేధ మగునా, లేక కతిపయ ప్రమాణ ప్రతిషేధ మగునా? ఆద్యమే యన్నఁ, "ప్రత్యక్షాదులకుఁ బ్రామాణ్యము లేదు," అని ప్రత్యక్షాదులఁ జెప్పనుట వ్యర్థము. ఇదియే తాత్పర్యమగుచోఁ బ్రమాణములు గలుగ వని చెప్ప వలయును. ఇట్లు చెప్పినచో నీ ప్రతిషేధ మసంభవోపలబ్ధికి హేతువగుచుఁ బ్రమాణ లక్షణములను బొందును. అప్పుడు ప్రతిజ్ఞాభంగము సిద్ధించును. ఇట్లు కాక ద్వితీయ పక్షమిష్టమగునేని కొన్ని ప్రమాణములు గలుగవనుట తాత్పర్య మగును. అప్పుడు ప్రమాణాంతరము గలుగును. కాని సామాన్య మనభ్యుపగత మగుచుండ విశేష ప్రతిషేధమున కవకాశము గలుగదు. కావునఁ బ్రమాణ సంభవ ప్రతిషేధము సిద్ధింపదు.

"మా ప్రతిషేధము సంభవ ప్రతిషేధము గాదు; కేవలము సామర్థ్య ప్రతిషేధము. ఇది ప్రమాణము లర్థము సాధింప వని చెప్పును," అని ప్రతిపక్షి చెప్పవచ్చును. ఇట్లగు నేని, "త్రైకాల్యాసిద్ధివలనఁ బ్రత్యక్షాదులకుఁ బ్రామాణ్యము

లేదు. త్రైకాల్య సిద్ధివలనఁ బ్రత్యక్షాదులకుఁ బ్రామాణ్యము గలదు,” అను నీ రెండు వాక్యము లేకార్థములా? భిన్నార్థ ములా? ఏకార్థము లగుచోఁ ద్రైకాల్య సిద్ధివలనఁ బ్రత్య క్షాదులకుఁ బ్రామాణ్యము గలుగునని యేల చెప్పరాదు? అది యట్లుండ నీ వాక్యము లభిన్నార్థము లయిన, నివి రెండు వాక్యములకు ప్రతిపత్తి యెట్లు గలుగుచున్నది? ప్రమాణము వలన నన్నచోఁ బ్రతిపక్షమునకు వ్యాఘాత మనివృత్తము. అట్లు కాక యన్యమువలనఁ దత్ప్రామాణ్య మన్న, సంజ్ఞా భేదము మాత్రమే కలుగును. మేము ప్రమాణ మనుదానిని మీరు మఱొక పేరితోఁ జెప్పుచున్నారు.

పై వాక్యములు రెండు భిన్నార్థము లని ప్రతిపక్షి చెప్పునేని యా భిన్నార్థత దేనిచే నెఱుఁగుచున్నాఁడు? ప్రత్యక్షాదులు గలుగవని యతని వాదన. సమానాధికరణ మగు ప్రత్యక్షాది శబ్దము ప్రత్యక్షాద్యభావమును జెప్పఁ జాలదు. ఉదాహరణమునకు ఘటము లేదను వాక్యము గ్రహింతము. ఈ వాక్యము ఘటాభావమును బ్రతిపాదింపదు. ఘట మింట లేదనియో, లేక ఘటము సమర్థము గాదనియో, యీ వాక్యము ప్రతిషేధించును. అట్లే ప్రమాణములు గలుగ వను వాక్యము ప్రమాణముల యభావమును బ్రతిపాదింపఁ జాలదు. ఆ వాక్యము చేయఁగలిగిన దొక్కటే. ఇతర తంత్ర ప్రతిపాదిత ప్రమాణములను గాని, ప్రమాణ సామర్థ్యమును గాని, ప్రమాణ కాల విశేషమును గాని ప్రతిషేధించునే కాని ప్రమాణ సత్తను బ్రతిషేధింపఁ జాలదు.

అది యట్లుండఁ బ్రమాణములు గలుగవని యెవ రెవరి కెట్లు తెలుపుచున్నారు? ఎఱిఁగిన వాఁ డెఱుఁగని వాని కెఱిఁగించుచున్నాఁ డందురేని యతఁ డెట్లెఱిఁగెను? ప్రమాణముచే నన్న, వ్యాఘాత మెదుర్కొనుచున్నది.

ఏల యనఁ బ్రతిపక్షి ప్రమాణ మంగీకరింపఁడు. అన్యథా యెఱుఁగుచున్నాఁ డను నేని, దానికి దృష్టాంతము లేదు. విశేషించి వక్తృ వక్తవ్య భేద మంగీకరించినఁ దత్ప్రతిపాదక ప్రమాణము సిద్ధించుచు వ్యాఘాతము పొడముచును. అట్లు కాక వక్తృ వక్తవ్య భేద మెఱుఁగఁ డేని యతఁ డెవని కెట్లు ప్రతిపాదింపఁబడుచున్నదో యెఱుఁగఁడు. కావున ప్రతిపక్షికి వ్యాఘాత మనివృత్త మగుచున్నది. ప్రమాణములు గలుగ వని ప్రతిజ్ఞ గావించువాఁ డవి యెట్లు కలుగవో నిరూపింప వలయును. కలుగవని ప్రమాణము చూపునా, వ్యాహతి గలుగును. చూపక మానునా, ప్రతిజ్ఞాతార్థము సిద్ధింపదు.

ఇట్లు తఱచి చూచినకొలఁది ప్రత్యక్షాదులకుఁ బ్రామాణ్యము లేదను వాక్యము ప్రలీన మగుచున్నది.

ప్రతిపక్షి చెప్పుచున్న త్రైకాల్యాసిద్ధి హేతువు నంగీకరించినను, దానివలన నతని ప్రమాణ ప్రతిషేధమే మున్ను సిద్ధింపదని గోతముఁడు మొదటికే చెఱుపు దెచ్చెను. అతని తాత్పర్యమును భాష్యకారుఁ డగు వాత్స్యాయనుఁ డిట్లు వివరించుచున్నాఁడు. ప్రతిషేధ్యమునకంటె మున్నుగాఁ బ్రతిషేధము సిద్ధించునేని యా ప్రతిషేధము దేనిని బ్రతిషే ధించును? ప్రతిషేధ్యార్థము గలుగనప్పుడు ప్రతిషేధము నిరర్థకము. కాక ప్రతిషేధ్యార్థము మున్నుగా నుండి ప్రతిషే ధము పిమ్మటఁ గలుగునేని యున్న యర్థమును బ్రతిషేధము తీసివేయఁజాలదు. కావున నప్పుడు ప్రతిషేధము సిద్ధింపదు. కాక ప్రతిషేధ్య ప్రతిషేధములు రెండును యుగపత్కాల సిద్ధి పొందునేని, ప్రతిషేధ్యసిద్ధియొక్క యభ్యనుజ్ఞానమువలనఁ బ్రతిషేధము నిరర్థక మగును. ఇట్లు ప్రతిషేధ లక్షణవాక్యము సిద్ధింపదు. ఇది సిద్ధింపకపోవుటచేఁ బ్రత్యక్షాదులకుఁ బ్రామా ణ్యము సిద్ధించును.

ఇక్కడ వార్తికకారుఁ డిట్లు వంత పలుకుచున్నాఁడు :-
త్రైకాల్యాసిద్ధివలనఁ బ్రతిషేధము సిద్ధింపనట్లే ప్రమాణము
లును సిద్ధింపవు గదా యని ప్రతిపక్షి పలుకవచ్చును.
త్రైకాల్యాసిద్ధి వాదము ప్రతిపక్షి వాదము గాని మా వాదము
గాదు. కావున ముందతని వాదము మాత్రము సిద్ధింపదు.
స్వాంగుళి జ్వాలాన్యదిధక్షువు ఇతరుల దహింప నోపునో
లేదో కాని ముందుఁ దన వ్రేళ్ళను గాల్చుకొనక తప్పదు.
అట్లే ప్రత్యక్షాది ప్రామాణ్య నిరాకరిష్ణువు పరుని వాదము
ద్రోసివేయఁ గలిగినను లేకున్నను స్వకీయ వాదమును
వ్యాహతము గావించుకొనక తప్పదు.

వాత్స్యాయనుఁడు త్రైకాల్యమును, బ్రమాణములను
ప్రతిషేధించు ప్రతిపక్షి వాదము నిట్లెదుర్కొనుచున్నాఁడు :-
త్రైకాల్య మంగీకరింపనిచో వ్యవహారమే కలుగదు. "వంట
వానిఁ దోడ్కొని రమ్ము, వండఁగలఁడు. లావకునిఁ బిలువుము
కట్టెలు వేయును," అని యీ విధముగా నున్న వ్యవహారము
త్రైకాల్యము లేనిచో నెట్లు గలుగును? మనము నడచు
నప్పుడు శిలా సర్ప కంట కాదులను బరిహరించి పాదము
మోపుచున్నాము. నిక్కముగాఁ బ్రమాణములు గలుగ వేని
యీ ప్రవృత్తి గలుగఁ జాలదు.

ఇట్లు ప్రమాణ ప్రతిషేధమును నిరాకరించి న్యాయ
సూత్రముల నున్నిడుకొని వాత్స్యాయనుఁడు ప్రమాణముల
వ్యవస్థాపింపఁ బూని చెప్పుచున్నాఁడు :—

ప్రమాణములు ప్రమేయములకు మున్నో, వెనుకనో,
సమకాలముననో యుండ వలయు నని ప్రతిపక్షి యపోహ
పడుచున్నాఁడు. కాని వాస్తవముగాఁ బ్రమాణ ప్రమేయ
ములకుఁ బూర్వాపర సహభావ నియమము లేదు.
ఎఱుకకు సాధన మగునది ప్రమాణము. ఎఱుకకు విషయ

మగునది ప్రమేయము. సూర్య ప్రకాశమువలన నర్థములు కనిపించు చున్నవి. ఇక్కడఁ బ్రమాణ మగు ప్రకాశము మున్నుగాను, నర్థములు వెనుకను బ్రసిద్ధము లగుచున్నవి.

శబ్దమునుఁబట్టి యాతోద్య మూహింతుము. ఇచట శబ్దము ప్రమాణము. ఆతోద్యము ప్రమేయము. పూర్వ సిద్ధ మగు నాతోద్యమును బశ్చాత్సిద్ధ మగు శబ్దముచే ననుమానింతుము. కావున నిచటఁ బ్రమేయము మున్నుగాను, బ్రమాణము పిమ్మటను సిద్ధించుచున్నవి. ధూమ దర్శనముచే నగ్ని ననుమానింతుము. ఇందుఁ బ్రమాణ మగు ధూమము, ప్రమేయ మగు నగ్నియు నేక కాలికములు. ఈ న్యాయమునఁ బ్రమాణ ప్రమేయములకుఁ బూర్వాపరసహభావ నియమము లేదు.

ఇట్లనుటచేఁ బ్రమేయము ప్రమేయమే, ప్రమాణము ప్రమాణమే యని భావింపరాదు. ఉపలబ్ధి విషయము, అనఁగా ప్రమేయము, అన్యోపలబ్ధికి సాధనమగుచో నది ప్రమాణ మగును. ఇట్లేకవస్తువు ప్రమేయము, ప్రమాణము గావచ్చును. ఈ యర్థమునే సూత్రకారుఁ డిట్లు ప్రతిపాదించుచున్నాఁడు :—

ప్రమేయతా చ తులా ప్రామాణ్యవత్ ॥ 2-1-16

గురుత్వ పరిమాణ జ్ఞానమును గలిగించుచుఁ దుల ప్రమాణ మగును. జ్ఞానమునకు విషయమగు సువర్ణాది గురు ద్రవ్యము ప్రమేయము. జ్ఞాత గురుత్వ పరిమాణమగు సువర్ణముచే తులాంతర ప్రతిపత్తి పొందఁబడు చున్నప్పుడా సువర్ణము ప్రమాణము, తులాంతరము ప్రమేయము నగుచున్నవి. ఇట్లు నిమిత్తభేదముచే నేకవస్తువు ప్రమాణము, ప్రమేయము నగుచున్నది. ఇట్లే కారక శబ్దములు నిమిత్త వశమున

నొ:కే వస్తువునందు వర్తించుచున్నవి. వృక్షము గలదు. వృక్షమును జూచుచున్నాఁడు. ఇత్యాదికము.

సూత్రకారుఁ డిప్పుడు ప్రతిపక్ష దూషణ మనువదించు చున్నాఁడు:—

ప్రమాణతః సిద్ధేః ప్రమాణానాం ప్రమాణాంతర సిద్ధి ప్రసంగః. 2-1-17

ప్రమాణములకుఁ బ్రమాణముచే సిద్ధియగు నేని ప్రమాణాంతర సిద్ధి ప్రసంగ మేర్పడును. దీనివలన అనవస్థ గలుగును.

త ద్వినివృత్తే ర్వా ప్రమాణ సిద్ధివత్ ప్రమేయ సిద్ధిః ॥—18

ప్రమాణాంతరములచేఁ గాక తమకుఁ దాముగాఁ బ్రమాణములు సిద్ధించుచోఁ, బ్రమాణము లట్లే ప్రమేయములు గూడ తమకుఁ దాము సిద్ధింప వలయును.

న ప్రదీప ప్రకాశవత్ త త్సిద్ధేః ॥—19

ప్రమాణ ప్రమేయములు దమకుఁ దాముగా సిద్ధింపవు. దీప ప్రకాశము ప్రత్యక్షాంగము. అది దృశ్యార్థ దర్శనమందు ప్రమాణ మగుచున్నది. ఆ ప్రకాశము ప్రత్యక్షాంతర మగు చక్షువు సన్నికర్షముచే గ్రహింపఁబడుచుఁ బ్రమేయ మగును. దీప మున్నపుడు వస్తువులు కనిపించి లేనప్పుడు కానిపింప కుండుటవలన దీపము దర్శన హేతువుగా ననుమానింపఁబడును. "చీకటి లోపలికి దీపము గొనిరండు," అని పలికి నపుడు ఆ దీపము శాబ్దముచే గ్రహింపఁబడు చున్నది. ఇట్లు ప్రత్యక్షాదులకుఁ బ్రత్యక్షాదులచేతనే యుపలబ్ధి కలుగు చున్నది గాని, ప్రత్యక్షాంతరముచేఁ గాదు.

తన్ను దాను గ్రహించుట (తస్య తేన గ్రహణం) సంభవింపఁ దనుట యుక్తము గాదు. అర్థ భేదమునకు లక్షణ సామ్య మున్నది. కావునఁ బ్రత్యక్షాదులకుఁ బ్రత్య

క్షాదులచేతనే గ్రహణ మనుట యుక్తము గాని యన్యముచే నన్యమునకు గ్రహణము కనఁబడు చున్నదనుట యుక్తము గాదు. ప్రత్యక్ష లక్షణముచే ననేకార్థము సంగృహీతము. ఆ య్యనేకార్థములో దేనిచే నెద్దాని కేని గ్రహణము గలుగ వచ్చును. కావున దోషము లేదు. ఇట్లే యనుమానాదు లందుఁ గూడ నూహ్యము. జలాశ యానీత జలముచే జలా శయ జల మని గ్రహించుచున్నాము గదా!

ఇట్లే జ్ఞాతృ మనస్సుల దర్శనమునందును గ్రహింప వలయును. 'నేను సుఖిని', 'నేను దుఃఖిని' అను ననుభవమున జ్ఞాత తన్ను దాను గ్రహించుచున్నాఁడు. ఏక కాలమున భిన్న జ్ఞానములు గలుగ కుండుటచే మనస్సు తన్ను దాను గ్రహించు చున్నది (అనుమానించు చున్నది). జ్ఞాతృ జ్ఞేయ ములకు గ్రహణ గ్రాహ్యముల కభేదము గలుగుచున్నది.

అది యట్లుండ తన్ను దాను గ్రహించుట కలుగ దనుచో మఱొక చిక్కు గలుగును. ప్రత్యక్షాదులకు విష యము గానియర్థము సిద్ధించుట లేదు. ప్రత్యక్షాదులకు విషయము గానియర్థజాతము కొండొకటి యుండి యది ప్రత్యక్షాదులచే గ్రహింప శక్యము గాని దగుచో, దాని గ్రహణమునకుఁ బ్రమాణాంతరము ప్రతిపాదింప వలయును. దేనిచేఁ గూడ నద్దానిని నుపపాదింప శక్యము గాదు. ఏల యన సదసదాత్మక మగు సర్వము ప్రత్యక్షాదులకు విషయ మగుట యనుభవ గోచరమే.

కొంద ఱీ దృష్టాంతమునకు మఱొక విధముగ నర్థము చెప్పుచున్నారు. దీప ప్రకాశము దీప ప్రకాశాంతరము లేకయే కానఁబడు చున్నది. అట్లే ప్రమాణములు ప్రమా ణాంతరములు లేకయే గ్రహింపఁబడుచున్న వని స్వతః ప్రామాణ్య వాదులు చెప్పుచున్నారు. ఈ పక్షమున ఈ

హేతువుచేత బ్రమేయములును దమ్ముఁ దాము గ్రహించు చున్న వని చెప్పవచ్చును. అప్పుడు ప్రమేయ గ్రహణము నకుఁ బ్రమాణము లక్కఱ లేక పోవలసి వచ్చును. పైఁగాఁ బ్రమాణ గ్రహణమునకుఁ బ్రమాణాంతర మక్కఱ లేదని ప్రమేయములకు మాత్రము ప్రమాణములు వలయు ననుట యందలి సామంజస్య మేమి ?

కావున ప్రదీప ప్రకాశమును విశేష హేతువునకు దృష్టాంతముగా స్వీకరించినచో నేకాంతత యేర్పడి పూర్వోక్త మగు ననైకాంతికతా దోషము దొలఁగును.

ప్రత్యక్షాదులు ప్రత్యక్షాద్యంతరముచే గ్రహింపఁ బడు ననుచో ననవస్థా దోషము గలుగు నన వచ్చును. కాని యట్టి దోషము వాటిల్లదు. ఏల యన నిమిత్త వశమునఁ బ్రత్యక్షాదు లొకప్పుడు ప్రమేయములు, మఱొకప్పుడు ప్రమాణములు నగుచున్నవి. ఉదాహరణమునకు, "నేనీ వస్తువును బ్రత్యక్షముచే నెఱుఁగుచున్నాను. దీని ననుమానముచేఁ దెలియుచున్నాను," అనుచున్నాము. ఇందుఁ బ్రత్యక్షాదులు ఉపలబ్ధికి సాధనములై ప్రమాణము లగుచున్నవి. "నా యీ జ్ఞానము ప్రత్యక్షము. ఈ జ్ఞాన మానుమానిక," మనినప్పుడు ప్రత్యక్షాదులు ప్రమేయము లగుచున్నవి. ఈ విశేషమును బురస్కరించుకొని వ్యవహార మంతయు వ్యాఖ్యానింప వచ్చును. దీనిని విడిచినచో అనవస్థానీయ మగు వ్యవహారాంతరము గలుగదు.

## కాల స్వరూపము

న్యాయదర్శన కర్త ద్వితీయాధ్యాయ ప్రథమాహ్నిక మందలి 37 వ సూత్రమున మాధ్యమక కాల స్వరూపము ఘటంకించి తరువాతి నాల్గు సూత్రములచేఁ దానిని ఖండించెను,

చెట్టునుండి రాలి పడుచున్న ఫలమున కూర్ధ్వము పతితాధ్వము. దానితోఁ గూడిన కాలము పతిత కాలము. ఫలము క్రింది దేశము పతితవ్యాధ్వము. దానితోఁ గూడిన కాలము పతితవ్యము. పతిత పతితవ్యాధ్వములకంటెఁ దృతీయాధ్వము లేదు. దానితోఁ గూడిన కాలమును లేదు. కావున వర్తమానము లేదు. ఇది మాధ్యమికుని వాదము.

మాధ్యమికుఁడు కాల మధ్వ వ్యంగ్య మని భావించుచున్నాఁడు. అది యుక్తము గాదు. కాలము క్రియావ్యంగ్యము. పతనక్రియ వ్యుపరతమైనప్పు డది పతితకాలము. క్రియ ముందు సంభవింపఁ గలదేని, యది పతితవ్య కాలము. వర్తమాన ద్రవ్యమందుఁ గ్రియ గ్రహింపఁబడుచున్నప్పు డది వర్తమానము. ద్రవ్యమున వర్తమానక్రియ గ్రహింపఁబడ నప్పుడు క్రియాపదము గాని, యుత్పత్స్యమానత గాని గ్రహింపఁబడవు. ఈ విధముగా వర్తమానకాలము నపేక్షించి భూత భవిష్యత్కాలము లేర్పడుచున్నవి. ఈ వర్తమానము లోపించిన, పతిత పతితవ్యకాలములు గలుగవు. కావునఁ బ్రతిపక్షి వాదము సమంజసము గాదు.

అది యట్లుండఁ బ్రతిపక్షి యతీతానాగతములు రెండు నితరేతరాపేక్షచే సిద్ధించు ననుచున్నాఁడు. ఇది యుక్తము గాదు. అతీతకాల మతీతకాలమే. అది యనాగతకాలము నెట్లు సిద్ధింపఁజేయును? అనాగతకాలము వర్తమానము గాదు. అట్టిచో ననాగత మతీతకాలము నెట్లు సిద్ధింపఁ జేయును? కావున నివి పరస్పరాపేక్షచే సిద్ధించుటలేదు.

ఇక్కడ పూర్వపక్షి, హ్రస్వ దీర్ఘములకు, మిట్టపల్లములకు, వెలుఁగు నీడలకు నితరేతరాపేక్షచే సిద్ధి గలుగునట్లే యతీతానాగతములకుఁ బరస్పరాపేక్షచే సిద్ధి గలుగు నన వచ్చును. కాని యిందు విశేషహేతువు గానరాదు. కావునఁ

ప్రతిపత్తి వాద మనుపపన్నము. పైఁగాఁ బ్రతిపత్తి దృష్టాంతములకుఁ బ్రతికూలములగు దృష్టాంతములు గానఁబడుచున్నవి. రూప స్పర్శములు, రస గంధములు, ఇత రేత రాపేక్షాసిద్ధులు గావు. ఇట్లే యతీతానాగతములును. కావున నన్యోన్యాపేక్షాసిద్ధి భూత భవిష్యములకుఁ గలుగదు. ఈ విధముగా వర్తమాన మున్నది.

ఈ వర్తమానకాల మర్థసద్భావ వ్యంగ్యము. ద్రవ్యము గలదు, గుణము గలదు, కర్మము గలదనునప్పు డీ వర్తమాన బోధ గలుగుచున్నది.

వర్తమానము గలుగ దేని ప్రత్యక్షనిమిత్తము, ప్రత్యక్ష విషయము, ప్రత్యక్ష జ్ఞానము — ఒక టేమి, సర్వము గలుగదు. ప్రత్యక్షము గలుగనప్పుడు తత్పూర్వము లగు ననుమా నాగమములు గలుగవు. ఇట్లు సర్వ ప్రమాణములు లోపించు నప్పుడు సర్వ ప్రమేయ జ్ఞానము గలుగ నొల్లదు.

అది యట్లుండ వర్తమాన కాలము రెండు విధముల గ్రహింపఁ బడు చున్నది. అది యర్థ సద్భావ వ్యంగ్యము. 'ద్రవ్యము గలదు,' 'గుణము కలదు' ఇత్యాది వాక్యముల యందలి కలాదేశము వర్తమాన ద్యోతకము. మఱొక్కెడ వర్తమానము క్రియా సంతాన వ్యంగ్య మగు చున్నది. ఈ క్రియా సంతానము రెండు తెఱంగులు (1) అనేక విధ క్రియాసంతానము (2) ఏకార్థ క్రియా సంతానము. వీనికి వండుచున్నాఁడు, కట్టెలు వేయుచున్నాఁ డను నవి క్రమముగా నుదాహరణములు. ఈ క్రియలు వర్తమానమును దెలుపుచున్నవి. కావున వర్తమానము సిద్ధించుచున్నది.

అనారబ్ధమై చికీర్షిత మగు క్రియా సంతాన మనాగత కాలము దెలుపును. ఉదాహరణము, వండఁగలఁడు.

ప్రయోజనావసానమైన క్రియా సంతానముయొక్క యుప రమ మతీత కాలము దెలుపును. ఉదాహరణము వండెను. ఆరబ్ధమై యుపరతము గాని క్రియా సంతానము వర్తమాన కాలము దెలుపును. ఉదాహరణము వండు చున్నాడు. సమాప్త క్రియా భావము కృతత. చికీర్షిత మైనది కర్తవ్యత. క్రియా సంతాన వ్యంగ్య మగు త్రైకా ల్యము వర్తమాన కాల గ్రహణమువలననే గ్రహింపఁబడు చున్నది. ఆరంభోపరమములు లేని క్రియా సంతానము వర్తమానము. ఈ వర్తమాన మతీ తానాగతములచే అపవృక్తముగాను, వ్యప వృక్తముగాను గ్రహింపఁబడు చున్నది. మొదటి దానికి లక్ష్యము ద్రవ్యము గలదు. రెండవ దానికి లక్ష్యము వండు చున్నాఁడు. ఇచటఁ గ్రియా సంతాన విచ్ఛేదము లేదు. ఈ క్రియ త్రైకాల్యాన్వితము. వర్తమానము ప్రత్యాసత్తి ప్రభృత్యర్థములు సూచించుటకు లోకమునందుఁ బ్రయోగింపఁబడు చున్నది.

ఇట్లు వర్తమానము, దానితోపాటు భూత భవిష్య త్కాలములు సిద్ధించుచున్నవి. కావున వర్తమానము లేదనుట యుక్తము గాదు.

## అభావ వాద ఖండనము

మాధ్యమకు లభావ వాదులని తలఁచి న్యాయ దర్శనము చతుర్థాధ్యాయ ప్రథమాహ్నికమందలి 37, 39 సూత్రము లచే ననువదించి యయ్యనూది తార్థమును 38, 40 సూత్ర ములతో ఖండించుచున్నది.

అభావ వాదానువాదము :— భావము లితరేతరా భావమువలన సిద్ధించుచున్నవి. కావున నెల్ల భావము నభావమే. ఎట్లన గోవు అశ్వముగాదు. కావున గోవు

అనశ్వము. అట్లే అశ్వము గోవు గాదు. అశ్వము అగవము. ఇట్లు సర్వభావములు, నామములు నసత్ప్రత్యయ ప్రతిషేధములతో సామానాధికరణ్యము (తాదాత్మ్యము) పొందుచున్నవి. కావున నెల్ల భావ మభావము.

ఖండనము :— ప్రతిపక్షి సర్వము నభావమని ప్రతిజ్ఞ సేయుచు దానికి హేతువుగా భావముల యితరేతరాభావ సిద్ధిని ప్రదర్శించు చున్నాఁడు. ప్రతిజ్ఞయందలి సర్వ శబ్దమున కశేషతయే కదా యర్థము. అభావపదము భావ ప్రతిషేధమును దెలుపును. కావున సర్వశబ్దము సోపాఖ్యము (నిర్దిష్ట లక్షణములు గలది). అభావము నిరుపాఖ్యము. సోపాఖ్యమగు సర్వశబ్దము నిరుపాఖ్యమగు నభావ మెట్లగును ? సోపాఖ్యమగు ననేకత నిరుపాఖ్య మగు నభావ మగు నని ప్రతిజ్ఞ సేయ శక్యము గాదు.

ప్రతిపక్షి యీ సందర్భమున నిట్లన వచ్చును:— మీరు కల దని తలంచుచున్న యశేషతను మాత్రమే మా ప్రయోగించు వాక్యమందలి సర్వ శబ్దమున కర్థము. అంతియ కాని యీ యశేషత మా మతమున లేదు. మీరు కల దను సర్వము లేదని మాత్రమే మా వాక్యము చెప్పును.

ఇట్లైనను వ్యాహతి దోలఁగ కున్నది. మొదలే లేని దానియం దశేష మను జ్ఞానము గలుగఁ జాలదు. కావున సర్వ మను ఈ ప్రత్యయ మున్నది. కావున నది యభావము గాఁజాలదు.

అది యట్లుండఁ బ్రతిజ్ఞా హేతువులకు విరోధము పొడము చున్నది. సర్వము లేమిని బ్రతిజ్ఞ దెలుపుచున్నది. ఈ ప్రతిజ్ఞకు హేతువుగా భావముల యితరేతరాభావ సిద్ధి ప్రదర్శితము. హేతువు భావముల యితరేతరాభావ సిద్ధిని

ప్రతిపాదించుచు దాని మూలమున సర్వ మభావ మని చెప్పు చున్నది. కాని సర్వ మభావ మగుచో హేతు వెట్లుండును. హేతువు గూడ లేని దగుచో సర్వ మభావ మను ప్రతిజ్ఞ యెట్లు సిద్ధించును ?

పైఁగా

న స్వభావ సిద్ధే ర్భావానామ్॥ 4–1–38

శూన్య వాద ప్రతిషేధక మగు నీ సూత్రమునకు వాత్స్యాయనుఁడు మూఁడర్థములు దెలుపు చున్నాఁడు.

1. భావములు స్వభావముచే సిద్ధించుచున్నవి. కావున సర్వ మభావము గాదు. అగుచో భావముల స్వధర్మ మేమి ? ద్రవ్య గుణ కర్మములకు సదాది ధర్మము గలదు. ద్రవ్యములకు క్రియావ త్త్వాదికము గలదు. ప్రతి వస్తువున కనంత విశేషము లున్నవి. సామాన్య విశేష సమ వాయములకు విశిష్ట ధర్మములు గనఁబడుచున్నవి. ప్రతిపక్షి చెప్పునట్లు సర్వ మభావ మగుచో నర్థ భేద జ్ఞానము గలుగ రాదు. కాని యర్థ భేద మనుభవ గోచరము. కావున సర్వ మభావము గాఁజాలదు.

2. భావములు స్వరూపముచే సిద్ధించుచున్నవి. గోవను శబ్దము వినఁబడఁగానే జాతి విశిష్టమగు ద్రవ్యము గ్రహింపఁబడును గాని యభావము గ్రహింపఁబడదు. సర్వ మభావ మేని, గోవని పలికినప్పు డభావము భాసింప వల యును. కాని యట్లు భాసించుట లేదు. విశేషించి ధ్వానిచే ద్రవ్య విశేషము దెలియవచ్చు చున్నది. కావున సర్వ మభావము గాదు.

3. ప్రతిపక్షి యశ్వాత్మచే గోవు లేదనుచు, గో వనశ్వ మనుచున్నాఁడు. నిక్కముగా గోవు కలుగ దేని, గవాత్మచే

గోవు లేదని యేల చెప్పఁడు? ఇట్లు చెప్పమిచే గవాక్షముచే గోవున్న దని స్పష్టము.

ఈ సందర్భమున గోవు అనశ్వ మను ప్రతిషేధ మెట్లు కలుగుచున్న దను శంక గలుగవచ్చును. కాని యీ ప్రతిషేధ మభేదము నిరాకరించునే కాని, యభావమును ప్రతిపాదింపదు. దృష్టాంతముగా రేఁగుఁ బండ్లు కుండలో లేవను వాక్యమును గ్రహింప వచ్చును. ఈ వాక్యము పండ్లకుఁ గుండకుఁ గల సంబంధమును మాత్రమే నిరాకరించుచున్నది కాని, కుండ లేదని కాని, పండ్లు లేవని కాని నిరాకరింపదు.

ఇప్పుడు పూర్వపక్షి యిట్లాక్షేపింప వచ్చును.

న స్వభావ సిద్ధి రాపేక్షికత్వాత్॥ (4–1–39)

హ్రస్వాపేక్షచే దీర్ఘము, దీర్ఘాపేక్షచే హ్రస్వము సిద్ధించుచున్నవి. అంతియ కాని యే భావము స్వాత్మావస్థితము గాదు. కావున భావములకు స్వభావ సిద్ధి లేదు.

ఈ పూర్వ పక్షము యుక్తము గాదు.

వ్యాహతత్వా దయుక్తమ్ 4–1–40

హ్రస్వ మపేక్షించి దీర్ఘము గలుగు నేని, యప్పుడు హ్రస్వము నిరపేక్షము గావలయును. ఏల యన హ్రస్వము దేని నపేక్షించును? అట్లు గాక దీర్ఘము నపేక్షించి హ్రస్వ మగు నేని, దీర్ఘము నిరపేక్షము గావలయు. ఏల యన దీర్ఘము దేని నపేక్షించి సిద్ధించును? అట్లు గాక దీర్ఘము నపేక్షించి హ్రస్వము హ్రస్వము నపేక్షించి దీర్ఘము నగు నేని, యొకటి లేనప్పుడు రెండవది కలుగక రెండు నభావము గావలయును. అప్పుడు ప్రతిపక్షి ప్రతిపాదించుచున్న యపేక్షా వ్యవస్థయే యనుపపన్న మగును.

పైఁగా భావములు నిఃస్వభావములై హ్రస్వ దీర్ఘతల వలె నపేక్షా కృతము లగుచోఁ బరిమండలమగు పరమాణు ద్వయమందుఁ గాని, సమ మగు ద్రవ్య ద్వయమందుఁ గాని, హ్రస్వ దీర్ఘ తాదు లేల కలుగవు? అపేక్షయందును, నిర పేక్షయందును రెండు ద్రవ్యము లేక రీతి నుండును గాని, యన్యతర భేదము పొందవు. ఎట్లన కరి గిరు లాపేక్షికము లైనప్పు డొకటి చిన్నది, రెండవది పెద్దది యగును. అంతే కాని యపేక్ష యున్నప్పుడు పరిమాణ ముండి, య య్యపేక్ష గలుగ నప్పుడు పరిమాణము లోపింపదు. అనఁగా నపేక్ష యందు, ననపేక్షయందు నిజ స్వభావ మగు పరిమాణము ప్రచ్యుతి పొందక యట్లే యుండును. ఇఁక నపేక్షా సామర్థ్య మేమన, అతిశయానతిశయ గ్రహణము మాత్రమే. గిరి నపేక్షించి కరి చిన్నది, కరి నపేక్షించి గిరి పెద్దది యగుచున్నది. అంతేకాని యాపేక్షికత భావముల స్వభావ రాహిత్యమును సాధింపదు.

## భావముల అయథార్థతా ఖండనము

భావము లయథార్థ మను మాధ్యమిక వాదార్థమును న్యాయసూత్రము లిట్లనువదించుచున్నవి :—

> స్వప్న విషయాభిమానవ దయం ప్రమాణ ప్రమేయాభిమానః।
> మాయా గంధర్వనగర మృగతృష్ణికావ ద్వా॥ 4—2—31, 32

స్వప్నమందు వాస్తవముగా విషయములు గలుగవు. మాయా గంధర్వనగర మృగతృష్ణికలు యథార్థములు గావు. అయినను వానియం దభిమానము గలుగుచున్నది. అట్లే ప్రమాణ ప్రమేయములు యథార్థములు గావు. అయినను నం దభిమానము గలుగుచున్నది.

ఈ వాదమును నైయాయికులిట్లొదుర్కొనుచున్నారు :—

హేత్వభావా దసిద్ధిః ॥ 33

ప్రమాణ ప్రమేయాభిమానము స్వప్నాంత విషయాభిమాన సదృశమనుటకుఁగాని, జాగరితాంత విషయాభిమాన సదృశము గాదనుటకుఁగాని హేతువు లేదు. కావున ప్రమాణ ప్రమేయములకు స్వప్నాంత విషయ సాదృశ్యము సిద్ధింపదు. వాస్తవముగా స్వప్నాంత విషయములు గలుగవన హేతువు లేదు.

నిద్రనుండి మేలుకొనిన వానికి స్వప్నాంత విషయములు లభింపవు గావున నవి లేవన వచ్చును. ఈ వాదమును బట్టి జాగ్రదవస్థోపలభ్యమానము లగు విషయములను గ్రహించు చున్నాము. కావున నవి యున్నవి కావలయునే కాని, వీని యునికిని బ్రతిషేధింప వీలు లేదు. స్వప్నాంత విషయములు జాగృతియందు గ్రహింపఁబడుట లేదు. కావున నవి లేవని యనుమానించుచో జాగరితాంత విషయము లున్నవగును. గృహ్యమాణతయే దీనికి హేతువు. కావున స్వప్నాంత విషయములు యథార్థములు గావని ప్రదర్శించు యుక్తి ప్రతిపక్షికి విరుద్ధమగు నిర్ణయమునకే యుపపత్తి యగును. ఉపలంభము వలన సత్త సిద్ధించు నప్పుడు అనుపలంభమువలన నభావము సిద్ధించును. అంతే కాని స్వప్నజాగృతుల రెంటియందును విషయములు గలుగనప్పుడు అనుపలంభ మెద్దానికిని సాధకము గాదు. (అనుపలంభమునకు సామర్థ్యము గలుగదు.) దృష్టాంతముగా దీపము లేమిచే రూపము గానఁబడ దను వాక్యమును గ్రహింపవచ్చును. రూపము గానరామికి దీపము లేమి కారణ మని యెట్లు చెప్పుచున్నాము? రూపము గలదు కాని, యది దీప మున్నప్పుడే కానిపించు నని యనుకొని నప్పుడే కదా! కలమొలఁకువల

రెంటియందును విషయము లభావము లగు నేని వాని యనుప లంభము దేనిని సిద్ధింపఁ జేయదు. అపుడున్నచోఁ గనిపించి యుండెడి దను తలంపునకుఁ గూడ నవకాశము గలుగదు.

అది యట్లుండ స్వాప్నాంత వికల్పము లభావము లేని వాని వైవిధ్యమునకుఁ బ్రతిపక్షి హేతువు నుదాహరింప వలయును. ఒక స్వప్నము భయోపసంహితమై, వేఱొకటి ప్రమోదోపసంహితమై మఱొకటి యే తదుభయ విపరీత మగుచు, నింకొక వేళ నెట్టి స్వప్నములు గలుగ కున్నవి. నిమిత్త సద్భావ మంగీకరించువానికే హేతు వైవిధ్యము గలిగి స్వప్న వైవిధ్యము సిద్ధించును. అభావవాదికీ యవకాశము లేదు. స్వప్న వైవిధ్యమేని, తద్రాహిత్య మేని సిద్ధింపదు.

పైఁగా

స్మృతి సంకల్పవ చ్చ స్వప్న విషయాభిమానః ॥— 34

స్మృతి సంకల్పములకుఁ బూర్వోపలబ్ధము విషయ మగు చున్నట్లే, స్వప్నమునకును బూర్వోపలబ్ధము విషయ మగును. వాస్తవమునకు స్మృతి సంకల్ప విషయములు లేవని నిరాకరింప వీలు లేదు. అట్లే స్వాప్నాంత విషయమును జాగరితాంత విష యముచేఁ బ్రత్యాఖ్యానింప వీలు లేదు. నిద్రయందుఁ గల గాంచి మేలుకొనినవాఁడు స్వప్న దర్శనమును, "వీనిని స్వప్నమందుఁ గాంచితి," నని గుర్తించు చున్నాఁడు. జాగ్ర ద్బుద్ధి వశతవలననే స్వాప్నాంత విషయాభిమానము మిథ్య యనెడి వ్యవసాయము కలుగుచున్నది. జాగరితాంత స్వాప్నాంత విషయములు నిజముగా నవిశేషము లేని, సాధనా నర్థక్య మొదవును. (ప్రమాణ ప్రమేయములు స్వప్న విష యాభిమాన సదృశము లని చూపు సాధన మనర్థక మగును). ఏలయనఁ బ్రమాణ ప్రమేయములు స్వప్న సదృశము లని చెప్పుట కాశ్రయమైన దానినే ప్రతిపక్షి ప్రత్యాఖ్యానించు

చున్నాఁడు. అది కాని దానియందు దది యను తలంపు మిథ్యాజ్ఞానము. ఈ మిథ్యాజ్ఞానము ప్రధానాశ్రయము. అపురుష మగు స్థాణువునందు పురుషుఁ డను వ్యవసాయము ప్రధానుఁ డగు పురుషు నాశ్రయించి కలుగుచున్నది. పురుషుని మున్నెన్నఁడు కాననివానికి నపురుషునియందుఁ బురుషుఁ డను తలంపు గలుగదు. అట్లే "నే నేనుఁగును గాంచితిని. పర్వతమును జూచితిని," అను స్వప్నాంత విషయ వ్యవసాయము గూడఁ బ్రధానాశ్రయమే కాని తదితరము గాదు.

మిథ్యోపలబ్ధి వినాశ స్తత్త్వ జ్ఞానాత్ స్వప్న విషయాభిమాన ప్రణాశవత్ ప్రతిబోధే. – 35

అది కాని దానియందు అది యను జ్ఞానము మిథ్యాజ్ఞానము, స్థాణువును బురుషుఁ డని యెఱుఁగుట మిథ్యాజ్ఞానము. స్థాణువును స్థాణువుగాఁ దెలియుట తత్త్వ జ్ఞానము. తత్త్వ జ్ఞానముచే మిథ్యా జ్ఞానము దొలఁగునే కాని యర్థము దొలఁగదు. స్థాణు పురుష సామాన్య లక్షణము నివర్తిల్లు చున్నది. స్థాణువును స్థాణువుగా గ్రహించి నప్పుడు వెనుక పొందిన పురుష జ్ఞానము మిథ్య యని తెలిసికొనుచున్నాము. అంతే కాని పురుషుఁడు లేఁడని కాని, వెనుకటి వ్యవసాయమునకు విషయము లేదని కాని యర్థము గాదు. అట్లే జాగరితాంత జ్ఞాన వృత్తిచే స్వప్నాంత విషయాభిమానము దొలఁగునుగాని స్వప్నాంత విషయము దొలఁగదు. ఇట్లే మాయా గంధర్వనగర మృగతృష్ణికలయందుఁ గలుగు మిథ్యా బుద్ధులు తత్త్వ జ్ఞానముచే నశించును గాని యర్థ ప్రతిషేధము సంభవింపదు. మాయాదుల యందలి మిథ్యాజ్ఞానము సోపాదానమే కాని నిరుపాదానము గాదు. ప్రజ్ఞాపనీయ స్వరూప మగు ద్రవ్యములను గ్రహించి సాధనవంతుఁడు పరునకు మిథ్యాధ్యవసాయము కలిగించుచున్నాఁడు. అదియే

మాయ. నగర స్వరూప సన్నివేశము నీహారాదుల కేర్పడఁగా దానిని దూరమున నుండి చూచుటచే నగరబుద్ధి కలుగును. ఆ నీహారాదులు లేని వేళ నా బుద్ధి కలుగదు. అట్లే మృగ తృష్ణయందును భౌమోష్ణ సంస్పృష్టములై స్పందమానము లగు సూర్య మరీచులందు సామాన్య గ్రహణమునఁ జేసి జల బుద్ధి కలుగును. సమీపస్థునకుఁ దదభావమువలన జలము గానిపింపదు.

కావున నెప్పుడు నెక్కడ నెవ్వనికి ననిమిత్తమగు మిథ్యాజ్ఞానము గలుగదు. మాయా దర్శనమున ప్రయోక్తృ ప్రేక్షకులకు, గంధర్వనగర మృగతృష్ణికలయందు దూరాంతి కస్థులకు, స్వప్నవిషయమున సుప్త ప్రతిబుద్ధులకును బుద్ధి ద్వైతము గలుగుచున్నది. సర్వ మభావము, నిరుపాఖ్యము, నిరాత్మకము నగుచో నీ బుద్ధిద్వైతము సిద్ధింపదు.

బుద్ధే శ్చైవం నిమిత్త సద్భావోపలంభాత్ ॥ 36

అర్థ మట్లే మిథ్యాబుద్ధియుఁ గలదు. ఏలయన దానికి నిమిత్తము, సత్తయుఁ గానఁబడుచున్నవి.

తత్త్వప్రధాన భేదాచ్చ మిథ్యాబుద్ధే ర్ద్వైవిధ్యోపపత్తిః ॥ 37

స్థాణువు తత్త్వము. పురుషుఁడు ప్రధానము. తత్త్వ ప్రధానముల భేదము లోపించుటవలనను, ఆ రెంటికిఁ గల సామాన్య లక్షణము గ్రహించుటవలనను, స్థాణువునందుఁ బురుషుఁ డను మిథ్యాజ్ఞానము గలుగును. ఇట్లే పతాకను బలాక యనియు, లోష్టమును గపోత మనియు, భ్రాంతిపడుట సంభవించుచున్నది. సమానము లగు విషయములందే యొకటి మఱొకటియను భ్రాంతిగలుగును. సామాన్య గ్రహణమే దీనికిఁ గారణము. సర్వము నిరాత్మకము నిరుపాఖ్యమను వాని మతమున మిథ్యాజ్ఞానము గలుగ నవకాశము లేదు.

గంధాది ప్రమేయములందుఁ గలుగు గంధాది బుద్ధులు మిథ్య యని శూన్యవాదు లందురు. ఇచటఁ దత్త్వప్రధాన భేదముగాని, తత్సామాన్యగ్రహణము గాని లేదు. కావున నా గంధాది బుద్ధులు తత్త్వబుద్ధులె యగును. ఇట్లగుటచేఁ బ్రమాణ ప్రమేయ బుద్ధులు మిథ్య యనుట యుక్తముగాదు.

నైయాయిక విమర్శనానంతరము పరిశీలింప వలసినది సాంఖ్య ఖండనము. సాంఖ్య సూత్ర వృత్తి ప్రథమాధ్యాయ మున మాధ్యమకవాద ఖండన మున్నది. ఇది తద్వాద తత్త్వ మెఱుఁగక చేసిన విమర్శనము. కావున దానిని బేర్కొన నక్కఱ లేదు.*

## భాట్ట ఖండనము

కుమారిల భట్టారకుఁడు తన శ్లోక వార్తికమున బౌద్ధ దర్శనములపై దండయాత్ర సాగించెను. కాని యీయన విమర్శనమున సత్యాన్వేషణముకంటె స్వమతాభినివేశము, పర మత ద్వేషము మెండు. తన ఖండనమున కనుకూల ముగాఁ బరవాదినిఁ బలికించి సమాధానము చెప్పుట యి మ్మహానీయునకుఁ బరిపాటి. ఏది యెట్లున్నను కేవల మాధ్య మిక వాదమం దితఁడు తడవిన యాక్షేపము లొండు రెండు గలవు.

"సంవృతి సత్యము, పరమార్థ సత్యము నని మాధ్యమ కులు రెండు సత్యములను బ్రతిపాదించుచున్నారు. సంవృతిలో సత్యత లేదు. అగుచో సంవృతి సత్య భేద మెట్లగును ?

---

*శూన్యం తత్త్వం భావో వినశ్యతి వస్తు ధర్మత్వా ద్వినాశస్య—44
అపవాద మాత్ర మబుద్ధానామ్॥—45
ఉభయ పక్ష సమాన క్షేమత్వా దయ మపి—46
అపురు షార్థత్వ ముభయథా—47

సత్యమే, యగుచో నది సంవృతి యెట్లగును? కాక మృష యేని, యది సత్యత యగుట యెట్లు?

"మృషార్థ పరమార్థములు విరుద్ధములు గావున వాని రెంటికి సత్యత సామాన్య లక్షణము గాఁజాలదు. వృక్ష సింహములకు వృక్షత్వము సామాన్య లక్షణము గా నొల్లదు గదా! కావున సంవృతి మిథ్యా శబ్దములు తుల్యార్థములు. కేవలము సామాన్యులను వంచింప మాధ్యమకులు సంవృతి సత్యమును బ్రతిపాదించుచున్నారు. జుగుప్సా పరిహార ణార్థము లాలా జలమును ముఖాసవ మని పేర్కొను నట్లు బౌద్ధమందలి నాస్తికతను గప్పిపుచ్చుటకై మాధ్యమకులు సంవృతి సత్యమును జేర్కొనుచున్నారు. అభిన్నమై యేక రస మగునది కల్పనవలన భిన్నత్వము పొందు చున్న దని చెప్పుచున్నారు. ఈ కల్పన నిర్వస్తుకము గాఁ జాలదు.

"కావున లేని దెట్లును లేదు. ఉన్నది యేదో యున్నది. అది పరమార్థము. అదే సత్యము. అన్యము మిథ్య. కావున సంవృతి సత్యము, మిథ్యా సత్య మను సత్య ద్వయ కల్పన సిద్ధింపదు."*

---

*సంవృతే ర్నతు సత్యత్వం సత్య భేదః కుతోఽన్వయమ్।
సత్యం చేత్ సంవృతిః కేయం మృషా చేత్ సత్యతా కథమ్॥
సత్యత్వం న చ సామాన్యం మృషార్థ పరమార్థయోః।
విరోధా న్న హి వృక్షత్వం సామాన్యం వృక్ష సింహయోః॥
తుల్యార్థత్వేఽపి తే నైషాం మిథ్యా సంవృతి శబ్దయోః।
వంచనార్థ ఉపన్యాస లాలా వక్త్రాఽసవాదివత్॥
నాస్తిక్య పరిహారార్థం సంవృతిః కల్ప్యతేతి చ।
కల్పనాఽపి త్వభిన్నస్య నైవ నిర్వస్తుకో భవేత్॥
తస్మా ద్యన్నాస్తి నాస్త్యేవ య త్త్వస్తి పరమార్థతః।
త త్సత్య మన్య న్మిథ్యేతి న సత్య ద్వయ కల్పనా॥

శ్లోకవా., నిరాలంబ. 6—10

సత్యద్వయ విషయమునఁ గుమారిలుని విమర్శన మెంత సార్థ

ప్రమాణముల యాథార్థ్య మంగీకరించు వారే వాదాధికారులు. శూన్యవాది ప్రమాణము లంగీకరింపఁడు. కావున నతనికి వాదాధికారము లేదు (128-129 శ్లోకములు).[1]

శూన్యవాదిచే, "నాకు హేతువు లేదు, ప్రతిపక్షీ దూషణమును లేదు. కావున నా సాధన మదుష్టమే యగుచున్నది," యని పలికించి కుమారిలుఁ డిట్లు సమాధానము చెప్పుచున్నాఁడు :— "సాధనాభావ మగునేని యిఁక దూషణము చెప్ప నక్కఱలేదు. నీకు స్వపక్ష సిద్ధి గలుగ దనియే నేను జెప్పునది. దానినే నీ వంగీకరించుచున్నావు." (నిరాలంబన వాదము 176-177)[2]

---

కమో యీ క్రింది మాధ్యమక వాక్యములనుబట్టి బుద్ధిమంతులు తేలికగా నూహించుకొన వచ్చును :—

ఏక మేవ భిక్షవః ! పరమం సత్యం యదు తాప్రమోషధర్మం నిర్వాణం,
సర్వ సంస్కారాశ్చ మృషామోషధర్మాణ ఇతి.మా.కా. వృత్తి 41 పే.
వస్తుతస్తు పరమార్థ ఏవైకం సత్యమ్—బోధిచర్యావతార పంజిక, పే. 362

[1] వినైవ త త్ప్రయోగేణ హేతు రైకాంతికో యతః।
సర్వథా సదుపాయానాం వాద మార్గః ప్రవర్తతే॥
అధికారోఽనుపాయత్వా న్న వాదో శూన్యవాదినః।
శ్లోకవా. నిరాలంబ. 128—129

[2] నను యద్వ న్మయా హేతు ర్నేష్యతే దూషణం తథా।
తేన మే దూషణాభావా దదుష్టం సాధనం భవేత్॥
నేదానీం దూషణైః కార్యం సాధనాఽభావతా యది।
త్వయైవాఽస్మ దభిప్రేతా స్వపక్షాఽసిద్ధి రాశ్రితా॥
శ్లోకవా. నిరాలంబ. 176—177

## శంకరుల దూషణము

బ్రహ్మసూత్ర భాష్యమున శంకరులు మాధ్యమక వాదము నిట్లు ఖండించుచున్నారు :—

"శూన్యవాది పక్ష మెల్ల ప్రమాణములచే నిరాకృతము గావున దన్నిరాకరణము సం దనాదరము సేయుచున్నాము. అన్య తత్త్వము నధిగమింపక సర్వప్రమాణ సిద్ధ మగు నీ లోక వ్యవహారము ప్రతిషేధింప శక్యము గాదు. ఏల యన మిథ్యను ప్రతిషేధించుట తదధిష్ఠాన మగు సత్యము నామోదించుటయే యగును. (అపవాదము లేనప్పుడు ఉత్సర్గము ప్రసిద్ధ మగు చున్నది.)"*

శంకర భాష్యమును వాచస్పతి మిశ్రు లిట్లు వివరించు చున్నారు :—

" శూన్యవాది పక్ష మెల్ల ప్రమాణములచే నిరాకృతము గావునఁ దన్నిరాకరణమున ననాదరము సేయు చున్నాము," అని భాష్యకర్తలు.

" లౌకికములగు ప్రమాణములు సదసత్త్వ గోచరములు. వీనిచే సత్తు సత్తుగా, అసత్తు అసత్తుగా గ్రహింపఁ బడుచు యథా భూతముగా, నవిపరీతముగాఁ, దత్త్వము వ్యవస్థాపింపఁబడుచున్నది. సదసత్తులు విచార క్షమములు గావను వాఁడు సదసద్ద్వయ విచా రాసహత్వమును సర్వ ప్రమాణ విప్రతిషిద్ధముగా వ్యవస్థాపించుచున్నాఁడు. కాని సర్వ ప్రమాణ నిరాకరణమువలన నీ వ్యవస్థ సిద్ధింపదు.

" " ఈ సందర్భమున ఈ విచారముచేఁ బ్రమాణముల తాత్త్విక ప్రామాణ్యము నిరాకృత మగునే కాని సాంవ్యావహారిక ప్రామాణ్యము ద్రోసివేయఁబడుట లేదు," అని

* బ్ర. సూ. భా. 2 పా. 5 అధి 31 సూ.

శూన్యవాది చెప్ప వచ్చును. అట్లయినను విభిన్న విషయ ములు గల వగుటవలన నెల్ల ప్రమాణములకు నిరాకరణము కలుగ దనుచు శంకరులు "అన్య తత్త్వమును బొందక సర్వ ప్రమాణ సిద్ధ మగు నీ లోకమును బ్రతిషేధింప శక్యము గా దని చెప్పుచున్నారు.

"ప్రమాణములు స్వవిషయములందు "ఇది తత్త్వ" మనియే ప్రవర్తిల్లు చున్నవి. ప్రమాణ గోచరార్థము యొక్క యతాత్త్వికత్వమును బాధక మగు నన్య ప్రమాణమువలన నెఱుఁగ వలసి యున్నది. అంతే కాని "మా ప్రామాణ్యము సాంవ్యావహారికమే కాని తాత్త్వికము గాదు," అని ప్రమా ణములు ప్రవర్తిల్లవు. తత్ప్రమాణ గోచర విపరీత తత్త్వో పదర్శనముచే వానికి బాధకమును, వాని యతాత్త్వికత్వమును జూపవలయును. ఎట్లన నిది శుక్తి గాని రజతము గాదు. ఇది మృగతృష్ణ గాని జలము గాదు. ఇతఁ డేక చంద్రుఁడు గాని చంద్ర ద్వయము గాదు. ఇత్యాదికము గ్రహించునది.

"ఇట్లే యిక్కడఁ గూడ సమస్త ప్రమాణ గోచర విపరీత తత్త్వాంతర వ్యవస్థాపనము గావించి యీ ప్రమాణము లకు బాధక మగు నా తత్త్వాంతరముచే నతాత్త్వికత్వమును జూప వలయునే కాని తత్త్వాంతరము వ్యవస్థాపింపక ప్రమా ణములను బాధింప శక్యము గాదు.

" వస్తువుల విచారాసహత్వమే బాధకమగు తత్త్వ మును వ్యవస్థాపించుచుఁ బ్రమాణముల యతాత్త్విక త్వమును జూపుచున్నదని యందురా ? అగుచో విచారాసహ రూప మగు నా వస్తు వేమి ? పరమార్థమున నా వస్తువు సదాదులలో నొకటి యయి విచార క్షమము గాకున్నదా ? లేక విచార సహాత్వముచే నది నిస్తత్త్వమే యగునా ? సదాదులలో నొకటి యయి విచారక్షమము గాదనుట విప్రతిషిద్ధము.

విచార క్షమము గానిచో నది సదాదులలో నొకటి కాదు. సదాదులలో నొకటి యగుచో నది విచార క్షమము గాక పోవు టెట్లు ?

"ఇంక నావస్తువు నిస్తత్త్వ మగునేని, యన్యతమ మగు తత్త్వమును వ్యవస్థాపింపక నిస్తత్త్వమని చెప్ప నెట్లు శక్య మగును ? "భావముల తత్త్వము నిస్తత్త్వమును గాదు. ఏల యన నప్పుడు తత్త్వాభావమే యగును. అదియు విచారాసహామే," యని మీరు చెప్పియున్నారు.

"పైఁగా నారోపితము నిషేధనీయము. ఆ యారో పము గూడ శుక్తికాదులందు రజతాదుల యారోప మట్లు తత్త్వాధిష్ఠానముగాఁ గానవచ్చు చున్నది. తత్త్వము గొంచె మేని కలుగనిచో నెద్దాని కెందారోప మగును ? కావున నిష్ప్రపంచము, పరమార్థ సత్తు నగు బ్రహ్మము అనిర్వాచ్య ప్రపంచాత్మచే నారోపింపఁబడుచున్నది. ఆ తత్త్వమును గూడ వ్యవస్థాపించి యా బాధకముచేఁ బ్రమాణములకు సాంవ్యావహారికత్వము, అతాత్త్వికత్వము ఉపపన్న మగు చున్న దనుట యుక్తము."

ఈ సందర్భమున మాధ్యమకుల వాదమందలి యీ ప్రధానాంశములను గుర్తించినఁ గాని వాచస్పతుల విమర్శ నార్థము గ్రహింప వీలులేదు.

ప్రమాణ ప్రమేయములు వ్యావహారికములు. వ్యావ హారికముగా శూన్యవాదులు ప్రత్యక్షానుమానాగ మోప మానము లంగీకరించు చున్నారు.

పరోక్ష విషయంతు జ్ఞానం సాధ్యావ్యభిచారి లింగోత్పన్న మను మానమ్ । తస్మా ల్లోకే యది లక్ష్యం యది వా స్వలక్షణం సామాన్య లక్షణం వా సర్వ మేవ సాక్షా దుపలభ్యమానత్వా దపరోక్షః । అతః ప్రత్యక్ష్యం వ్యవస్థాప్యతే తద్విషయేణ జ్ఞానేన సహ సాక్షా దతీంద్రి

యార్థ విదా మాప్తానాం య ద్వచనం స ఆగమః. సాదృశ్యా దననుభూ తార్థాధిగమ ఉపమానం గౌ రివ గవయ ఇతి యథా. త దేవం ప్రమాణ చతుష్టయా ల్లోక స్యా ర్థాధిగమో వ్యవస్థాప్యతే.(ప్రసన్నపద, 75-వ పే.)

పారమార్థికముగా మాత్రమే యవి నిరాకృతములు. వైదిక దార్శనికులలో దాదా పందఱు శూన్యవాదము వ్యావహారిక సత్త నంగీకరింప లేదను భ్రాంతికి లోఁబడి విమర్శించిరి. వాచస్పతి మిశ్రులు మాత్ర మిందుల కపవాదము.

శూన్యవాదులు ప్రమాణముల వ్యావహారిక సత్తను, అపారమార్థికత్వమును ప్రతీత్య సముత్పాద వాదముచే నుపపాదించుచున్నారు. ఒకటి యథార్థ మగునో కాదో నిరూపింప విరోధ ప్రదర్శనము చాలును. ఆ సత్య మెద్ది యన్నప్పుడు మాత్రము బాధక ప్రదర్శన మావశ్యకము.

ఉదాహరణమునకు ఒక జొన్నచేనిలో కఱ్ఱకు పిట్టలు రెండేసి వ్రాలినను, అయిదేసి వ్రాలినను, ఆఱేసి వ్రాలినను ఒక పిట్ట మిగులును. మఱి పిట్ట లెన్ని యను ప్రశ్నమును గ్రహింప వచ్చును. దీనికి సమాధానముగా నొకఁడు పది పిట్టలనియు, నింకొకఁడు పదునై దనియు, వేఱొకఁ డఱువది యనియుఁ జెప్పవచ్చును. ఈ సంఖ్యలు సరికా వన యథార్థ సంఖ్య నెఱుఁగ నక్కఱ లేదు. ప్రత్యుత్తరములు ప్రశ్నార్థముతోఁ బొందు విరోధమును జూపినఁ జాలును.

అట్లే ప్రమాణములు పారమార్థికములు గావనుటకు వానియందలి విరోధము చూపినఁ జాలును. మాధ్యమకు లిట్లే విరోధమును బ్రదర్శించి ప్రమాణముల పారమార్థికత్వమును బ్రతిషేధించు చున్నారు.

“సత్యము నెఱుఁగక యసత్య మని యొకదానిని ద్రోసివేయ వీలు లేదు. శూన్యవాదులు పరమార్థ మంగీక

రింపకయే లోకము మిథ్య యని త్రోసివేయుచున్నా" రని శంకరాదుల యాక్షేపము.

ఈ యాక్షేపము నిరాధార మనక తప్పదు. ఏల యన శూన్యవాదులు పరమార్థ మంగీకరింతురు. అంగీకరింప కున్నచో వారి వాదము యథార్థమైనను నిరర్థకమై యుండె డిది. ఏల యన నప్పు డితరవాద దోషములనుమాత్ర ముద్ఘా టించి పరమార్థమును జెప్పకపోవుట సంభవించెడిది. కాని వారు పరమార్థము నంగీకరించుచున్నారు. అది యనభిలా ప్యము, భావాభా వోభ యానుభయ చతుష్కోటి వినిర్ముక్త మని చెప్పుచున్నారు. వ్యవహార ప్రపంచమునుండి చెప్పవలసి వచ్చినప్పు డది యనిరోధా ద్యష్ట విశేషణములచే వ్యాహ రింపనగు ననుచున్నారు. అసన్మాత్ర మగునది మిథ్య యగు నట్లే సన్మాత్రముగూడ మిథ్యయే యని వారి వాదము. ఏల యన సత్తాసత్తలు సాపేక్షము లని మాధ్యమకుల వాదము.

ఇట్లు అనభిలాప్య మని సూచిత మగుచున్న పదా ర్థము సదాదులలో నొకటి యగునా, లేక నిస్తత్వ మగునా యని వాచస్పతి మిశ్రు లడుగుచున్న ప్రశ్న మెంతవఱకు సార్థకమో మనీషులే యాలోచింపవలయును.

ఇట్లు మాధ్యమక వాదమును ఖండించుచున్నార మనుకొనుచున్నవారు వాస్తవమునకు భ్రాంతిపడుచున్నా రేమో యని భావింపవలసి వచ్చుచున్నది. ఏల యన ప్రతీత్య సముత్పాద వాదమును ద్రోసివేయక మాధ్యమక వాదము ఖండింప సాధ్యముగాదు!

1. మాధ్యమ కాద్వైతముల సారూప్య వైరూప్యములను బ్రదర్శించిన నుభయ వాదముల పరస్పర దూషణములను గుణావగుణములును గ్రహించుట తేలిక. కావున నవి యిటఁ బ్రదర్శితము లగు చున్నవి.

| మాధ్యమకము | అద్వైతము |
| --- | --- |
| I. సత్య ద్వయ కల్పన :—<br>1. సంవృతి సత్యము,<br>2. పరమార్థ సత్యము. | I. రెండు సత్యములు సమ్మతములు.<br>1. వ్యావహారిక సత్యము,<br>2. పారమార్థిక సత్యము. |
| II. లోక మనిర్వచనీయము, దాని తత్త్వము చతుష్కోటి వినిర్ముక్తము. లోకము ప్రతీత్య సముత్పన్నము. | II. లోక మనిర్వచనీయము - మిథ్య, మాయా పరికల్పితము. |
| III. ప్రమాణములు వ్యావహారికములు.<br>1. వ్యావహారికముగాఁ బ్రమాణములకుఁ బరతః ప్రామాణ్య ధర్మమంగీకరింపఁబడుచున్నది.<br>2. ప్రత్యక్షానుమానాగ మోపమానములు ప్రమాణములు. | III. ప్రమాణములు వ్యావహారికములు.<br>1. వీనికి స్వతః ప్రామాణ్యమంగీకరింపఁబడు చున్నది.<br>2. ప్రత్యక్షానుమానాగ మోపమానార్థాప త్త్యభావములు ప్రమాణములు. |
| IV. జీవేశ్వరులు అపేక్షా పరికల్పితులు. పారమార్థికముగా వీరు మిథ్య. | IV. జీవేశ్వరులు మాయా పరికల్పితులు; పారమార్థికముగా మిథ్య. |
| V. ప్రతీత్య సముత్పన్న మగు నది యెల్ల విపర్యాసము.<br>1. రజ్జు సర్ప భ్రాంతియందురజ్జు సర్పములు రెండును మిథ్యయే. | V. అధ్యారోపిత మగు నది యెల్ల మిథ్య.<br>1. రజ్జు సర్ప భ్రాంతి యందలి ఇదంత యథార్థము, సర్పము భ్రాంతి. |

## మాధ్యమకము

2. సంవృతి సత్య మున ద్విభాగము నాగార్జునులకు సమ్మతమైనట్లు దోఁపదు. అతని యనుయాయులు మాత్రము తథ్య సంవృతి, మిథ్యా సంవృతి యని సంవృతిని దిరిగి రెండుగా విభజించు చున్నారు. ఈ విభాగము శాస్త్ర సమ్మతముగాఁదోఁపదు. ఏల యన హేతు ప్రత్యయ భేదానంత్యము గానఁబడు చున్నది. కావున సంవృతియం దనంత భేదముల నంగీకరింప వలయును. కాని చంద్రకీర్త్యాదులు తథ్య మిథ్యా భేద ద్వయమును గ్రహించుటకు వ్యవహార బలీయస్త్వము గారణము కావచ్చును.

## అద్వైతము

2. వ్యవహార సత్యమం దద్వైతులు రెండు భేదము లంగీకరింతురు.

1. ప్రాతిభాసికము 2. సాక్షిభాస్యము.

## మాధ్యమకము

VI. మాధ్యమకులు ప్రతీత్య సముత్పాద వాదులు.

1. పారమార్థికముగా జగత్తు అజాతము.

2. వ్యావహారికముగాఁ గానవచ్చు దీని స్వభావ మనిర్వచనీయము. కావున దీని యుత్పాద స్థితి భంగముల యుపన్యాస మున కర్థము లేదు.

3. మాధ్యమకులు నాస్తికతను నిరాకరింతురు.

## అద్వైతము

VI. అద్వైతులు మాయావాదులు లేదా వివర్త వాదులు.

1. పారమార్థికముగా జగత్తు లేదు.

2. అద్వైతులు జగదుత్పత్తి స్థితి లయములయందు శ్రుతి స్మృతుల మత మనువదించి యది వ్యావహారిక మందురు.

3. అద్వైతులు నాస్తికతను ఖండింతురు.

## మాధ్యమకము

4. వ్యవహారమున వర్ణ వ్యవస్థను గాని శ్రుతి స్మృతులనుగాని యాదరింపక షట్పారమిత లకుఁ బ్రాముఖ్యము గల్పింతురు.

5. ప్రతీత్య సముత్పాద వాదులగుటచే విజ్ఞాన శాస్త్రార్థములను వ్యావహారిక సత్యములుగా స్వీకరించుటకు మాధ్యమికుల కాక్షేపము గలుగ నొల్లదు.

VII. ప్రసంగాపాద ముఖమున మాధ్యమికులు పరమార్థము నూచింతురు.

1. మాధ్యమికు లద్వయవాదులు.
2. పరమార్థ మనభిలాప్యము గాని వ్యవహారమునందుండి చెప్పవలసిన నది యనుత్పాదము, అనిరోధము, అనుచ్ఛేదము, అశాశ్వతము, అనానార్థము, అనేకార్థము, అనాగమము, అనిర్గమము.

VIII. భావాభావ పరామర్శ క్షయము నిర్వాణము.

1. నిర్వాణము ద్వివిధము:— సోపధి నిర్వాణము, నిరుపధి నిర్వాణము.
2. దృష్టి రాహిత్యమే నిర్వాణము.

## అద్వైతము

4. వ్యవహారము కేవలము శ్రుతి స్మృతుల ననుసరించియే జరుగవలయుననుట యద్వైతుల కభిమతము.

5. స్వతః ప్రామాణ్య వాదులు శ్రుత్యైక ప్రమాణులు నగుటచే శ్రుతి స్మృతుల కవిరోధము లగు విజ్ఞాన శాస్త్రార్థములు మాత్రమే యభ్యనుజ్ఞాతవ్యములు.

VII. శబ్ద ప్రమాణముచే నద్వైతులు పరమార్థము వ్యవస్థాపింతురు.

1. శాంకరు లద్వైతులు.
2. బ్రహ్మ మనిర్వచనీయమే కాని వ్యవహారమునందుండి చెప్పవలసి వచ్చినచో నది యేకము, అద్వితీయము, సచ్చిదానందమయ మని యద్వైతులు పేర్కొందురు.

VIII. బ్రహ్మాత్వ సిద్ధియే మోక్షము.

1. ముక్తి రెండు విధములు:— 1. జీవన్ముక్తి, 2. వైదేహముక్తి.
2. జ్ఞాన సిద్ధియే మోక్షము.

| మాధ్యమకము | అద్వైతము |
|---|---|
| 3. ఆత్మ వ్యామోహ విరహిత మగు షట్పారమి తాచర ణము నిర్వాణ మార్గము. | 3. నిష్కామము, శ్రుతి స్మృతి విహితము నగు కర్మాచర ణము మోక్ష మార్గము. |
| 4. మాధ్యమకము జ్ఞాన స్వరూప వివేచనా ప్రధానము (epistemological). | 4. అద్వైతము పరమార్థ సత్తా నిరూపణ ప్రధానము (ontological.) |

సమాసముగా నివియే మాధ్యమ కాద్వైతములకు సారూప్య వైరూప్యములు. కొందఱు, మాధ్యమకమునకంటె నద్వైతము విశిష్టమందురు. కాని యిది విచార్యము.

విజ్ఞాన వాదాది బౌద్ధ దర్శనములును మాధ్యమక వాదము నెదుర్కొన్నవి. కాని గ్రంథ విస్తర భీతిచే నవి యిచ్చట ననుపన్యస్తములు.

ఆంధ్ర భాషలో శూన్య వాదఖండనము సోమనాథుని పండితారాధ్య చరిత్రమందలి వాద ప్రకరణమునఁ గాన వచ్చుచున్నది. ఈ ఖండనము సవిశేషము గాకున్నను బదుమూఁడవ శతాబ్దమున బౌద్ధ దర్శ నార్థము లెంతగా మూలఁబడెనో సూచించును. కావున నది యిట నుదాహ రింపఁబడుచున్నది :—

కించి ద్గుణములు మిక్కిలి మీ వ్రతములు
నవియు మాటలన, సత్యము నహింసయును
నివి నిజ వ్రతము లం, డివియును లేవు ;
సంపి పెట్టినఁ దింద్రు, సంపఁ గా దంద్రు,
సంప సహించుట సంపుట గాదె ?
బొం కీశ్వరుం డంద్రు, బొంకఁ గా దంద్రు
బొంకులలోఁ బెద్ద బొం కిది గాదె ?

యన్ని యీశ్వరుఁడు లే, డింద్రు, డా నేల
యెన్నంగ బుద్ధుండు నిలఁ గల్గఁ డెట్లు
క్షణ భంగు రం (బగుఁ గర్మంబు) దానఁ
బ్రణుతింపఁ దత్కర్మ ఫలము వొందించు
ననుటయు బౌద్ధుల కనుమతం బగుటఁ
దనరి యా బుద్ధుండు దైవ మం టెద్ది ?
సంగతి దైవంబు శశవిషాణంబు
భంగి శూన్యం బంచు బౌద్ధాదు లాది
విరచింపఁగాఁ జతుర్వింశతి తీర్థ
కరులు భూతాది త్రికాల వర్తనులు
నెన్న డెబ్బదిమీఁద నేడ్వురు మునులు
మున్ను శూన్యధ్యానములు సేయుచునికి
శమ దమానుష్ఠాన జపతపోధ్యాన
యమ నియమాది కాష్టాంగ యోగాది
ధర్మ కర్మఫల ప్రదాత యెవ్వండు
నిర్మితి (నిర్మించు) క్రియలకు నిర్వాహ మెద్ది ?
తివిరి యుత్పత్తి స్థితి విలయ హేతు
వవునె దైవము శూన్యమయ్యే నేనియును
దెలియ నుత్పత్తి స్థితివిలయ హేతు
విలఁ గానియది దైవ మెట్లును గాదు
(విలఁ గల్గునే దైవ మెట్లును గాదు ?)
తలపోయ శూన్య తత్త్వము గలయదియొ ?
తలపోయ శూన్యతత్త్వము లేనియదియొ ?
కలదేని శూన్యంబు, కా దశూన్యంబు
గలుగదేని, శూన్యంబు గలుగ దెట్లనిన
కలదేని శూన్యమ న్పలుకు దా బొంకు,
కలుగదేని శూన్యమ న్పలుకు దా బొంకు,
గాన యహింసా విహీనులు సత్య

హీనుల్ క్రియాఫలహీనులు, గర్మ
హీనులు నగు బౌద్ధ జైనాదులకను
గలుగునే మోక్ష వికస్వర సుఖము ?

ఇట్లు శూన్యవాదముపై శతాబ్దములు కుంభ ద్రోణముగాఁ గ్రుమ్మరించి విమర్శనములను వెల్లివిరియించినవి. ఈ మహోపప్లవము నెంత వఱకు నాగార్జునుల విగ్రహవ్యావర్తని నివర్తింపఁ జేయుచున్నదో పాఠకులే నిర్ణయించుకొందురు గాక !

# శూన్యతా వాదమునఁ బ్రామాణ్య సిద్ధి

## పూర్వపక్షము

సర్వ భావ సమితి సర్వత్ర నిఃస్వభా
వమ్మ యయిన, నిఃస్వభావ మగుచు
వఱలు మీ వచస్సు స్వాభావ్య వినివర్త
న క్రియా సమర్థనమ్ము గాదు. ౧

ప్రతిపక్షము :— భావములు హేతువునఁ గాని ప్రత్యయము లందుఁ గాని, హేతు ప్రత్యయ సామగ్రియందుఁ గాని, యహేతువునఁ గాని లేనివగుటచే నిఃస్వభావములు. దృష్టాంత మంకురము. ఈ యంకు రము హేతుభూత మగు బీజమందు లేదు; పృథ్వి వ్యప్తేజో వాయ్వాది ప్రత్యయములలో నే యొకదానియందును లేదు; వాని సామగ్రియందును లేదు; సమగ్ర హేతు ప్రత్యయములందుఁ గాని, హేతు ప్రత్యయ సామగ్రియందుఁగాని లేదు; హేతు ప్రత్యయ వినిర్ముక్తమై వేఱుగను లేదు. ఈ పేర్కొనిన వానిలో దేనియందును లేనిది గావున నంకురము నిఃస్వభావ మన వచ్చును. నిఃస్వభావ మగుటచే నంకురము శూన్యము. అట్లే సర్వభావములు నిఃస్వభావము లగుటచే శూన్యములు.

ఉత్తరపక్షము :— ఇట్లే యగునేని, "సర్వ భావములు శూన్య ములు," అను మీ వాక్యమును శూన్యమే. ఏల యన నది హేతువునందు లేదు; ప్రత్యయము లగు సంప్రయుక్త మహాభూతములందుఁ గాని, విప్రయుక్త మహాభూతములందుఁ గాని లేదు; ఉరః కంఠోష్ఠ జిహ్వా దంతమూల తాలు నాసికా మూర్ధాదులందుఁ గాని, యీ యుభయ సామగ్రి యందుఁ గాని లేదు; హేతు ప్రత్యయ సాకల్య వినిర్ముక్తమై వేఱుగ నైనను లేదు. ఎచటను లేనిది గావున నది నిఃస్వభావము. నిఃస్వభావ మగుటవలన నది శూన్యము. కావున సర్వ భావ స్వభావ ప్రతిషేధ మశక్యము. లేని యగ్నిచే దహించుటకును, లేని శస్త్రముచే ఛేదించుట

నను, లేని జలముచేఁ దడుపుటకును శక్యము గాదు గదా! అట్లే లేని వచనముచే సర్వ భావ స్వభావమును బ్రతిషేధింప శక్యము గాదు.

"కావున సర్వ భావ స్వభావము ప్రతిషిద్ధము, సర్వ భావ స్వభావము నివర్తిల్లుచున్నది," అని మీ చెప్పిన వాదము యుక్తము గాదు.

## ల ఘు టీ క

విగ్రహవ్యావర్తని యనఁగా వివాదములను నిరాకరించునదని యర్థము. నాగార్జునుల కాలమున శూన్యవాదమును నైయాయిక వైశేషికులు, సాంఖ్యులు, సర్వాస్తివాదులు, నిర్గ్రంథులు, మున్నగు నన్య మతముల వారు తీవ్రముగా విమర్శింపఁ జొచ్చిరి. వారి యాక్షేపములను విధ్వంసములఁ గావించి మాధ్యమిక దర్శనమును నిలుపుకొన వలసిన గురు తర బాధ్యత "మౌన కలశుఁ"డగు ఆర్య నాగార్జునుల పైఁబడెను. అయ్యాచార్యులు ప్రతిపక్షుల దోషముల నెల్ల సంగ్రహముగాఁ దెలిపి వానిని ఖండించి తమ వాదము నీ విగ్రహవ్యావర్తనియందు సిద్ధాంతీకరించుచున్నారు.

పూర్వపక్షమును అనువదించి, దానిని ఖండించి, సిద్ధాంతము సేయుట భారత సంప్రదాయము. ఈ సంప్రదాయమును పాటించి నాగార్జునాచార్యపాదులు ప్రతిపక్షముచే స్వీయ వాదము ననువదింపఁ జేయుచున్నారు.

ఉత్పాద స్థితి భంగములు గలదానిని బౌద్ధులు భావ మందురు. దీనినిబట్టి మనస్సుతోఁ గూడి యాఱగు నింద్రియములకు గోచరించు విషయము లన్నియు భావములే యగును. ఈ భావములు హేతు ప్రత్యయములను బొంది కలుగుచున్నవే కాని వాస్తవముగా (పారమార్థికముగా) లేవు. భావము హేతువునందుఁ గాని, ప్రత్యయములలో నొకదానియందుఁ గాని, యన్నిటను గాని, హేతు ప్రత్యయములను విడిచి కాని, అకారణముగాఁ గాని కలుగుట లేదు. ఉదాహరణముగా మొలకను తీసికొన వచ్చును. ఈ మొలక తనకు హేతువైన విత్తనమందు లేదు. ఉన్నచో

దానిని మొలక యందుము గాని, విత్తన మని యనము. విత్తనములో లేని మొలక క్రొత్తగా వచ్చిన దన్నచో దేనినుండి యేదైనను రావచ్చును. అనఁగా ఇసుకనుండి తైలము, గండ శిలనుండి పువ్వులు పుట్టవలసి వచ్చును. కావున విత్తనములో మొలక లేదు. అట్లే భూమియందు, జలమునందు, వేఁడిమియందు, గాలియందు మొలక లేదు. విత్తనము మున్నగాఁ గల వానియందుఁ గాని, వానిని విడిచి వేఱుగాఁగాని, యకారణముగాఁ గాని కలుగుటలేదు. మొలక యీ పేర్కొనిన వానిలో వేనియందును లేదు. కావున మొలక స్వకీయ మగు స్వభావము గలది కాదు. కావున నది నిఃస్వభావము. నిఃస్వభావ మగుటచే నది శూన్యము. మొలక వలెనే సర్వ భావములు శూన్యములు. ఇది మధ్యమకుని వాదము.

ఇపుడు ప్రతిపక్షి మధ్యమకుని వాదమును దూషించుచున్నాఁడు. "సర్వ భావములు శూన్యములు," అని మధ్యమకుఁడు చెప్పుచున్నాఁడు. మధ్యమకుని వాక్యము గూడ నొక భావమే. ఈ భావము వర్ణోత్పత్తి స్థానములందుఁ గాని, ప్రయత్నమందుఁ గాని లేదు. కావున నతని మతము ననుసరించి యది శూన్యము. శూన్య మగు వాక్యముచే సర్వ భావముల స్వభావము నిరాకరింప నెట్లు సాధ్యపడును. లేని యగ్నిచే దహింప లేము. లేని గొడ్డలిచే చెట్టును నఱుక లేము. లేని నీటిచేఁ జేతులు కడుగు కొన లేము. కావున సర్వ భావముల స్వభావములు శూన్యము అని నిరాకరింప వీలు లేదు.

## అన్యథా ప్రతిజ్ఞా భంగము

వైఁగ మీ వాక్కు సస్వభావ మ్మటంచు
నాలకించి మీదు ప్రతిజ్ఞ హాతిని బొందె;
వైషమిక దోష మద్దానఁ బ్రాప్త మయ్యె;
కాన హే త్వంతరమ్ము వక్తవ్య మగును. ౨

ఇంతకు మున్ను పేర్కొన్న దోషము గలుగకుండవలె నని, "యీ వాక్యము సస్వభావము. సస్వభావ మగుటచే నశూన్యము. దీనిచే సర్వ

భావ స్వభావము ప్రతిషిద్ధము. సర్వ భావ స్వభావము నివర్తిల్లుచున్నది,” అని మీరు తలంచుచున్నారు.

అట్లగునేని చెప్పుచున్నాము. ‘సర్వ భావములు శూన్యములు,’ అన్న మీ ప్రతిజ్ఞ భగ్న మగుచున్నది.

మీ వాక్యము సర్వ భావాంతర్గతము. ఏల యన సర్వభావ స్వభావ ప్రతిషేధము సాధించు మీ వాక్యము సర్వ భావములందు నశూన్య మగుచున్నది.

ఇట్లు షట్కోటిక మగు వాదము ప్రసక్త మగుచున్నది. ఎట్లన :

(1) సర్వ భావములు శూన్యము లగునేని సర్వ భావాంతర్గ మైన దగుటవలన మీ వచనము గూడ శూన్యము. శూన్య మగు మీ వచనముచే ప్రతిషేధోపపత్తి కలుగదు. ఇట్లు “సర్వ భావములు శూన్యములు,” అను ప్రతిషేధము అనుపపన్న మగుచున్నది.

(2) “సర్వ భావములు శూన్యములు,” అను ప్రతిషేధము మీ వచన శూన్యత్వమువలన నుపపన్న మైనచో, ప్రతిషేధము అనుపపన్న మగును.

(3) మఱియు సర్వభావములు శూన్యములు; మీ వచనమును శూన్యమే. కాని ప్రతిషేధ ప్రతిపాదక మగు మీ వచనము మాత్రము సర్వత్ర యసంగృహీతము. ఇట్లగుటచే దృష్టాంత విరోధము పొడముచున్నది.

(4) మీ వచనము సర్వత్ర గృహీత మగుచు సర్వ భావములు శూన్యము లగునేని దానిచే మీ వాక్యమును శూన్య మగును. మీ వాక్యము శూన్య మగుటచేఁ బ్రతిషేధము గలుగదు.

(5) మఱియు శూన్య మున్నది. దీనిచే ‘సర్వ భావములు శూన్య ములు,’ అను ప్రతిషేధము గలుగుచున్నది యనుచో సర్వ భావములు శూన్యము లయ్యు కార్య క్రియా సమర్థము లగును. ఇది యిష్టము గాదు.

(6) మఱియు “సర్వ భావములు శూన్యములు, కార్య క్రియా సమర్థములు గావు. దృష్టాంతవిరోధము గలుగకుండవలె,” ననుచో మీ వాక్యముచే సర్వ భావ స్వభావ ప్రతిషేధము సిద్ధింపదు.

మఱొకటి యున్నది. మీ వాక్య మున్న దగుటవలనఁ గొంత శూన్య మనియు, మఱి కొంత యశూన్య మనియు నేర్పడి వైషమిక ప్రసంగము గలుగుచున్నది. కొంత శూన్య మనియు, మఱి కొంత యశూన్య మనియుఁ జెప్పుటచే వైషమికత్వము కలుగుచున్నది గావున విశేష హేతువు చెప్పవలసి యున్నది. కాని యట్టి హేతువు చెప్పఁబడలేదు.

కావున 'సర్వభావములు శూన్యములు' అన్న వాదము యుక్తము గాదు.

## లఘుటీక

తన సిద్ధాంతము గాచుకొనుటకు మధ్యమకుఁ డిట్లు వాదింప వచ్చును. మా సిద్ధాంత వాక్యము సస్వభావమే. కావున నది యశూన్యము. అశూన్య మగు మా వాక్యము సర్వ భావములకు స్వభావము లేదని నిరాకరించుచున్నది.

ఇట్లు చెప్పుచో 'సర్వ భావములు నిఃస్వభావములు', అను మధ్యమకుని ప్రతిజ్ఞ (రుజువు చేయఁబూనిన సిద్ధాంతము) భగ్న మగుచున్నది. ఏల యన సర్వభావములలోఁ బ్రకృత భావము ఒకటి. ప్రకృత భావము శూన్యము గానిచో 'సర్వభావములు శూన్యములు', అన్న వాక్య మెట్లు నిలుచును ?

సర్వభావములు శూన్యము లగుచోఁ బ్రకృత వాక్యము శూన్యము గావలయును; శూన్యమగు నేని సర్వభావ స్వభావ నిరాకరణము సిద్ధింపదు.

'ఎల్లభావములు శూన్యము' లను వాక్యముచే సర్వభావ స్వభావ రాహిత్యము సిద్ధించుచో, సర్వభావములు శూన్యము లగుటవలన, 'సర్వ భావములు శూన్యములు' అని చేయు నిరాకరణము సిద్ధింపదు.

నిరాకరణము సిద్ధించునన్నచో మధ్యమక వాక్య మశూన్యమై తక్కిన భావములు శూన్యములు గావలయును. దానివలన 'సర్వభావ ములు శూన్యములు' అన్న వాక్యమున దృష్టాంత విరోధము కలుగుచున్నది.

సర్వభావములు శూన్యములై 'సర్వభావములు శూన్యములు' అను వాక్యము గూడ సర్వభావములందు నంతర్గతమగుచో, ఆ నిరాకరణము గూడ శూన్య మగును.

వాక్య శూన్యత యనునది యున్నది. ఆ శూన్యతవలన సర్వభావ స్వభావ నిరాసము గలుగునన్నచో శూన్యభావము అర్థక్రియా సమర్థము గావలయును. అనఁగా నాకాశ ప్రసూనము సుగంధము విరఁజిమ్మవలసి వచ్చును. దీని నెవ్వఁడు నంగీకరింపఁడు. శూన్యమగు భావము అర్థక్రియా సమర్థము గాదన్నచో, 'సర్వభావములకు స్వభావము లేదు' అను నిషేధము సిద్ధింపదు.

ఈ విషయముల నావలనుంచినను ప్రతిజ్ఞా వాక్యములో దోష మున్నది. మీ వాక్యము అశూన్య మనియుఁ, దక్కుంగల భావము లెల్ల శూన్యము లనియు గ్రహింపవలసి వచ్చుచున్నది. అనఁగా కొన్ని ధర్మను లశూన్యములై, మఱికొన్ని శూన్యము లగుచున్నవి. కావున సర్వధర్మములు శూన్యము లని చెప్పుటకు మఱొక హేతువును జెప్పవలయును. (ఇది అసాధ్య మనియు, కావున 'సర్వభావములు శూన్యములు' అను వాదము సిద్ధింప దనియుఁ బ్రతిపక్షి తాత్పర్యము).

మఱియు

"మాట లాడకు మన్నట్టి మాడ్కి నిదియు
నగు" నటన్నది మీ బుద్ధి యగున యేని,
యది యయుక్తమ్ము; సత్తైన పదముచేతఁ
బాడమ నున్నట్టి శబ్దమ్ము కెడయఁగలదు. 3

మీ రిట్లు తలంప వచ్చును. ఒకానొకఁడు, "శబ్దము చేయకుము, శబ్దము సేయకుము," అన్నచో, ఆ శబ్దముచే భవిష్య శబ్దము నివర్తింపఁబడును. ఇట్లే సర్వ భావములు శూన్యములు అన్న వాక్యమును. శూన్య వచనముచే సర్వభావ స్వభావ నివర్తనము గావింపఁబడుచున్నది.

ఇక్కడ మేము చెప్పుచున్నాము. ఇదియు ననుపపన్నమే. కారణ మేమన ఉన్న శబ్దముచేతనే భవిష్యమగు శబ్దము ప్రతిషేధింపఁబడును. మీరు మాత్రము ఉన్న శబ్దముచే సర్వ భావ స్వభావమును ప్రతిషేధించుట లేదు. మీ మతమున మీ వచనము గూడ లేనిదే కదా! సర్వ భావ స్వభా

వము గూడ లేనిదే కావున మాటలాడకుమన్నట్టిది అన్న యీ యుప
న్యాసము దోషోపహత మగుచున్నది.

## లఘుటీక

మధ్యమకుఁడిట్లనవచ్చును. మాటాడవలదని హెచ్చరించి
అన్యులను మాటాడకుండఁ జేయుచున్నాము. అట్లే 'సర్వభావములు
శూన్యములు' అను వాక్యము సర్వభావములను స్వభావరహితములనుఁ
జేయుచున్నది.

ఈ దృష్టాంతము కుదురదు. ఏలయన 'మాటాడకుము' అన్న
వాక్యముచేఁ దరువాత మాటాడకుండఁ జేయుచున్నాము. 'మాటాడ
కుము' అన్న మొదటి వాక్యము ఉన్నదే కాని లేనిది కాదు. ఉన్నదానిచే
రాఁగల శబ్దము నివారింపఁబడుచున్నది.

మధ్యమకుఁడన్ననో 'సర్వ భావములు శూన్యములు' అను శూన్య
మగు వాక్యముచే భావ స్వభావ నిరాసముఁ జేయుచున్నాఁడు. కావున
ఈ యుపన్యాసము పొసఁగదు.

## మతియు

ప్రతిషేధ ప్రతిషేధ్యం
బు తెఱఁగు నిట్టిద యటంచుఁ బొడసూపిన నా
చితి కది దూరం బిట్టు మీ
ప్రతిజ్ఞ లాక్షణిక దోష పరతం బోవ్రున్. ౮

మీ రిట్లు తలంప వచ్చును— ఈ కల్పనముచేత నే ప్రతిషేధము
ప్రతిషేధ్యము అనుప పన్నములు. సర్వ భావ స్వభావ ప్రతిషేధ మగు
వచనమును మీరు ప్రతిషేధింపఁ జేయుచున్నారు. ఈ ప్రతిషేధ
ప్రతిషేధ ముపపన్నము గాదు.

ఇక్కడ మేమిట్లు చెప్పుచున్నాము. ఇదియును భద్రము గాదు.
లేనిదని చెప్పఁబడుచున్న యీ శబ్దము సత్తే యగుచున్నది. ఏలయన
ప్రతిజ్ఞా లక్షణ ప్రాప్తియందు విశ్వాసము మీ కున్నది గాని మాకు లేదు.

సర్వ భావములు శూన్యము లని మీరు చెప్పుచున్నారు గాని మేము చెప్పుట లేదు. కావున మీ ప్రతిజ్ఞ యనుపపన్న మగును గాని మా పక్షము మాత్రము గాదు.

కావున "ప్రతిషేధము ప్రతిషేధ్యము నిట్టివే యని తలంపఁ బడు చున్నవి; ఉపపన్నము లగుచున్నవి," యన్నవచనము యుక్తము గాదు.

## లఘు టీక

"నిరాకరణము శూన్యము. నిరాకృతార్థము శూన్యము. అయినను మీరు శూన్య మగు నిరాకరణమును నిరాకరించుచున్నారు. మీ నిరాకరణము గూడ సిద్ధింపదు," అని మధ్యమకుఁ డన వచ్చును. 'సర్వ భావములు శూన్యములు,' అను నది మధ్యమకుని వాదము. కావున నతని ప్రతిజ్ఞ ననుసరించి యా వాక్యము శూన్య మగును. కాని ప్రతిపక్షి మతమునఁగాదు 'భావము లశూన్యములు' అను ప్రతిజ్ఞయందు విశ్వాస మున్నది. కావునఁ బ్రతిపక్షికి తన ప్రతిజ్ఞ ననుసరించి 'భావములు శూన్యములు గావు,' అనుచు చేయు నిరాకరణముయొక్క నిరాకరణము సిద్ధించు చున్నది.

## మ ణి యు

భావములను బ్రత్యక్షానఁ బడసి పరిని<br>
వర్తితమ్ములఁ గావించు వాఁడ వేని,<br>
యా ప్రమాణమ్ము లేనిదే యగును గాన<br>
భావములు దేనిచేత లభ్యమ్ము లగును? ౫

ప్రత్యక్ష ప్రమాణము వలన సర్వభావములను బొంది, "సర్వ భావములు శూన్యములు," అని మీరు ప్రతిషేధించు చున్నారేని అది యనుపపన్నమగు చున్నది. ఏల యన ప్రత్యక్షము గూడ సర్వ భావాంతర్గతత్వము పొందిన దగుటచే శూన్యమే కదా! సర్వ భావములను బొందుచున్న వాఁడును శూన్యుఁడే యగుచున్నాఁడు. కావునఁ బ్రత్యక్ష ప్రమాణముచే నుపలంభభావము లేదు; అనుపలబ్ధమునకును బ్రతిషేధము సిద్ధింపదు.

కావున 'సర్వ భావములు శూన్యములు' అన్న వచన మనుపపన్న మగు చున్నది.

(3) ప్రమాణసిద్ధి లేకపోవుట వలన—

అనుమానముచేఁ గాని యాగమముచేఁ గాని యుపమానముచేఁ గాని సర్వ భావములను బొంది సర్వ భావ వ్యావర్తనము చేయుచున్నా మని మీరు భావింపవచ్చును.

లఘుటీక

ఎఱుకకు సాధన మైనది ప్రమాణము. ఆ ప్రమాణముచే నెఱుఁగఁ దగినది ప్రమేయము. నేత్రము, కర్ణము, జిహ్వా, ఘ్రాణము, త్వచము నను జ్ఞానేంద్రియము లైదు ప్రత్యక్ష సాధనములు. ఈ సాధనములచే నే భావ మెఱుఁగఁబడుట లేదు గావున 'సర్వ భావములు శూన్యములు,' అని మధ్యమకుఁడు చెప్పవచ్చును. ఇట్లనుట యుక్తము గాదు. ఎల్ల భావములు శూన్యములు. ప్రత్యక్ష మనునది ఎల్ల భావములలో నొకటి. కావునఁ బ్రత్యక్షము గూడ శూన్యమే. ప్రత్యక్ష ప్రమాణముచే నెఱుక పొందుచున్న వాఁడును శూన్యుఁడు. కావునఁ బ్రత్యక్షముచే పొందఁబడునది లేదు. కావున ఆ లేనిదానికిఁ జెప్పు నిషేధము గూడ లేని దగుచు నసిద్ధ మగుచున్నది.

ప్రత్యక్షము శూన్యము. కాని అనుమానము, ఆగమము, ఉపమానము అను నితర ప్రమాణములచే భావములను బొంది వాని స్వభావమును నిరాకరించుచున్నా మని పలుక వచ్చును.

ఇక్కడ మే మిట్లు చెప్పుచున్నాము :—

ఐంద్రియకముచే నను మాన మాగ మోప
మానములు మూఁడు ప్రత్యుక్తి మానితములు;
తదనుమా నాగమ ప్రసాధ్య మగు నర్థ
సమితి దృష్టాంతమునఁ గూడ సాధ్య మగును. ౭

అనుమా నోపమా నాగమములును ప్రత్యక్ష ప్రమాణ మట్లే నిరాకృతములు. సర్వ భావములు శూన్యము లగుట వలన ప్రత్యక్ష ప్రమాణము

శూన్యము. అట్లే యనుమానము, ఉపమానము, ఆగమము గూడ శూన్యములు. సర్వ భావములు శూన్యము లగుటవలన ననుమాన సాధ్యము లగు నర్థములు, ఆగమ సాధ్యము లగు నర్థములు, ఉపమాన సాధ్యము లగు నర్థములు శూన్యములే. ఏల యన సర్వ భావములు శూన్యములు గదా! అనుమాన, ఉపమాన, ఆగమములచే భావములు పొందుచున్న వాఁడును శూన్యుఁ డగును. కావున భావములకు ఉపలంభము, అనుపలబ్ధములకు స్వభావ ప్రతిషేధము నసిద్ధములు.

## ల ఘు టీ క

ప్రత్యక్షము శూన్యము. ప్రత్యక్షమే శూన్య మైనపుడు అనుమాన, ఆగమ, ఉపమానములు శూన్యములు గాకుండు టెట్లు? సర్వ భావములు శూన్యములే కదా! అప్పుడు సర్వ ప్రమాణములు, సర్వ ప్రమేయములు సర్వ ప్రమాతలు శూన్యు లగుచున్నారు. ఇట్లు సర్వ భావములు శూన్యము లగు చుండఁగా 'సర్వ భావములు శూన్యములు' అను నిషేధ మెట్లు సిద్ధింపఁగలదు?

## II. భావములకు సస్వభావత యుక్తము

### (1) కుశలాది ధర్మములకు కుశలాది స్వభావ తాంగీకారము గలదు—

'సర్వ భావములు శూన్యములు,' అని మీ చెప్పిన యర్థము యుక్తము గాదు.

> ధర్మ తత్త్వజ్ఞులు కుశల ధర్మ తత్త్వ
> కలన, లోక స్వరూప విజ్ఞాను లీ ప్ర
> పంచ సంస్థితి నంగీకరించు వారు
> శేష ధర్మ సంస్థితి నిట్లె చెప్పవలయు. ౭

ధర్మావస్థావిదులు కుశల ధర్మములు 119 అని తలంచుచున్నారు. అవి—(1) విజ్ఞానము, (2) వేదన, (3) సంజ్ఞ, (4) చేతన, (5) స్పర్శము,

(6) మనసికారము, (7) ఛందము, (8) అధిమోక్షము, (9) వీర్యము, (10) స్మృతి, (11) సమాధి, (12) ప్రజ్ఞ, (13) ఉపేక్ష, (14) ప్రయోగము, (15) సంప్రయోగము, (16) ప్రాప్తి, (17) అధ్యాశయము, (18) అప్రతిఘ, (Talent for wrangling) (19) రతి, (20) వ్యవసాయము, (21) ఔత్సుక్యము, (22) ఉన్మా, (23) ఉత్సాహము, (24) అవ్యవర్త్యము, (అవిఘాతము? అనీర్ష్య?) (25) వశిత, (26) ప్రతిపత్తి, (ప్రతిఘాతము? ప్రతిఘము?) (27) అవిప్రతిసారము, (28) పరిగ్రహము, (29) అపరిగ్రహము, (30) ............ (31) ధృతి, (32) అధ్యవసాయము, (33) అనేష్వేకము (అనౌత్సుక్యము?), (34) అనసుమూర్ధి, (35) అనుత్సారము (అనుత్సాహము?), (36) ప్రాపణ (ప్రార్థన?), (37) ప్రణిధి, (38) మదము, (39) విషయముల విప్రయోగము, (40) అనిత్యాణికత (అనైర్యాణికత?), (41) ఉత్పాదము, (42) స్థితి, (43) అనిత్యత, (44) సమర్థాగతము (సమన్వాగమము), (45) జర, (46) పరిత్రాస్యత (పరితాపము?), (47) అరతి, (48) వితర్కములు (వితర్కము?), (49) ప్రీతి, (50) ప్రమాదము (ప్రసాదము?), (51) వ్యవహారత (అనువిగ్రహము?), (52) ప్రేక్ష (ప్రేమము?), (53) ప్రతికూలము, (54) ప్రదక్షిణగ్రాహము, (55) వైశారద్యము, (56) గౌరవము, (57) చిత్రీకారము, (58) భక్తి, (59) అభక్తి, (60) శుశ్రూష, (61) సాదరము (ఆదరము?), (62) అనాదరము, (63) ప్రస్రబ్ధి (ప్రశ్రబ్ధి?), (64) హాసము, (65) వాక్కు, (66) విమ్పందన (విస్పందన?), (67) సిద్ధము, (68) అప్రసాధము (అప్రసాదము?), (69) అప్రస్రబ్ధి (అప్రశ్రబ్ధి?), (70) వ్యవహారత (వ్యవకారత?), (71) దాక్ష్యము (ధైర్యము?), (72) సౌరత్యము, (73) విప్రతిసారము, (74) శోకము, (75) ఉపాయాసాయాసము (ఉపాయాసము?), (76) భీతము, (77) అప్రదక్షిణగ్రాహము, (78) సంశయము, (79) సంవరణాంపరిశుద్ధి, (80) అధ్యాశయము (అధ్యాత్మసంప్రసాదము?), (81) రూపము (భీరుత?), (82) శ్రద్ధ, (83) హ్రీ, (84) ఆర్జవము, (85) అవంచనము, (86) ఉపసమము (ఉపశమము?), (87) అచాపలము, (88) సప్రమా

దము (అప్రమాదము?), (89) మార్దవము, (90) ప్రతిసంఖ్యానము, (91) ..., (92) పరిదాహము (నిష్పరిదాహము?), (93) అమదము, (94) అలోభము, (95) అదోషము, (96) అమోహము, (97) అశ ద్వాత్ (సర్వజ్ఞత?), (98) అప్రతినిఃసర్గము, (99) విభవము, (100) అపత్రప్యము (అపత్రాప్యము?), (101) అపరిశ్రచ్ఛదనము (అపరిచ్ఛదనము?), (102) మాననము, (103) కారుణ్యము, (104) మైత్రి, (105) అదీనత, (106) దిరత (అరణ?), (107) బుద్ధి (?), (108) అనుపనాహము, (109) అనీర్ష్య (?), (110) చేతసోఽపర్యాదానము, (111) క్షాంతి, (112) వ్యవసదు (వ్యవసర్గము?), (113) ఆసౌరత్యము (అసౌరత్యము?), (114) ఇతి భోగాన్వయము (పరిభోగాన్వయము?), (115) పుణ్యము, (116) అసంజ్ఞిసమాపత్తి, (117) నైర్యాణికత, (118) అసర్వజ్ఞత, (119) అసంస్కృతధర్మములు.

అట్లే [1] అకుశల ధర్మములకు అకుశల స్వభావము, నివృతా వ్యాకృతము[2]లకు నివృతావ్యాకృతము, ప్రకృతా వ్యాకృతములకు ప్రకృతా వ్యాకృతము[3], కామోక్తములకు కామోక్తము, రూపోక్తములకు రూపోక్తము, అరూపోక్తములకు అరూపోక్తము[4], అనాస్రవములకు అనాస్రవము[5], దుఃఖోక్తములకు దుఃఖోక్తము, సముదయోక్తములకు సముదయోక్తము, నిరోధోక్తములకు నిరోధోక్తము, మార్గోక్తములకు మార్గోక్తము, భావనా ప్రహాతవ్యములకు భావనా ప్రహాతవ్యము, అప్రహాతవ్యములకు అప్రహాతవ్యము, ప్రహాతవ్యమునకు[6] ప్రహాతవ్యము.

ఇట్లు అనేక ప్రకారము ధర్మ స్వభావము దృష్టము. కావున "సర్వ భావములు నిఃస్వభావములు, నిఃస్వభావత వలన నవి శూన్యములు" అన్న వచనము యుక్తము గాదు.

## లఘు టీక

ఇక్కడ సర్వాస్తివాది దూషణము ప్రదర్శింపఁబడు చున్నది.

సర్వాస్తివాది వైభాషికుఁ డనియుఁ బేర్కొనఁబడుచున్నాఁడు. ఈతని మతమునఁ బ్రపంచములోని యెల్ల వస్తువు ధర్మ సముచ్చయమే

కాని ఏక వస్తువు గాదు. మాఱని వస్తువు జగత్తున లేదు. గమనము, కాలము, పరిణామము వ్యావహారికములు. ఆత్మ కాని, జీవుఁడు గాని, పుద్గలుఁడు గాని, సత్త్వము గాని పారమార్థికముగా లేదు. తాత్త్వికముగా ధర్మములు మాత్రమే యున్నవి. ఇవి అనాత్మకములు, పృథక్కులు; అనఁగా నొక ధర్మమందు మఱియొక ధర్మము సమవాయి సంబంధముతోఁ గాని, మఱి యే యితర సంబంధముతోఁ గాని యుండదు. అసంస్కృత ధర్మములు మూఁడు దక్కఁ దక్కంగల ధర్మము లన్నియు క్షణికములు. ఆ యా హేతు ప్రత్యయములను బొంది జాతి జరామరణ సంసారాక్షి సంస్కృతములై సంస్కృత ధర్మములు క్షణికము లగుచున్నవి. ప్రపంచములోని యెల్ల వస్తువులు దీపశిఖ లట్లు క్షణికములు. గిరి వృక్షాదులు గూడ దత్త్వముచే క్షణికములే కాని, సభాగ నిష్యందముకలన నవి స్థిరములట్లు కానిపించును.

సంసార ప్రవృత్తికి ధర్మ సముత్పాదమే హేతువు. కావున నార్యుఁడు ధర్మ ప్రవిచయముచేఁ దన్నిరోధ మొనరింప వలయును. అదియే నిర్వాణము.

ఇట్టి సిద్ధాంతమునందు విశ్వాసము గల సర్వాస్తివాది మాధ్యమికుని నిట్లు ప్రశ్నించుచున్నాఁడు :—

మీరు చెప్పినట్లు సర్వము శూన్యమగుచో, బుద్ధ భగవత్పాదులు ధర్మ సంకేతము ప్రతిపాదింపక పోవలయును. ధర్మములు యథార్థముగాఁ గలుగవేని కుశల ధర్మము లనియు, నకుశల ధర్మము లనియు, సాస్రవ ధర్మము లనియు, అనాస్రవ ధర్మము లనియు, ఆర్య సత్యము లనియు నిట్లు వివిధములుగా నున్న ప్రవిభాగములు గలుగక పోవలయును. కాని, భగవత్పాదులును, దక్కంగల తత్త్వజ్ఞులును ధర్మ సంకేత మంగీకరించు చున్నారు. కావున సర్వము శూన్య మనుట తగదు.

(మూలపాఠమందలి కుశల ధర్మముల పట్టిక యసమగ్రముగాను, ప్రమాదబహుళముగా నుండుటచే వివిధ పరిశోధకులు సూచించిన పాఠమే యిచ్చట సంగ్రహింపఁబడినది.)

విజ్ఞానము = నిర్వికల్ప ప్రత్యక్షము, కల్పనాపోఢ ప్రత్యక్షము, (విజ్ఞానం ప్రతివిజ్ఞప్తిః) (Pure sensation)

వేదన మూఁడు తెఱంగులు :— (1) సుఖము, (2) దుఃఖము, (3) అదుఃఖాసుఖము.

సంజ్ఞ = బుద్ధి (?) (concepts capable of coalescing with a word)

చేతన (ధర్మాన్ సంచేతయతీతి చేతనా) చిత్తాభిసంస్కారము, చిత్తప్రస్పందము (బుద్ధిపూర్వకమైన యత్నము).

స్పర్శము (త్రయాణాం సన్నిపాతః స్పర్శః) చిత్తేంద్రియార్థ సన్నిపాతము.

ఛందము = అభిప్రేతమగు వస్తువునందలి యభిలాష.

ప్రజ్ఞ = వివేకము, ధర్మప్రవిచయము (యేన సంకీర్ణా ఇవ ధర్మాః పుష్పాణీవ ప్రవిచీయంతే)

మనసికారము = సావధానత (attention)

అధిమోక్షము (ఆలంబనస్య గుణతోఽవధారణం) (inclination)

శ్రద్ధ = పాపపుణ్యములయందలి విశ్వాసము, చిత్తప్రసాదము.

వీర్యము = కుశలక్రియయందు మనస్సుయొక్క అత్యుత్సాహము.

ఉపేక్ష = చిత్తసమత (యద్యోగాత్ చిత్తమనాభోగం వర్తతే)

ప్రశ్ర (స్ర) బ్ధి = చిత్తకర్మణ్యత, చిత్తలాఘవము.

అప్రమాదము = కుశలధర్మముల సముపార్జించి కాచుకొనుట (కుశలానాం ధర్మాణాం ప్రతిలంభ నిషేవణమ్)

అనుపనాహము — మైత్రిని వీడకుండుట ?

అసంజ్ఞి సమాపత్తి — యత్నము ద్వారమున బాహ్యజ్ఞానము నిరోధించి సమాధియందు నిల్పు సంస్కారము.

అసంస్కృత ధర్మములు:— (1) ఆకాశము (2) ప్రతిసంఖ్యా నిరోధము (ప్రజ్ఞాద్వారమున ధర్మముల లయము) (3) అప్రతిసంఖ్యా నిరోధము (ఉత్పాదహేతు నాశనముచే ధర్మముల లయము).

1. అకుశల ధర్మములు:— (1) ప్రాణాతిపాతము, (2) అదత్త దానము (3) కామమిథ్యాచారము, (4) మృషావాదము (5) పైశున్యము (6) పారుష్యము (7) సంభిన్నప్రలాపము (8) అభిధ్య (9) వ్యాపాదము (10) మిథ్యాదృష్టి.

2. నివృతావ్యాకృత ధర్మములు:— ఈ యాఱు ధర్మములు కేవల మనర్థదాయకములు గావు. కొండొకప్పుడు నిర్వాణాధిగమమున నవ్యాకృతములుగా నుండవచ్చును. ఐనను నివి సత్కాయానుగ్రహదృష్టి సంప్రయుక్తములై క్లిష్ట ధర్మము లగును. ఇవి మోహము, ప్రమాదము, కౌసీద్యము (ప్రస్రబ్ధికి విరోధి), అశ్రద్ధ, స్త్యానము (మాంద్యము, sloth), ఔద్ధత్యము (చేతస్సుయొక్క అనుపశమము, నృత్యగీతాది శృంగార వేశ్యాలంకార కాయౌద్ధత్య సన్నిశ్రయదాన కర్మకమైన చైతసిక ధర్మము).

3. బౌద్ధ దర్శనమున ధాతువులు పదునెనిమిది. ధాతు త్రయము పేర్కొనఁబడినప్పుడీ ధాతువునకు లోకము, లేదా యవసర మని యర్థము. కామ ధాతువు, రూప ధాతువు, అరూప ధాతు వని లోకములు మూఁడు. కామ ధాతువునందు వ్యక్తి చక్షురాది షడింద్రియ ధాతువులతోను, రూపాది షడ్ధాతువులతోను, చక్షుర్విజ్ఞానాది షడ్విజ్ఞాన ధాతువులతోను గూడియుండును. రూప ధాతువున నిది గంధ, రస, ఘ్రాణ, జిహ్వా, విజ్ఞాన ధాతు విరహితముగా నుండును. అరూప ధాతువునందు వ్యక్తి మనో ధాతువు, ధర్మ ధాతువు, మనో విజ్ఞాన ధాతు వను మూఁడు ధాతువులతోఁ గూడి యుండును.

4. ధర్మములు రెండు విధములు :— (1) సాస్రవ ధర్మములు, (2) అనాస్రవ ధర్మములు. క్లేశావృతములు సాస్రవ ధర్మము లనియు, తదనావృతములు అనాస్రవ ధర్మము లనియుఁ జెప్పఁబడుచున్నవి. పృథగ్జనుఁడు సాస్రవ ధర్మ సముత్పన్నుఁడు. ఆర్యుఁడు అనాస్రవ ధర్మ సముత్పన్నుఁడు. అనాస్రవ ధర్మములందు సంస్కృత ధర్మము లేక అసంస్కృత ధర్మ త్రయము గూడఁ జేర్పఁబడినవి.

5. సర్వ ధర్మములు నాలు గార్య సత్యములుగా విభజింపఁబడినవి :— (1) దుఃఖసత్యము, (2) సముదయ సత్యము, (3) నిరోధ

సత్యము, (4) మార్గ సత్యము. సాౕస్రవ ధర్మములు మొదటి రెండు సత్యములందును, అనాౕస్రవ ధర్మములు తుది రెండు సత్యములందును జేర్పఁబడినవి.

6. దృష్టి ప్రహాతవ్యములు (ప్రహాతవ్యములు ?) క్రోధము, మ్రక్షము (వంచనము), మాత్సర్యము, ఈర్ష్య, ప్రదాసము (సావద్య వస్తువుల నామోదించుట), విహింస, ఉపనాహము (మైత్రీ విచ్ఛేదము), మాయ, శాఠ్యము, మదము.

7. బోధ్యంగికములు :— స్మృతి, ధర్మప్రవిచయము, వీర్యము, ప్రీతి, ప్రస్ర (శ) బ్ధి, సమాధి, ఉపేక్ష.

8. బోధిపాక్షిక ధర్మములు :— కాయమునందు కాయానుదర్శ స్మృత్యుపస్థానము, వేదనయందు వేదనానుదర్శ స్మృత్యుపస్థానము, చిత్తమునందు చిత్తానుదర్శ స్మృత్యుపస్థానము, ధర్మమునందు ధర్మాను దర్శ స్మృత్యుపస్థానము అను స్మృత్యుపస్థానములు నాలుగు, ఉత్పన్నము లగు కుశలమూలముల సంరక్షణము, అనుత్పన్నముల సముత్పన్నత్వము ఉత్పన్నములగు అకుశల ధర్మముల ప్రహాణము, అనుత్పన్నముల పునరుత్పాద మను సమ్యక్ప్రహాణములు, ఋద్ధిపాదములు నాలుగు, శ్రద్ధ, సమాధి, వీర్యము, స్మృతి, ప్రజ్ఞ యను పంచేంద్రియములు, శ్రద్ధాది పంచబలములు, సప్తబోధ్యంగములు, సమ్యగ్దృష్టి, సమ్యక్సంకల్పము, సమ్యగ్వాక్కు, సమ్యక్కర్మాంతము, సమ్యగాజీవము, సమ్యగ్వ్యాయామము, సమ్యక్స్మృతి, సమ్యక్సమాధి యను నార్యాష్టాంగిక మార్గములు.

మ ఱి యు

నైర్యాణిక ధర్మంబు ల
నైర్యాణిక ధర్మములు న నైర్యాణికము
న్నైర్యాణి కమ్ము తత్త్వ
మ్మార్యాగ్రేసరులచేత నాదిష్టంబుల్. ౮

ఇక్కడ అవస్థోక్తము లగు నైర్యాణిక ధర్మములకు నైర్యాణిక స్వభావము, అనైర్యాణికములకు అనైర్యాణికము, బోధ్యంగికము

బోధ్యంగికము, అబోధ్యంగికములకు అబోధ్యంగికము, బోధిపాక్షికములకు బోధిపాక్షికము, అబోధిపాక్షికములకు అబోధిపాక్షికము స్వభావము. ఇట్లే శేషములకును. ఈ విధముగా ధర్మములకు ననేక ప్రకారములుగ స్వభావము గానఁబడుచున్నది.

కావున "సర్వ భావములు నిఃస్వభావములు, నిఃస్వభావత వలన నవి శూన్యములు," అనుట యుక్తము గాదు.

## లఘు టీక

నిర్వాణమునకుఁ దోడ్పడు ధర్మములు నిర్వాణమునకుఁ బాపు ధర్మములు నిర్వాణత త్త్వము అనిర్వాణత త్త్వము గల వని బుద్ధ భగవాను లుపదేశించిరి.

## (2) నిర్వస్తుకమునకు నామము లేదు గావునను

### మ ఱి యు

ధర్మములకు స్వభావమ్ము దనర దేని,
నిఃస్వభావమునకుఁ బేరు నెగడరాదు;
అభిధ సస్వభావమున కే యమరుచుండు,
వస్తు హీనమ్ము నామమ్ము పరగు టెట్లు ? ౯

ధర్మములకు స్వభావము గలుగు నప్పుడు భావములకు స్వభావము గలుగుచున్నది. దానివలన సర్వభావములు నశూన్యము లగు చున్నవి.

కావున "సర్వభావములు నిఃస్వభావములు; నిఃస్వభావములగుట వలన నవి శూన్యము," లని చెప్పినది యుక్తముగాదు. (సంస్కృతమూలము ననుసరించిన వ్యాఖ్య.)

'సర్వ ధర్మములు నిఃస్వభావములు,' అను నది నిఃస్వభావ మగు నేని "సర్వ ధర్మములు నిఃస్వభావములు," అను నభిధానమైన నుండక పోవలయును. ఏల యన నిర్వస్తుకమగు నామ మెచ్చటను లేదు. కావున నామము సత్తగుటచే సర్వ భావములు స్వభావము గలవి కావలయును.

స్వభావము గలవి యగుట వలన భావము లశూన్యములు. (ప్రొఫెసర్ తుచ్చి అనువాదము ననుసరించి చేసిన వ్యాఖ్య.)

లఘు టీక

వస్తువే లేనపుడు పేరు గూడ నుండఁజాలదు. సర్వ భావములు స్వభావ రహితములే యగు నేని, 'సర్వభావములు శూన్యములు' అను వాక్య మేని కలుగఁ జాలదు. మధ్యమకుఁడు సర్వ భావములు శూన్యము లని చెప్పుచున్నాఁడు. కావున భావము లశూన్యములు గావలయును. భావము లశూన్యము లగుటవలన నతఁడు భావములు శూన్యములు, అని చెప్పఁగలుచున్నాఁడు. కావున సర్వ భావములు శూన్యములు అను నర్థము పొసఁగదు.

(3) ప్రతిషేధాసిద్ధివలన

(క) ధర్మములచేఁ దక్క స్వభావాప్రతిషేధ మగుట వలన -

మతి యు

ధర్మమునకంటె వేఱుగాఁ దనరు నేని<br>యభిధ యదియు నేతద్ధర్మమందు నుండఁ<br>బోదు, ధర్మమునకు నన్యభూత మగుచు<br>నలరుచో నది యుపదేశ నార్హ మగును. ౧౦

మీ రిట్లు తలంపవచ్చును. అవస్తుక మగు నామము లేకుండుఁ గాక. స్వభావ మున్నది. కాని యీ స్వభావము ధర్మములకు సంభవించుట లేదు. ఇట్లు ధర్మములు నిఃస్వభావము లగుటవలన ధర్మశూన్యత సిద్ధ మగును. నామముగూడ నిర్వస్తుకము గాదు.

ఇక్కడ మే మిట్లు చెప్పుచున్నాము :— ఈ పక్షమున స్వభావము సత్తగును. అది ధర్మములందుఁ గాక వేఱుగా నుండవలయును. అట్లున్నదే యగుచో, ధర్మ వినిర్ముక్త మగు నే యర్థమం దుండును ? అట్టి యర్థము

చెప్పఁబడలేదు. కావున "స్వభావ మున్నది. అది ధర్మములందు లేదు," అని చేయు కల్పన హీన మగుచున్నది.

(ప్రొ ఫెసరు టుచ్చి పాఠము ననుసరించి)

## లఘు టీక

పైని చెప్పిన దోషము పరిహరించుటకై వస్తు వున్నపుడే దానికిఁ బేరు కలుగును. "వస్తువు లేనపుడు పేరు కలుగదు. కాని స్వభావ మున్నది. ఈ స్వభావము ధర్మములకు లేదు. ధర్మము లిట్లు స్వభావ రహితము లగుటచే శూన్యము లగుచున్నవి," అని చెప్పవచ్చును.

కాని యీ వాదము నిలువఁ జాలదు. ఏల యన స్వభావ మున్న దని యంగీకృత మగుచున్నది. అది ధర్మములందు లేదని చెప్పఁబడుచున్నది. ఆ పక్షమున స్వభావ మను నది ధర్మములందుఁ గాక మఱెందైన నుండ వలయును. ధర్మములను విడిచి యది యెందున్నది? ఎందున్నదో చెప్పఁ బడ లేదు. కావున సర్వ భావములు శూన్యము లనుట పొసఁగదు.

(4) సద్భావమున కనంగీకారము లేమివలనను

ఉన్న దానికే ప్రతిషేధ మొప్పుచుండు,
నిలయమునఁ బాత్ర లే దని పలుకుచుందు;
మట్టులే స్వభావ మ్మున్న యపుడ కానఁ
బడును గాదె యద్దాని వ్యావర్తనమ్ము. ౧౧

ఉన్నదానికే కాని, లేనిదానికిఁ బ్రతిషేధము లేదు. ఎట్లన ఇంటఁ బాత్ర లేదని పాత్ర లేమి చెప్పఁబడుచున్నది. అంతియకాని లేని దానికి లేమి లేదు. ఇట్లే ధర్మములకు భావము లేదు అని ఉన్న స్వభావమునకే ప్రతిషేధము గలుగుచున్నది కాని, యసత్తునకుఁ బ్రతిషేధము గలుగుటలేదు.

కావున, "సర్వ భావములు నిఃస్వభావతవలన శూన్యములు," అని చెప్పిన వాక్యము యుక్తము గాదు. ప్రతిషేధ సంభవము వలననే సర్వ భావ స్వభావము అప్రతిషిద్ధ మగుచున్నది.

## ల ఘు టీ క

ధర్మ మున్నపుడే యది యున్న దని కాని లేదని కాని చెప్పఁ గలము. అనుభవమున కెన్నఁడు తగులని విషయమును లేదని నిరాకరించుట సంభవింపదు. ఇంటఁ బాత్ర లేదని యందుము. పాత్ర యనుభవ గోచరమే. అనుభవ గోచరమైన పాత్రను ఇంట లేదని నిరాకరించుట జరుగుచున్నది. అట్లే ధర్మములకు స్వభావము లేదని చెప్పినపుడు గూడ ఉన్న ధర్మములకే స్వభావము లేదను నిరాకరణము గలుగుచున్నది. కాని లేని ధర్మములకు స్వభావము లేదను వచనము గలుగుట లేదు. "సర్వ భావములు నిఃస్వభావత్వమునఁ జేసి శూన్యములు" అను నిరాకృతి సంభవ మగుచున్నది. కావున సర్వ భావ స్వభావము ఉన్నది యగుచో మధ్యమకుని నిరాకృతి నిరాకృత మగుచున్నది.

## మ తి యు

ధర్మముల్ నిఃస్వభావతఁ దనరు నేని,
యేది మీ మాటచేఁ బ్రతిషేధ మందు ?
ధర్మముల్ ప్రతిషేధ్యముల్ దనరు నేని
యవి యసద్వాక్యునఁ బ్రతిషేధ్యమ్ము లగును. ౧౨

"స్వభావము లేనే లేదు. భావములు నిఃస్వభావములు," అని చెప్పు మీచే నేది ప్రతిషేధింపఁబడుచున్నది ? అసత్తగు వచనముకంటె వేఱుగాఁ బ్రతిషేధము సిద్ధ మగుట లేదు. అదెట్లన, అగ్నికి శైత్యము, జలమునకు నౌష్ణ్యము చెప్పు వచనము అసత్తగుచున్నది గాని, ప్రతిషేధము సిద్ధ మగుట లేదు.

## ల ఘు టీ క

మధ్యమకుని మతమున సర్వ భావములు శూన్యములు. అట్లే యగుచో 'సర్వ భావములు శూన్యములు' అను వాక్యముచే నతఁడు వేనిని నిరాకరించుచున్నాఁడు. ప్రతిషేధక వాక్యముకంటె నస్యముగాఁ బ్రతిషేధము సిద్ధించుట లేదు. 'నిప్పు చల్లన, నీరు వెచ్చన' యన్న వాక్యము

లసత్య వచనము లగుచున్నవి గాని, యగ్నికి శైత్యము, జలమునకు ఔష్ణ్యము సిద్ధింపఁజేయుటలేదు.

మ ఱి యు

మూఢ మతి మృగతృష్ణి కాంబువుల గ్రాహ
మెట్లు ప్రతిషేధ్య మగుచున్న దట్లె నిఃస్వ
భావతా భాసమాన ధర్మావలోకి
త మ్మసత్య తత్త్వ నివర్తనమ్ము పొందు. ౧౩

మీ రిట్లు భావింప వచ్చును : మూఢులకు మృగతృష్ణయందు జల బుద్ధి పొడము చున్నది. ఆ మృగతృష్ణ నిజముగా నిర్జల యని యచట పండిత జాతీయుఁడగు పురుషునిచే ఆ మిథ్యాజ్ఞాన నివర్తనార్థము చెప్పఁబడు చున్నది. ఇట్లే సత్త్వములకు నిఃస్వభావములందు స్వభావ మున్న దని కలుగు జ్ఞానమును దొలఁగించుటకై సర్వభావములు నిఃస్వభావము లని చెప్పఁబడుచున్నది.

ల ఘు టీ క

మధ్యమకుఁడు తన వాదము నీ క్రింది దృష్టాంతముతో సమర్థింపవచ్చును. ఎండమావులను జూచి మూఢుఁడు వానిని జలము లని భ్రాంతి నొందును. ఇట్టి భ్రాంతి లోకమునం దనుభవగోచరమే. మూఢుని అ య్యజ్ఞానమును దొలఁగింపనెంచి పండితుఁడైనవాఁడు 'ఎండ మావులు నీరు కాదు,' అని చెప్పును. అట్లే జీవులు, స్వభావశూన్యము లగు భావములను స్వభావసహితము లని మోహవశమునఁ దలంచుచున్నారు. అట్టివారి యజ్ఞానము దొలఁగింపఁగోరి, 'సర్వభావములు స్వభావరహిత ములు,' అని చెప్పుట సంభవించుచున్నది.

(2) గ్రాహాది షట్క స్వీకారము వలనను

ఇక్కడ మేము చెప్పుచున్నాము:—

అనుట యుక్తమ్ము గాదు; గ్రాహాదికములు
మూఁడు, ప్రతిషేధ మాదిగాఁ బొలుచు త్రికము

కలసి యాఱు ధర్మమ్ములు గ్రాలుచున్న
వనుచు నంగీకరించుటే యగును జుమ్ము. ౧౮

మీరు చెప్పినట్లగు నేని సత్త్వములకు మిథ్యా గ్రాహము నిజముగా నున్న దగుచున్నది. ఈ పక్షమున గ్రాహ్య మున్న దగుచున్నది. గ్రహీత లైన సత్త్వము లున్నవగుచున్నవి. ఆ మిథ్యా గ్రాహమునకుఁ గూడ ప్రతిషేధ మున్న దగుచున్నది. ప్రతిషేధ్య మగు ఆ మిథ్యాగ్రాహ మున్న దగుచున్నది. ఆ మిథ్యా గ్రాహ ప్రతిషేద్ధ లగు యుష్మదాదు లున్నారు. ఇట్లు గ్రాహాది షట్కము సిద్ధ మగుచున్నది. ఈ షట్కము నకుఁ గూడ నప్రతిషిద్ధత్వమువలన, "సర్వ భావములు శూన్యములు," అని చెప్పినది యుక్తము గాదు.

లఘు టీక

ఈ పక్షమున నెండమావు లున్న వగుచున్నవి. జలభ్రాంతియు, భ్రాంతిని బొందువాఁడును, ఎండమావుల యవస్తుత్వము, యథార్థ జ్ఞానము, యథార్థము నెఱుఁగువాఁడు నున్నవా రగుచున్నారు. ఈ యాఱు నున్నవగుటచే 'సర్వభావములు శూన్యము' లనుట యుక్తము గాదు.

గ్రాహ మది లేని దగు నేని, గ్రాహ్య మట్లె
యల గ్రహీతయు లేనివాఁ డగున యేని
వాని తోఁపాటె ప్రతిషేధ భావ మాది
యైన త్రితయమ్ము లేనిదే యగును జుమ్ము. ౧౯

పైని పేర్కొన్న దోషము గలుగ కుండుటకై గ్రాహము లేదు, గ్రాహ్యము లేదు, గ్రహీతలు లేరు అని యందు రేని, గ్రాహమునకుఁ బ్రతిషేధము గలుగదు, 'సర్వ భావములు నిఃస్వభావము'అనునది గూడ లేని దగుచున్నది. ప్రతిషేధ్యము లేదు, ప్రతిషేద్ధలు లేరు.

లఘు టీక

'ఎండమావులు లేవు. మిథ్యాసలిలబుద్ధి లేదు. మిథ్యాసలిల బుద్ధి పొందువాఁడు లేఁడు.' అనుచు గ్రాహ్యము, గ్రాహము, గ్రహీత

కలుగ రను పక్షమున నివారింపఁదగిన యర్థము, నివారణము, నివర్తించు వాఁడు గలుగరు. అపుడు 'సర్వభావములు నిఃస్వభావములు,' అన్న నివారణము ఉండదు. నివార్యమగు నర్థము కలుగదు. నివర్తయితయుఁ గలుగఁడు.

ప్రతిషేధ ప్రతిషేధ్య
ప్రతిషేద్ధలు గల్గరేని, భావము లెల్లన్
స్థితిమై సిద్ధించును; వా
ని తత్త్వ మీరా కైవడి పరినిష్ఠం బొందున్. ౧౬

ప్రతిషేధ, ప్రతిషేధ్య, ప్రతిషేద్ధలు లేనివారేని సర్వభావములు నప్రతిషిద్ధము లగును. అపుడు సర్వభావములకు స్వభావము ఉన్నదగు చున్నది.

లఘు టీక

నివారణము, నివార్యము, నివర్తయిత లేనివా రగుచుండఁగా ఎల్లభావము ననివారితమై సిద్ధించును. అప్పుడు సర్వభావములకు స్వభావము సిద్ధించుచున్నది.

(గ) నిర్హేతుకత్వము వలన —

మ త్తే యు

అట్టులగుట హేతు వసిద్ధ మగును; నిఃస్వ
భావతను నేది హేతువై పరగఁగలదు?
హేతు రహితమ్ముగా నర్థ మెసఁగునేని,
యర్థ మయ్యు దెట్లు ప్రసిద్ధి నందఁగలదు? ౧౭

'సర్వభావములు నిఃస్వభావములు,' అని చెప్పినపుడు మీకు హేతు వసిద్ధ మగును. కారణ మేమన సర్వభావములు నిఃస్వభావములు గదా! నిఃస్వభావతవలన నవి శూన్యములు. సర్వభావములు శూన్యములగుటఁజేసి హేతువును శూన్యమే. హేతువు లేనపుడు 'సర్వభావములు శూన్యములు'

అను నర్థము నిర్హేతుక మగుచున్నది. ఇట్లు నిర్హేతుక మగుచున్నదానికి దేనివలనఁ బ్రసిద్ధి కలుగుచున్నది?

కావున 'సర్వభావములు శూన్యములు' అను నర్థము యుక్తముగాదు.

## లఘు టీక

సర్వ భావములు నిఃస్వభావము లని మాధ్యమకుఁడు చెప్పుచున్నాఁడు. ఇది యథార్థ మగుచో హేతువుగూడ శూన్యమే కావలయును. హేతువు లేనపుడు 'సర్వభావములు శూన్యములు' అనెడి వాద మెట్లు ప్రసిద్ధి పొందుచున్నది?

## మఱియు

భావ సస్వభావత్వ నివర్తనమ్ము
హేతు హీనత సిద్ధి మీకైనయునేని,
భావ సస్వభావత్వమ్ము వఱలుచుంట
హేతుహీనత సిద్ధి మాకైనయఁగలదు. ౧౮

భావములకు నిఃస్వభావత్వము నిర్హేతుకముగా సిద్ధింప వచ్చు నని మీరు భావింప వచ్చును. ఆ పక్షమున స్వభావ నివర్తనము మీకు నిర్హేతుకముగా సిద్ధమైనట్లే మాకును స్వభావ సద్భావము గూడ నిర్హేతుకముగా సిద్ధించును.

## లఘు టీక

'హేతువు లేకయే భావములు సస్వభావములు గావు,' అనెడి వాదము సిద్ధించునేని 'భావములు సస్వభావములు,' అనెడి వాదము ఏల సిద్ధింపదు? హేతువు లేమిచే సిద్ధింపకున్న దన్నచో మధ్యమకుని వాదమునకు ఏ హేతు వున్నది?

హేతువున కున్కి, భావ సంఘాతమునకు
నిఃస్వభావత్వ కలనమ్ము నిశ్చయించు
వాద మెట్లు గన్న ననుపపన్న మగును;
వర్తిలదు నిఃస్వభావ భావమ్ము జగతి. ౧౯

ఇచట భావముల నైఃస్వాభావ్యమునకు హేతు వున్నదని తలంతు రేని, 'సర్వ భావములు నిఃస్వభావములు' అన్నది యుపపన్నము గాదు. లోకమునందు నిఃస్వభావమగు భావ మొకటియు లేదు గదా !

## లఘు టీక

'భావములు నిఃస్వభావములుః అనుటకు హేతు వున్నది', అనుచో 'సర్వభావములుః నిఃస్వభావములు', అనుట కుదురదు. లోకమందు నిఃస్వభావమగు వస్తువే లేదు.

(4) ప్రతిషేధ్యా సిద్ధివలన—

మఱియు

ప్రథమమునఁ బ్రతిషేధ, మా పైని దాని<br>
విషయ ముండు నన్నను, కాక వీని వ్యత్య<br>
యమ్ము సెప్పికొన్నను సిద్ధి యగుట లేదు;<br>
ఒక్క తఱి నున్న స్వాభావ్య మున్న దగును. ౨౦

ప్రతిషేధము పూర్వ ముండి, ప్రతిషేధ్య మా వెనుక నున్నచో నిఃస్వభావత యనుపపన్న మగును. ప్రతిషేధ్యము లేని దగుచుండఁగా నెద్దానికిఁ బ్రతిషేధము గలుగుచున్నది ?

అట్లు కాక ప్రతిషేధ్యము మున్నుగా నుండి, ప్రతిషేధము తరువాతఁ గలుగున దైనను నిఃస్వభావత యుపపన్న మగుట లేదు. ఏల యనఁ బ్రతిషేధ్యము మున్నున్న దగుచుండఁగాఁ బ్రతిషేధ మేమి చేయును?

అట్లు గాక ప్రతిషేధ ప్రతిషేధ్యములకు నేక కాలమున నునికి చెప్పినను, బ్రతిషేధము ప్రతిషేధ్యార్థమునకుఁ గారణ మగుట లేదు. ప్రతిషేధ్యము ప్రతిషేధమునకుఁ గారణ మగుట లేదు. యుగపజ్జాతము లగు మృగ విషాణ ద్వయములో దక్షిణ విషాణము సవ్యమునకుఁ గాని, సవ్య విషాణము దక్షిణమునకుఁ గాని కారణము గాదు.

## ల ఘు టీ క

మీఁదుమిక్కిలి నివారణము మున్నుగా నుండి, యా వెనుక నివార్యార్థ ముండు నన్నను, నివార్యార్థము మున్నుగా నుండి, యా వెనుక నివారణము గలుగు నన్నను, అట్లుగాక ఏకకాలమున నివారణ నివార్యార్థములు గలుగు నన్నను గుదురదు.

ఏల యన నివారణము మున్నుగా నుండి, యా వెనుక నివార్యార్థ ముండునన్నప్పుడు, నివారణము దేనిని నివారించు చున్నది ? నివారింపఁ దగిన యర్థమే లేదు గదా !

నివారింపఁ దగిన యర్థము మున్నుగా నుండి, నివారణ మా వెనుక నుండు నన్నచో, ఉన్న యర్థమును నివారణ మెట్లు లేకుండఁ జేయును ?

నివారణ నివార్యార్థము లేకకాలికము లని చెప్పినను, నివారణమునకు నివార్యముగాని, నివార్యమునకు నివారణముగాని కారణమగుట లేదు. లేడికి ఒకేసారి కొమ్ములు పుట్టుచున్నవి. దాని కుడి కొమ్మునకు నెడమ కొమ్ముగాని, యెడమ కొమ్మునకుఁ గుడికొమ్ముగాని కారణము గాదు.

కావున "సర్వభావములు నిఃస్వభావములు. నిఃస్వభావము లగుటచే శూన్యములు," అనెడి వాదము సర్వదా యసిద్ధమగుచున్నది.

## ఉత్తర పక్షము

### I. భావముల శూన్యత యుక్తమే.

(1) వచన శూన్యతా స్వీకారము నందును 'సర్వభావములు నిఃస్వభావములు', అన్న యర్థము యుక్తము గాదనుచు మీ రిట్లు చెప్పియున్నారు—

> "సర్వ భావ సమితి సర్వత్ర నిఃస్వభా
> వమ్మ యయిన నిఃస్వభావ మగుచు
> వఱలు మీ వచస్సు స్వాభావ్య వినివర్త
> న క్రియా సమర్థనమ్ము గాదు."

ఇక్కడ మే మిట్లు చెప్పుచున్నాము:—

అస్మ దుక్తి హేతు ప్రత్యయములం గాని,
దాని సాకల్య మందున కాని, యన్య
భావమునం గాని లేనిచో భావ నిఃస్వ
భావతను జేసి శూన్యత ప్రాప్త మయ్యె. ౨౧

మా మాటకు హేతువు సంప్రయుక్త మహాభూతము లందు లేదు. విప్రయుక్త మహాభూతములందు లేదు. ప్రత్యయములందు లేదు. ఉరః కంఠోష్ఠ జిహ్వా దంత మూల తాలు నాసికా మూర్ధ ప్రభృతులందు లేదు. ప్రయత్నములందును లేదు. ఉభయ సామగ్రియందును లేదు. హేతు ప్రత్యయ సామగ్రీ వినిర్ముక్తమై వేఱుగాను లేదు. కావున నది నిఃస్వభావము. నిఃస్వభావత్వమునంజేసి యది శూన్యము.

ఈ మా మాటకు నిఃస్వభావత్వమువలన నిక్కముగా శూన్యత్వము సిద్ధమగుచున్నది. నిఃస్వభావత్వమునంజేసి యీ మా వచనము శూన్యమైనట్లే, నిఃస్వభావత్వమునంజేసి సర్వభావములు శూన్యములు.

"మీ మాటకు శూన్యత కలుగుటవలన సర్వభావములకు శూన్యత యుపపన్న మగుటలేదు," అని మీ చెప్పినది యుక్తముగాదు.

## లఘు టీక

ఇంతవఱకు శూన్యతావాదముపైం బ్రతిపక్షులు చెప్పిన దోషములు వివరింపంబడినవి. ఈ దూషణములలో నొక్కొక్కదాని నుటంకించి యార్య నాగార్జునులు ప్రత్యుత్తరము చెప్పుచున్నారు.

"సర్వభావములు నిఃస్వభావము లగుచో మీ మాటయు నిఃస్వభావమే. నిఃస్వభావ మగుటచే నది శూన్యము. శూన్యమగు మీ మాట భావముల స్వభావము నివారింపంజాలదు," అనునది మొదటి యాక్షేపము.

మా మాటకు హేతువు విడివిడిగా నున్న పృథివీ జల తేజో వాయువులందుంగాని, వీని కలయికలయందుంగాని లేదు. ప్రత్యయములగు వర్ణోత్పత్తి స్థానములందుంగాని, యుచ్చారణ యత్నమందుంగాని, యీ

రెంటియందుఁగాని లేదు. హేతు ప్రత్యయములను విడిచి వేఱుగాను లేదు. అహేతువునందును లేదు. కావున ఈ మాట స్వభావము లేనిది. స్వభావము లేనిది గావున నిది శూన్యము.

ఈ విధముగా మా మాటకు శూన్యత్వము సిద్ధించుచున్నది. మా మాటకు నిఃస్వభావత్వము దాని మూలమున శూన్యత్వము సిద్ధించి నట్లే, సర్వ భావములకు నిఃస్వభావత్వము, దాని మూలమున శూన్యత్వము సిద్ధించు చున్నవి.

మఱియు

ఈ ప్రతీత్య సముత్పన్న మెల్ల శూన్య
మనెడి వాక్యమ్ము వ్యాఖ్యాత మగునుగాత:-
ఈ ప్రతీత్య సముత్పత్తి నెసఁగు భావ
మెల్ల నిఃస్వభావ మగుచు నెసఁగుచుండు. ౨౨

శూన్యతార్థమును భావములను, భావముల యనవసాయ శూన్యతార్థమును దెలిసికొనక దూషింప దొరఁకొనుచున్నారు. "మీ వచనము శూన్య మగుటఁజేసి నిఃస్వభావ మగుచున్నది. నిఃస్వభావ మగుటచే, మీ వచనముచే భావములకు స్వభావ ప్రతిషేధోపపత్తి కలుగుట లేదు," అని మీ రనుచున్నారు.

భావముల భావము ప్రతీత్య సముత్పాదమై శూన్య మగుచున్నది గదా! ఏల? నిఃస్వభావత్వము వలన. ప్రతీత్య సముత్పన్నము లగు భావములు సస్వభావములు గావు. హేతు ప్రత్యయాపేక్షత్వము వలన నవి స్వభావాభావములు. స్వభావముచే నవి భావము లగు నేని, హేతు ప్రత్యయములు లేక యవి యుండ వలయును. కాని యట్లుండుట లేదు. కావున నవి నిఃస్వభావములు. నిఃస్వభావత్వమువలన నవి శూన్యము లని చెప్పఁబడుచున్నవి. ఇట్లే మా వచనము గూడ ప్రతీత్య సముత్పన్నత్వమునఁ జేసి నిఃస్వభావము. నిఃస్వభావత్వమునఁజేసి శూన్యము అని యుపపన్న మగుచున్నది. ప్రతీత్య సముత్పన్నత్వమునఁజేసి స్వభావ శూన్యము లగు రథ ఘట పటాదులు, కాష్ఠాహరణము, మృత్తికాహరణము, మధూదక

పయోధారణము, శీత వాతాతప పరిత్రాణము మున్నగాఁగల తమ తమ కార్యములందుఁ బ్రవర్తిలుచున్నట్లే, యీ మా వాక్యము ప్రత్యయ సముత్ప న్నత్వమునఁజేసి నిఃస్వభావ మగుచుఁ బ్రత్యయములకు నిఃస్వభావత్వ ప్రసాధన మగుచున్నది.

ఇట్లగుటచే, "మీ వచనమునకు నిఃస్వభావత్వమువలన శూన్యత్వము, శూన్యత్వము వలన సర్వభావ స్వభావ ప్రతిషేధము, ఉపపన్నము గాదు," అని మీ చెప్పినది యుక్తముగాదు.

## ల ఘు టీ క

మాట శూన్య మగుటచే, శూన్య మగు మాటవలన సర్వభావములకు శూన్యత సిద్ధించుట లేదని ప్రతిపక్షి యాక్షేపము. అతఁడు శూన్యతా లక్షణము నవగతము చేసికొనక పోవుటవలన ఆశంకలు, ఆక్షేపములు కనిపించుచున్నవి. కావున ముందు శూన్యతా లక్షణము సర్థము చేసికొన వలసి యున్నది.

ఉత్పాద స్థితి భంగములు గల ప్రతి వస్తువును హేతువు, ఆలంబ నము, సమనంతరము, అధిపతేయము అను ప్రత్యయములను బొంది కలుగు చున్నది. కార్య నిర్వర్తక మగు దానిని హేతు వందురు. అంకుర మను కార్యమును బీజము గలిగించును గావున, బీజ మంకురమునకు హేతు వగును. చిత్త చైత్తములకుఁ (జ్ఞానమునకు, మానసిక స్థితికి,) గారణ మగు విషయ సంబంధత ఆలంబన ప్రత్యయ మని చెప్పఁబడుచున్నది. కార్యోత్పత్తికి మున్నుగా నుండు కారణముయొక్క నిరోధము సమనంతర ప్రత్యయము. అంకురోత్పత్తికి మున్ను బీజ నిరోధము గలుగుచున్నది. బీజము లయము పొందిన తరువాతనే యంకురము గలుగుచున్నది. బీజ నిరోధ మంకుర మునకు సమనంతర కారణ మగుచున్నది. తన్ను వదలి యితరములకుఁ గారణ మగునది అధిపతి ప్రత్యయము. అనఁగా నెల్ల ధర్మము తనకంటె నన్యములగు ధర్మము లన్నిటికిఁ గారణ మగుచున్నది.

ఈ హేతు ప్రత్యయములను బొందక కలుగు భావము లేదు. భావమునకు స్వభావ మున్నచో, హేతు ప్రత్యయముల నపేక్షింప వలసిన

యవసరము లేదు. కావున హేతు ప్రత్యయములను బొంది కలుగునది నిఃస్వభావము. నిఃస్వభావ మగుట వలన నది శూన్యము.

హేతు ప్రత్యయములను బొంది కలుగు దానిని ప్రతీత్య సముత్పాద మందురు. ఇట్లు ప్రతీత్య సముత్పాద మగునది శూన్య మగుచున్నది. శూన్యత యనఁగా లేమి యని అర్థము గాదు. లేమి యనునది యునికి యట్లే హేతు ప్రత్యయములను బొంది కలుగుచున్నది. కావున నది నిఃస్వభావము. నిఃస్వభావ మగుటవలన నది శూన్యము. అనఁగా లేమియు నునికి యట్లే శూన్యము. శూన్యతకుఁ గూడ శూన్యతను జెప్పు శూన్యతను నర్థము చేసికొన వలయును.

అద్దములోఁ జూచిన ప్రతిబింబము కనఁబడును. చూడకున్నఁ బ్రతిబింబము కనఁబడదు. ఈ ప్రతిబింబము శూన్య మనుచున్నాము. ఇక్కడ శూన్య మను దాని కర్థ మేమి? ప్రతిబింబము లేనిదని యర్థము గాదు. అది సాపేక్షము. హేతు ప్రత్యయము లుండఁగా నది యుండును, లేకున్న నుండదు. ప్రతిబింబ ముండుట, లేకుండుట యనునవి వ్యవహారము వలన, అనఁగా హేతు ప్రత్యయములవలనఁ, గలుగుచున్నవి. శూన్యతా శబ్దము ఈ వ్యావహారికత్వమును ద్రోసివేయుటలేదు. మీఁదుమిక్కిలి దాని పారమార్థిక స్వరూపమును గూడ సూచించుచున్నది.

ప్రకృతమగు ప్రతిబింబముయొక్క పారమార్థికస్వరూప మేమి? శూన్యతయే. "శూన్యత యన నేమి? నైఃస్వాభావ్యము. నైఃస్వాభావ్య మన నేమి? తథత. తథత యన నేమి? తథాభావము: అవికారిత్వము, ఎల్లప్పుడు నుండుట, ఎల్లపుడు పుట్టుక లేకుండుట. అన్యాపేక్ష లేకుండుట చేతను, అకృత్రిమత్వముచేతను నది స్వభావమని చెప్పఁబడుచున్నది." ఈ శూన్యత సదసదుభయానుభయకోటి వినిర్ముక్తము. (భావము, అభావము, భావాభావము, తదనుభయము నను నాలుగు అంతములను (దృష్టులను) అధిగమించినది.)

ఈ యర్థమును దృష్టియం దిడుకొని ప్రతిపక్షి దోషములను బరిశీలింప వలసి యున్నది.

భావము లన్నియు హేతు ప్రత్యయములను బొంది కలుగుచున్నవి. కావున నవి ప్రతీత్య సముత్పన్నములు. ప్రతీత్య సముత్పన్నము లగుటచే నిఃస్వభావములు. నిఃస్వభావము లగుటచే నవి శూన్యములు.

రథము, ఘటము, పటము మున్నగునవి తమ తమ హేతు ప్రత్యయములను బొంది కలుగుచున్నవి. ఇవి పారమార్థికముగా శూన్యములు. అయినను రథము కట్టెలు, మట్టి మున్నగువానిని జేరవేయుచున్నది. ఘటము నీరు పాలు మున్నగువానిని నిల్వజేయుట కుపయోగపడుచున్నది. పటము శరీరమును గప్పి సీతువునుండి, యెండనుండి కాచుచున్నది.

అట్లే 'సర్వ భావములు శూన్యములు' అను మా వాక్యము గూడ హేతు ప్రత్యయములవలనఁ బుట్టి, వ్యావహారికముగా భావముల స్వభావత్వమును నిరాకరించు సాధన మగుచుఁ బారమార్థికముగ శూన్య మగుచున్నది.

కావున మా వచనము శూన్య మగుటవలన నది సర్వభావ స్వభావ నిరాకరణము చేయఁ జాల దనుట యుక్తము గాదు.

మఱియు

మాయచే నుద్భవించిన మనుజుఁ డెట్టు  
లితర మాయా మనుజు నివర్తించుచుండు,  
నట్టి రీతి నీ వ్యావర్తనార్థ మితర  
మైన ప్రతిషిద్ధ మర్థమ్ము నాచరించు. ౨౩

మాయాకల్పితుఁ డగు నొక మనుజుఁడు, మాయాకల్పితుఁడైన మఱియొక మనుజుని గమనాగమనాది వ్యాపారములను జూచి వాని నా వ్యాపారములనుండి మఱల్చునట్లే, మా వాక్యమును బ్రవర్తిల్లుచున్నది. ఇచట ప్రతిషేధ్యుఁడగు పురుషుఁడు శూన్యుఁడు. ప్రతిషేధించు పురుషుఁడును శూన్యుఁడు. ప్రతిషేధము శూన్యమే. ఇట్లే శూన్యమగు మా వచనముచే సర్వభావముల స్వభావ ప్రతిషేధ ముపపన్న మగుచున్నది.

(2) ప్రతిజ్ఞా హాని లేదు —

"మీ వచనము శూన్యమగుటఁజేసి సర్వభావ స్వభావ ప్రతిషేధము ఉపపన్నము గాదు," అని మీ చెప్పినది యుక్తముగాదు. మీరు చేసిన

షట్కోటిక వాదము ఇట్లే ప్రతిషిద్ధ మగుచున్నది. ఇట్లగుచుండఁగా "మీ వచనము సర్వభావాంతర్గతము గాదు; శూన్యము లేదు; సర్వభావ ములు నశూన్యములు," అనుచు మీ రిట్లు చెప్పియున్నారు :—

"పైఁగ మీ వాక్కు సస్వభావ మ్మటంచు
నాలకించి మీదు ప్రతిజ్ఞ హానినిఁ బొందు;
వైషమిక దోష మద్దానఁ బ్రాప్త మయ్యె;
కాన హేత్వంతరమ్ము వక్తవ్య మగును."

## లఘు టీక

ఆర్య నాగార్జునులు ఇంతకు మున్ను చెప్పిన దానిని దృష్టాంత పూర్వకముగ వివరించుచున్నారు.

మాయా పరికల్పితుఁ డగు పురుషుఁడు మాయా పరికల్పితుఁ డగు మఱియొక మానవుఁడు రాక పోకలు సాగించుచుండఁగాఁ జూచి వాని నా వ్యాపారములనుండి నివారించును. అట్లే హేతు ప్రత్యయములను బొంది పొడమిన మా వాక్యము, హేతు ప్రత్యయములను బొంది పొడమిన భావముల స్వభావమును నివారించుచున్నది. పారమార్థికముగ నిషేధించు పురుషుఁడు లేఁడు. నిషేధింపఁబడుచున్న వాఁడును లేఁడు. నిషేధ మును లేదు. అట్లే పారమార్థికముగా మా వాక్యము లేదు. మా వాక్యము సేయుచున్న నివారణము లేదు. నివారిత భావమును లేదు. కాని వ్యావహారికముగా మాత్రమే మా వాక్యము, అది సేయు నివారణము, నివారింపఁబడుచున్న భావములు గలవు.

మా వాద మిట్టి దైనపుడు భావ స్వభావ నిరాకరణ వాద మెట్లు సిద్ధించుట లేదు ? మీరు చూపిన యాటు దోషము లెట్లు నిలుచును ? ఇక్కడఁ గూడ మేము చెప్పుచున్నాము:—

వాక్య మియ్యది యస్వభావమ్మ యగును;
దీనిచే మాకు వాదమ్ము హాని లేదు;
వైషమిక దోషమునకు సంప్రాప్తి లేదు;
కాన హేత్వంతర మ్మువక్తవ్య మగును. ౨౪

మా వచనము ప్రతీత్య సముత్పన్నత్వమునఁజేసి, స్వభావోపపన్నము గాదు. ఇది యెట్లో పూర్వమే చెప్పియుంటిమి. స్వభావముచే నుపపన్నము గాకపోవుటంజేసి, మా వాక్యము శూన్యము. ఈ మా మాట శూన్యమైనట్లే తక్కుంగల సర్వ భావములు శూన్యములు. కావున వైషమిక దోషము లేదు. "ఈ వచనము మాత్రము శూన్యముగాదు. తక్కుంగల భావము లన్నియు శూన్యములు," అని మేము చెప్పుచుంటి మేని వైషమికత్వము గలుగును. కాని యట్లు చెప్పుట లేదు. కావున వైషమికత్వము లేదు. ఇట్లగుటచే మేము విశేష హేతువును జెప్ప నక్కఱ లేదు.

కావున, "మీ వాదమునకు హాని, వైషమికత్వ దోషము గలుగుచున్నవి. మీచే విశేష హేతువు వక్తవ్య మగును," అని మీ చెప్పినది యుక్తము గాదు.

## లఘు టీక

ఇప్పుడు రెండవ యాక్షేపము నాచార్యులు ప్రత్యుత్తరించుచున్నారు:—

"మీ వాక్యము సస్వభావ మైనపుడే, 'సర్వ భావములు నిఃస్వభావములు' అనునది సిద్ధింపఁగలదు. అట్లు చెప్పినచో, మీ ప్రతిజ్ఞయే భగ్న మగును. ఏల యన, "సర్వ భావములు శూన్యములే కాని మా వాక్యము మాత్రము అశూన్య," మనుట సంభవించుచున్నది. ఇట్లు కొన్ని భావములు శూన్యములు, మఱి కొన్ని భావము లశూన్యములై వైషమ్యము పొడముచున్నది. ఈ వైషమ్యము పరిహరించుటకు వేఱు హేతువును జెప్పవలసి యున్నది," అనునది రెండవ యాక్షేపము.

మా వచనము హేతు ప్రత్యయములను బొంది పుట్టిన దగుటచే నిఃస్వభావము. నిఃస్వభావ మగుటచే శూన్యము. ఈ విషయ మిదివఱకే చెప్పియున్నాము. మా వాక్యము నిఃస్వభావ మగుటచే శూన్య మైనట్లే, సర్వ భావములు నిఃస్వభావము లగుటచే శూన్యములు. ఇట్లు సర్వభావ

ములు శూన్యము లగుచున్నవే కాని, కొన్ని శూన్యములై మఱి కొన్ని యశూన్యము లగుట లేదు. కావున వైషమికత్వము గలుగుట లేదు. కావున హేత్వంతరము చెప్ప నక్కఱ లేదు.

పైఁగా మీ రిట్లు చెప్పియున్నారు :—

"మాట లాడకు మన్నట్టి మాడ్కి యిదియు
నగు నటన్నది మీ బుద్ధి యగున యేని,
యది యయుక్తమ్ము; సత్తైన పదముచేతఁ
బొడమ నున్నట్టి శబ్దమ్ము కెడయఁ గలదు."

ఇక్కడ మేము చెప్పుచున్నాము:—

"మాట లాడకు మన్నట్టి మాడ్కి యిదియు
నగు," నటన్నది మీదు దృష్టాంత మగును;
"శబ్ద మిద్దానిచేత ఆ శబ్ద పరిని
వర్తనం బగు," నని మేము పలుక లేదు. ౨౫

ఇది మా దృష్టాంతము గాదు. 'శబ్దము సేయకుము,' అని పలుకుచు శబ్దము సేయుచు నే శబ్దమును బ్రతిషేధించుచున్నాఁడు. అట్లే శూన్యమగు వచనముచే శూన్యతను బ్రతిషేధించుట లేదు. కారణ మేమి? ఈ దృష్టాంతమునందు శబ్దముచే శబ్దము వ్యావర్తింపఁ బడుచున్నది. ఇది యట్లు గాదు. "సర్వ భావములు నిఃస్వభావములు. నిఃస్వభావత్వము వలన నవి శూన్యములు," అని చెప్పుచున్నాము.

## లఘు టీక

ఇప్పుడు మూఁడవ పద్యమునందలి యాక్షేపమునకుఁ బ్రత్యుత్తర మొసఁగఁబడుచున్నది.

'మాటాడకుము' అని చెప్పి యొకఁడు ఉత్తరకాలమున శబ్దమును బొడమకుండఁ జేయునట్లే 'సర్వభావములు శూన్యము' లను మాటచే సర్వభావ స్వభావ నిరాసము మేము సాధించుచుంటి మని ప్రతిపక్షి తలంచుచున్నాఁడు. ఈ దృష్టాంతము ప్రతిపక్షి గల్పించుకొన్నదే కాని

మాది కాదు. ఏలయన ఆ దృష్టాంతమందు ఉన్న శబ్దముచే రాఁగలశబ్దము నివారిత మగుచున్నది గాని, శూన్యమగు వచనముచే సర్వభావ స్వభావము నివారిత మగుచుండుట లేదు. మేము అట్లుగాక సర్వభావములు ప్రతీత్య సముత్పన్నము లగుటచే నిఃస్వభావము లనియు, నిఃస్వభావము లగుటచే శూన్యము లనియుఁ జెప్పుచున్నాము.

ఏల యన,

> నిఃస్వభావ వాక్యమ్ముచే నిఃస్వభావ
> తా నివర్తనం బగు నేని, తన్నివృత్తి
> యందు సద్భావ సముదయమ్మునకును
> జేకుఱును గాదె స్వాభావ్య సిద్ధి యెంచ. ౭౭

'శబ్దము సేయకుము,' అని శబ్దముచే శబ్ద వ్యావర్తనము కావింపఁ బడుచున్నది. నైఃస్వాభావ్య మగు వచనముచే నైఃస్వాభావ్యములు ప్రతిషే ధింపఁబడు చున్న నేని, యీ దృష్టాంత ముపపన్న మగును. కాని ప్రకృతము ననో నైఃస్వాభావ్య మగు వచనముచే భావముల స్వభావ ప్రతిషేధము గావింపఁబడుచున్నది. నైఃస్వాభావ్య మగు వచనముచే నిఃస్వభావముల నైఃస్వాభావ్యము ప్రతిషేధింపఁబడుచున్న దేని, నైఃస్వాభావ్య ప్రతిషే ధము వలన నే భావములు సస్వభావము లగును. స్వస్వభావము లగుట వలన నవి యశూన్యము లగును. కాని మేము భావముల శూన్యతను జెప్పుచున్నాము కాని, యశూన్యతను జెప్పుట లేదు. ఈ విధముగా మీ రిచ్చినది దృష్టాంతము గాదు.

## లఘు టీక

పైఁగాఁ బ్రతిపక్షి దృష్టాంతము కేవలము విపరీతార్థమును మా కంటఁగట్టుచున్నది. 'మాటలాడకుము' అన్న నిఃస్వభావ వచనముచే నిఃస్వభావముల నిఃస్వభావతను నిరాకరించుట యగుచున్నది. దీనివలన భావములు సస్వభావము లగును. మేము భావములు నిఃస్వభావము లని చెప్పుచున్నాము కాని, సస్వభావము లనియు, నశూన్యము లనియు మేము చెప్పుట లేదు. ఈ దృష్టాంతము మా దృష్టాంతము గాదు.

కల్పితాంగనా రమణీయ కాయ దర్శ
నమ్ముచే నుద్భవించు మోహమ్ము ఘనము
భవ్యపురుష నిర్మితకుండు ప్రతిహతమ్ము
సేయునట్టులే యిది యంచుఁ జెప్పవలయు. ౨౭

తథాగతునిచేఁగాని, తచ్ఛ్రావకునిచేఁగాని నిర్మితుఁడైన యొక పురుషునకు నిర్మిత శరీరయు, స్వభావశూన్యయు నగు స్త్రీయందు నిక్కముగా స్త్రీ యను నసంగ్రాహము గలుగును. ఆ యసంగ్రాహము వలన నతని కామెయందు రాగము గలుగును. ఆ రాగము తథాగతాధిష్ఠానముచేఁగాని, తథాగత శ్రావకాధిష్ఠానముచేఁగాని వాని యసంగ్రాహము నివర్తిత మగును. అట్లే నిర్మిత కోపమ మగుచు శూన్య మగు నా వచనముచే నిర్మితక స్త్రీ సాదృశ్యము లగు సర్వభావ నిఃస్వభావములందుఁ గలుగు స్వభావ గ్రాహము నివర్తింపఁబడుచున్నది. కావున నీ దృష్టాంతము శూన్యతా ప్రసాధనమును బ్రత్యుపపాదించుచున్నది.

## లఘు టీక

మాధ్యమక సిద్ధాంతానుగుణమైన దృష్టాంత మిప్పుడు చూపఁబడుచున్నది.

మాయా కల్పిత స్త్రీని జూచి యామె యథార్థ మని భావించినవాని కామెయందు రాగము గలుగును. తథాగతుఁడు గాని, శ్రావకుఁడు గాని మాయాపురుషుని సృష్టించును. ఆ మాయాపురుషునిచే రాగము నివారిత మగును. మాయా స్త్రీ సదృశములు భావములు. వ్యామోహు లగు జీవులకు భావములందుఁ గలుగు సస్వభావతా జ్ఞానమును తథాగ తాది పరికల్పిత పురుష తుల్యము, శూన్యము నగు మా వచనము నివారించుచున్నది. ఇట్లీ దృష్టాంతము శూన్యతను సిద్ధింపఁజేయుచున్నది.

ధ్వనికి సత్త లేమివలన నీ హేతువు
సాధ్య సమమె యగును; సంవృతమ్ము
వ్యావహారికమ్ము ప్రత్యాఖ్య మొనరింప
కుండ, మేము చెప్పుచుంటి మిట్లు. ౨౮

'మాట లాడకు మన్నట్టి మాడ్కి' అని చెప్పుచున్న యీ హేతువు సాధ్య సమము. ఏల యన, నీ దృష్టాంతమున సర్వభావములకు నైఃస్వాభావ్య అవిశిష్టత్వ మేర్పడుచున్నది. కాని ప్రతీత్య సముత్పన్నమగుటచే సాధ్వనికి స్వభావ సత్త లేదు. స్వభావ సత్తప నునికి లేకపోవుటచే 'ఇప్పుడు ఉన్న శబ్దముచే భవిష్య శబ్దమునకు వారణము' అన్నది వ్యాహత మగుచున్నది. పైఁగా మేము వ్యవహార సత్యము ప్రతిషేధించి సర్వ భావములు శూన్యము లని చెప్పుట లేదు. వ్యవహార సత్యమాశ్రయింపక ధర్మము బోధింప శక్యము గాదు. కావుననే కదా

"వ్యావహారికార్థ సమాశ్రయమ్ము లేక
పరమ మానట్టి యర్థమ్ము కలుపఁబడదు
పరమమానట్టి యర్థమ్ము నెఱుఁగకుండఁ
బరమ నిర్వాణపదమును బడయరాదు,"

అని వేఱొకచోఁ జెప్పియున్నాము. కావున మా వచనము వలెనే సర్వభావములును శూన్యములు. సర్వ భావములకును నిఃస్వభావత్వము రెండు తెఱంగుల నుపపన్న మగుచున్నది.

## లఘు టీక

"మాటాడకుము," అని మఱొకని మాట వారించుట యను దృష్టాంతమునందలి హేతువు సాధ్య సమము. ఏల యన నన్యుని మాట నిరాకరించుటకు హేతువు 'మాటాడకుము,' అనునది. "ఇది యున్నది, దీనివలన నన్య శబ్ద వారణము జరుగుచున్నది," యని ప్రతిపక్షి తలంచు చున్నాఁడు. 'ఇది యున్నది,' యనునది ముందు రుజువు కావలసి యున్నది. ఇట్లు ప్రతిపక్షి దృష్టాంతమందలి హేతువు సాధ్య సమ మగుచున్నది. ఏల ? సర్వ భావములు నిఃస్వభావత లేనివి గావు. ప్రతీత్య సముత్పన్న మగుటచే ధ్వనికి స్వభావ సత్త లేదు. స్వభావమునకు సత్త లేకపోవుట వలన 'మాటాడకుము,' అన్న శబ్దము ఉండి, రాఁగల శబ్దమును వారించుచున్నది, యనుట స్వవచన బాధక మగుచున్నది.

అట్లగుచో 'మాటాడకుము' అనుటయు దానితో నిశ్శబ్దత యేర్పడు టయు లోకమునఁ జూచుచున్నారము గదా ! యను ప్రశ్నము పొడ

మును. మాధ్యమికులు వ్యవహార సత్యమును త్రోసివేయుట లేదు. వ్యవహార సత్యమును త్రోసిపుచ్చినచోఁ బరమార్థము బోధింప శక్యముగాదు. పరమార్థము నెఱుఁగక నిర్వాణము పొందరాదు.

కావున మా వచనము వలెనే సర్వభావములు శూన్యము లనియు, నిఃస్వభావము లనియు సిద్ధించుచున్నది.

వెండియు మీరు

"ప్రతిషేధ ప్రతిషేధ్యం
బు తెఱఁగు నిట్టిద యటంచుఁ బొడనూపిన, నా
చితి కది దూరం; బిటు మీ
ప్రతిజ్ఞ లాక్షణిక దోష పరతం బోవున్,"

అని చెప్పియున్నారు. ఇక్కడ మే మిట్లు చెప్పుచున్నాము:—

కొండొక ప్రతిజ్ఞ యనుచు మా కుండె నేని
యిట్టి దోషమ్ము మా కావహిల్లఁగలదు;
లేదు మాకుఁ బ్రతిజ్ఞ, యీ లేమివలన
నెట్టి దోషమ్ము మా కావహిల్లఁ బోదు. ౨౯

మాకుఁ బ్రతిజ్ఞ యొకటి యున్నచో దానివలన మాకుఁ బ్రతిజ్ఞా లక్షణము ప్రాప్తించును. దానివలనఁ దొల్లిటి దోషము గలుగును. భావము లెట్టి వని మీరు చెప్పియున్నారో మాకును నట్టివే యయ్యెడివి. మాకుఁ బ్రతిజ్ఞ లేదు. కావున సర్వభావములును శూన్యములు, నత్యంత శాంతములుఁ బ్రకృతి వివిక్తములు నగుచుండఁగాఁ బ్రతిజ్ఞ యెట్లు కలుగును? ప్రతిజ్ఞా లక్షణ ప్రాప్తి యెట్లు గలుగును? ప్రతిజ్ఞా లక్షణ ప్రాప్తి కృతమగు దోష మెట్లు పొడమును?

## (3) ప్రమాణాసిద్ధి

(క) పరతః ప్రమాణ సిద్ధి కలుగుట లేదు. "ప్రతిజ్ఞా లక్షణ ప్రాప్తిత్వమునఁ జేసి మీకే దోషము," అని చెప్పినది యుక్తము గాదు.

మీరు రెండియు నిట్లంటిరి :—

"భావములను బ్రత్యక్షానc బడసి పరిని
వర్తితమ్ములc గావించు వాcడ వేని,
యా ప్రమాణమ్ము లేనిదే యగును గాన
భావములు వేనిచేత లభ్యమ్ము అగును?"

"ఇంద్రియకముచే ననుమాన మాగమోప
మానములు మూcడు ప్రత్యుక్తి మానితములు;
తదనుమా నాగమ ప్రసాధ్య మగు నర్థ
సమితి దృష్టాంతమునc గూడ సాధ్య మగును,"

లఘుటీక

ఇప్పుడు నాల్గవ పద్యమునకు సమాధాన మొసcగcబడుచున్నది.

మాకుc బ్రతిజ్ఞ యొకటి పారమార్థికముగా నున్నచోc బ్రతిజ్ఞ యను భావ మున్న దగును. ప్రతిజ్ఞకు నప్పుడు ప్రతిజ్ఞా స్వభావ ముండును. అనcగా భావమునకు స్వభావ ముండును. అప్పుడు ప్రతిపక్షి చెప్పిన దోషము గలుగును. మాధ్యమికులకు భావములు నస్వభావములు, నశూన్యములు నయ్యెడివి. కాని వారికిc బారమార్థికముగాc బ్రతిజ్ఞ యొకటి లేదు. సర్వ భావములు ప్రకృతి (స్వభావము) లేనివై శాంతములై శూన్యము లగుచుండcగాc బ్రతిజ్ఞ కలుగు టెట్లు? అద్దాని లక్షణము గలుగు టెట్లు? ఆ లక్షణము గలుగుటచేc గలిగిన దోషము గలుగు టెట్లు?

ఇక్కడ మే మిట్లు చెప్పుచున్నాము :—

అల ప్రమాణమ్ము వలన రవ్వంత యైనc
బ్రాపణీయమో, కాక ప్రవర్తనీయ
మో, నివర్తనీయమ్మొ మా కున్న వేళ
దోష మగు; నది లే దింక దోష మెట్లు? 30

ప్రత్యక్షానుమా నోపమా నాగమము లను నాలుగు ప్రమాణము లచేc గించి దర్థ మేని మేము పొందుదు మేని, లేదా, యా నాల్గింటిలో

నొకదానివలన మఱి యొకటి పొందుదు మేని, లేదా, యా ప్రమాణములచే నే కొంచె మర్థ మైనఁ బ్రవర్తింపఁజేయు వారలమో, నివర్తింపఁజేయు వారలమో యగుదు మేని మీ చెప్పినట్లే యగును. కాని మేము ఏ కొంచెమగు నర్థమును బొందుటలేదు. కావున మేము ప్రవర్తిలఁజేయు వారలము గాము. నివర్తిలఁజేయు వారలము గాము. కాని మీరు మాత్రము, "ప్రత్యక్షాదులలో నొకదానిచే మీ రర్థమును బొంది భావము లను నివర్తిలఁజేయుచున్నా రేని ప్రమాణ మున్నదగుచున్నది," యనుచు దోషము చూపితిరి.

నిజముగ మీచేఁ జెప్పఁబడిన ప్రమాణములు లేవు. ఆ ప్రమాణములచేఁ బొందఁదగిన యర్థము లేని లేవు. కావున మీరు చెప్పిన దోష మదోష మగుచున్నది.

## లఘు టీ క

ఇప్పుడు 5, 6 పద్యములకుఁ బ్రత్యుత్తర మొసంగఁ బడుచున్నది.

పొందఁ దగినది యున్న దని కాని, లేదని కాని చెప్పఁదగిన యర్థ మేదేని యున్నచోఁ బ్రమాణములు గావలసివచ్చును. అట్టి యర్థ మున్నను లేకున్నను, బ్రమాణము లావశ్యకములే యగును. కాని యునికి, లేమి యనునవి గూడ సాపేక్షము లగుటవలన శూన్యములు. కావునఁ బొందఁ దగిన యర్థము గాని, ప్రవర్తింపఁ జేయఁదగిన యర్థము గాని, నివారింపఁ దగిన యర్థము గాని లేదు. కావునఁ బూర్వపక్షి చూపుచున్న దోషము నకే తావు గలుగుట లేదు. పారమార్థికముగాఁ బ్రమాణములు లేవు. ప్రమాణములచేఁ బొందఁదగిన యర్థములును లేవు.

## మ ఱి యు

ఆ ప్రమాణమ్ములవలన నర్థములకు
సిద్ధి చేకూరు నని నీవు చెప్పెదేని,
మఱల నా ప్రమాణములకుఁ బరగు నెట్లు
సిద్ధి యొక్కింత మాకు వచింపవలయు. 31

మానములచే మేయములకు వలెఁ బ్రమాణముచే నా ప్రమేయములకు సిద్ధి యగు నని తలంతు రేని, యా ప్రత్యక్షానుమా నోపమా నాగమ ప్రమాణ చతుష్టయమునకుఁ బ్రసిద్ధి యెట్లు గలుగును ? నిః ప్రమాణములకుఁ బ్రమాణ మగు నేని మొదటి దానికి సిద్ధి గలుగదు. ఇట్లే నడిమిదానికి, తుది దానికి సిద్ధి గలుగదు. అన్య ప్రమాణములచేఁ బ్రమాణ ప్రసిద్ధి, ప్రమాణమువలన నర్థములకుఁ బ్రసిద్ధి కలుగు నని తలంతురేని, మీ ప్రతిజ్ఞ భగ్న మగుచున్నది. అట్లైనను

లఘు టీక

ఇప్పు డాచార్యులు ప్రమాణ తత్త్వమును బరిశీలించుచున్నారు. ఏల యన నీ ప్రమాణములను బురస్కరించుకొని దర్శనము లొండొంటిని డీకొనుచున్నవి. అంతియ కాక శూన్యతా వాదముపై విఱుచుకొని పడి దూషించుచున్నవి. తత్త్వము మాటు పఱుచుచున్నవి.

ఎఱుకకు సాధన మైనది ప్రమాణము. ఎఱుఁగఁ దగినది ప్రమేయము, కొలతబద్ద వలన వస్తువు పరిమాణము నెఱుఁగుచున్నట్లే ప్రమాణమువలన ప్రమేయమును దెలిసికొనుచున్నా మని భావించుచున్నాము. కావి యీ ప్రమాణ మెట్టు లెఱుఁగఁబడుచున్నది ? ప్రమాణమునకుఁ బ్రామాణ్య మెట్లు సిద్ధించుచున్నది ? ప్రమాణరహితముగానే ప్రమాణము సిద్ధించు నన్న స్వవచన వ్యాఘాతము గలుగును. ఇట్లు ప్రమాణమే సిద్ధించుట లేదు. ప్రమాణమే సిద్ధింప నపుడు ప్రమేయములును సిద్ధింపవు.

అన్యమగా ప్రమాణములచే నగున యేని
తత్ప్రమాణ సిద్ధి, యనవస్థ ఘటిల్లు;
దానిచే నాది గాని, మధ్యమ్ము గాని,
యంతమును గాని సంసిద్ధి నందఁబోదు. 32

ప్రమాణములచేఁ బ్రమేయములకుఁ బ్రసిద్ధి, యా ప్రమాణములకు నన్యములైన ప్రమాణములచేఁ బ్రసిద్ధి కలుగు నని తలంతురేని, దానివలన ననవస్థా ప్రసంగ మేర్పడుచున్నది. అనవస్థా ప్రసంగమందు దోష మేమని యందురా ?

దానిచే నాది గాని, మధ్యమ్ము గాని,
యంతమును గాని సంసిద్ధి నందఁబోదు.

ఈ యనవస్థా ప్రసంగమందు ఆదికి సిద్ధికలుగుట లేదు. కారణ మేమి? ఆ ప్రమాణములకుఁ గూడ నన్య ప్రమాణములచే సిద్ధి యగును. ఆ యన్యములకు వలెనే యా యన్య ప్రమాణములకు, మఱి యన్యములచేత సిద్ధియగును. ఇట్లు ఆది లేక పోవుచున్నది. ఆది లేకపోవుటవలన మధ్యము నకు, నంతమునకు నెట్లునికి యేర్పడఁగలదు? కావున ఆ ప్రమాణములకు నన్యములగు ప్రమాణములచేఁ బ్రసిద్ధి కలుగునని చెప్పిన యర్థమునకు నుప పత్తి గలుగుట లేదు.

లఘు టీక

ప్రమేయములు ప్రమాణములవలన సిద్ధించుచున్నవి. 'ఈ ప్రమా ణము లితర ప్రమాణములవలన సిద్ధించుచున్నవి' యని చెప్పుచో, నొక ప్రమాణమునకు మఱియొక ప్రమాణము, దానికి వేఱొక ప్రమాణము గావలసివచ్చును. ఇట్లు అనవస్థా దోషము గలుగును. దీనివలన నాది సిద్ధింపదు. ఆది సిద్ధింప నపుడు మధ్యముగాని, అంతముగాని సిద్ధింపదు.

ఏ ప్రమాణమ్ములును లేకయే ప్రమాణ
సిద్ధి యనఁగ వాదమ్ము నశించిపోవు;
వైషమిక దోష మద్దానఁ బ్రాప్త మగును.
కాన హేత్వంతరమ్ము వక్తవ్య మగును. 33

ఆ ప్రమాణములకుఁ బ్రమాణము లేకయే ప్రసిద్ధి యనియుఁ, దిరిగి ప్రమేయార్థములకుఁ బ్రమాణములచేఁ బ్రసిద్ధి యనియు మీరు తలంపవచ్చును. అట్లగుచో నర్థములకుఁ బ్రసిద్ధి ప్రమాణములచే నగునను మీ వాదము భగ్నమగుచున్నది. వైషమికత్వమును గలుగుచున్నది. ఎట్లనఁ గొన్ని యర్థములకుఁ బ్రమాణములచే సిద్ధి యగుటయు, మఱికొన్నిటికిఁ గాకపోవు టయు సంభవించుచున్నది. కొన్ని యర్థములకుఁ బ్రమాణములచే సిద్ధి కలుగుటకును, మఱిగొన్నిటికిఁ గలుగకపోవుటకును దగిన విశేష హేతువు

చెప్పియుండవలయును. కాని యట్టి హేతువు నుపదేశించి యుండలేదు. కావున మీ కల్పనయు ననుపపన్న మగుచున్నది.

(ఖ) అగ్నివలె స్వతః ప్రమాణము గాదు.

ఇక్కడ మీ రిట్లు చెప్పవచ్చును:— "మాకుఁ బ్రమాణములు స్వాత్మమును, బరాత్మమును బ్రసాదించుచున్నవి. ఎట్లన—

లఘుటీక

"ప్రమాణములు ఇతర ప్రమాణములను గోరకయే సిద్ధించుచున్నవి. ప్రమాణములవలనఁ బ్రమేయములు సిద్ధించుచున్నవి," యని చెప్పఁగాఁ గొన్ని నిఃప్రమాణములు, మఱికొన్ని సప్రమాణము లగుట సంభవించును. ఈ విధముగా విషమత్వ మేర్పడును. ఈ వైషమ్యమునకు విశిష్టహేతువు చెప్పవలసియున్నది. అది చెప్పఁబడలేదు. కావున నీ వాదము యుక్తము గాదు.

అగ్నిహోత్రమ్ము స్వాత్మ పరాత్మ యుగము
భాసమానమ్ము గావించు పగిదిఁ దత్ప్ర
మాణ తతి స్వపరార్థ యుగ్మకము పూర్ణ
సిద్ధి పొందించుచున్నట్లు చెప్పవచ్చు. 34

ఇట్టి యుపదేశము వలెనే ప్రమాణములే తమ్ముఁ, బరాత్మమును బ్రసాధించుచున్నవి. అగ్ని తన్నుఁ బరాత్మమును బ్రసాధించుచున్నట్లే, ప్రమాణములును దమ్ముఁ బరాత్మమును బ్రసాధించుచున్నవి.

లఘుటీక

అగ్ని తన్నుఁ గానిపించుకొనుచు నితర వస్తువులను గానిపించు చున్నట్లే, ప్రమాణములు గూడఁ దమ్ముఁ దాము కానిపించుకొనుచుఁ బ్రమేయములను గానిపించుచున్నవి యని చెప్పవచ్చును.

ఇక్కడ మేము చెప్పుచున్నాము :—

విషమ మీ యుపన్యాసమ్ము, వీతిహోత్రుఁ
డాత్మ భాసమ్ము గూర్చువాఁ డగుట లేదు;

అంధకారమందు ఘటము ననుపలబ్ధి
యట్లు జ్వాలను ననుపలబ్ధి యరయరాదు. 35

మీ యుపన్యాసము విషమమే యగుచున్నది. ఏలయన "నగ్నివలెం బ్రమాణములు స్వాత్మను బ్రసాధించుచున్నవి. పరాత్మములను గూడ ప్రసాధించు చున్నవి," యని చెప్పుచున్నారు. అగ్ని తన్నుం దాను బ్రకాశింపంజేసికొనుట లేదు. ముందుగాం జీకటియందు నగ్నిచే నప్రకాశిత మగు సంభము పొందంబడుట లేదు. ఉత్తర కాలమందు అగ్నిచేం బ్రకాశిత మగుచు నది పొందంబడుచున్నది. ఇట్లగు నేని అగ్నిచేం బ్రకాశితము గానపుడు మున్నుగా నగ్ని చీంకటియందుండి యుత్తర కాలమునం బ్రకాశనము పొందవలయును. అట్లైనం దన్నుం బ్రకాశింపం జేసికొనం గలదు. ఇట్లు సంభవించుట లేదు. కావున ఈ కల్పనయుం బొసంగదు.

## లఘు టీక

ఈ వచన మెగుడు దిగుడుగా నున్నది. ఏల యన, అగ్ని తన్నుం దాను గానిపించుకొనుటలేదు. కానిపించుకొనునది యగునేని, యున్న ఘటము చీకటియందుం గనంబడనట్లే, యగ్ని చీకటియందును గనంబడక పోవలయును. కావున అగ్ని తన్నుం దాను గానిపించుకొను ననుట పొసంగదు.

## మతియు

స్వాత్మ పరములు రెండు హుతాశనుండు
భాసిలంగం జేయు నని నీవు పలికె దేని,
పర పదార్థములను గాల్చివైచు నగ్ని
స్వాత్మ దాహమ్ము గావింప నగును గాదె? 36

మీరు చెప్పునట్లు అగ్ని పరాత్మమును బ్రకాశింపం జేయునట్లే తన్నుం గూడం బ్రకాశింపం జేసికొను నేని, పరాత్మమును దహించునట్లే యగ్ని స్వాత్మమును గూడ దహింపవలయును. ఇట్లు సంభవించుట లేదు.

కావునం బరాత్మమును వలె స్వాత్మమును గూడ నగ్ని ప్రకాశింపం జేయుననుట యుక్తము గాదు.

లఘుటీక

అగ్ని తన్ను నితర వస్తువులను గానిపించుననుచో, నగ్ని యితర వస్తువులను దహించుచున్నట్లే తన్నుగూడ దహించుకొనవలయును.

స్వాత్మ పరములు రెండు హుతాశనుండు
భాసిలంగఁ జేయు నని నీవు పల్కెదేని
యంధతమసమ్ము నట్టులే స్వాత్మ పర ప
దార్థ యుగళమ్ము గ్రమ్మివేయంగ వలయు. 36

మీరు తలంచినట్లు స్వాత్మ పరాత్మముల రెంటిని నగ్ని ప్రకాశింపఁ జేయునది యగునేని, నిజముగఁ దత్ప్రతిపక్షభూతమగు తమము గూడ స్వాత్మ పరాత్మముల రెంటిని గప్పివేయవలయును. ఇది యిష్టము గాదు. కావున నగ్ని స్వాత్మ పరాత్ముల రెంటిని బ్రకాశింపఁజేయు ననుట యుక్తము గాదు.

లఘుటీక

అగ్ని తన్ను, నితర వస్తువులను గానిపించునేని, దాని విరోధి యగు చీకటి గూడఁ దన్ను నితర వస్తువులను గప్పి కానిపింపక పోవలయును. ఇది సమ్మతము గాదు.

మటియు

అగ్నియందుఁగాని, యది యున్నయెడఁగాని
యంధకార మద్ది యమరఁబోదు;
జ్వలన మెట్లు స్వాత్మ భాసమ్ము గావించు ?
ఆ ప్రకాశము తిమిరారి గాదె ? 37

అగ్నియందుఁ జీకటి లేదు. అగ్ని యున్నచోటను జీకటి లేదు. ప్రకాశ మనునది చీకటికి ప్రతిఘాతము. ఇట్టి చీకటికి నగ్ని స్వాత్మ పరాత్మ ప్రకాశహేతు వగు ప్రతిఘాత మెట్లు కలిగించుచున్నది ?

మీ రిట్లు చెప్పవచ్చును :— "అగ్నియందుఁ జీకటి లేదు. అగ్ని యున్నచోటఁ జీకటి లేదు. స్వ పరాత్మముల రెంటిని నగ్ని ప్రకాశింపఁ

జేయుటయు లేదు. ఆ యుత్పద్యమానమగు నగ్నిచేఁ జీకటికిఁ బ్రతిగ్రహ మెట్లు గలుగును? కావున నగ్నియందుఁ జీకటి లేదు. అగ్ని యున్న చోటను జీకటి లేదు. కావునఁ బుట్టుచునే యగ్ని తన్ను బరాత్మమును బ్రకాశింపఁ జేయుచున్నది.''

## లఘు టీక

అగ్నియందుఁ జీకటి లేదు. అగ్ని యున్నచోటను జీకటి లేదు. కావున వెలుఁగు చీకటులు ప్రతిద్వంద్వులు. వెలుఁగు పాత్రమును గానిపించుచున్న దనఁ జీకటిని దొలఁగించి కానఁజేయుచున్నది. వెలుఁగు తన్నుఁ గానిపించుకొనుచున్నచోఁ జీకటిని బాపి తన్నుఁ గానిపించుకొనవలయును. తొలఁగింపనగు చీకటి లేనపుడు తన్నుఁ గానిపించుకొనుట లే దని తెల్ల మగుచున్నది.

ఈ సందర్భమున అగ్ని పుట్టుచునే తన్ను, నితరవస్తువులను గానిపించుచున్న దని చెప్పవచ్చును.

ఇక్కడఁ జెప్పుచున్నాము:—

జాయమాన మగుచు జ్వలనమ్ము భాసిల్లఁ
జేయు ననుట సుంత చెల్లఁబోదు;
జాయమాన మగుచు జ్వలనమ్ము సంతమ
సమ్ము పొందు టెట్లు సాధ్యమగును? 38

పుట్టుచునే యగ్ని తన్నుఁ బరాత్మమును, బ్రకాశింపఁజేయు నను వాదము పొసఁగదు. ఏల? పుట్టుచునే యగ్ని చీకటిని దఱియుట లేదు. తఱియక పోవుటవలన దానిని నశింపఁ జేయుట లేదు. చీకటికి నుపఘాతము లేక పోవుటవలనఁ బ్రకాశము లేని దగుచున్నది.

## లఘు టీక

ప్రతిపక్షికల్పన నిలువఁ జాలదు. ఏల యనఁ బుట్టుచునే వెలుఁగు చీకటిని తఱియఁ జాలదు. తఱియక దాని నశింపచేయఁ జాలదు. చీకటిని మాపక వెలుఁగు తన్నుఁ గానిపించుకొనుట కలుగదు.

మ ఱి యు

అంధకారమ్ము దఱియక యగ్ని తద్వి
ఘాత మొనరించు ననరాదు గాదె; యట్ల
యైన లోకధాతువుల సమస్తమందుఁ
గలుగు తిమిరంబు నిటనుండి తొలఁపవలయు. ౪౦

పైఁగా నప్రాప్తమైనను అగ్ని యంధకారమును నశింపఁ జేయు చున్న దని తలంచుచున్నారు. నిజముగా నిప్పు డిక్కడ నున్న యగ్ని సర్వలోక ధాతుస్థమగు తమమును నశింపఁ జేయవలయును. కాని యది యట్లు గావించుట లేదు. కావునఁ బొందకయే యగ్ని యంధకారమును నశింపఁ జేయుననుట యుక్తము గాదు.

ల ఘు టీ క

చీకటిని దఱియకయే వెలుగు దానిని మాపు నని చెప్పుచో, నిప్పు డిక్కడ నున్న తిల్లిక యెల్ల లోకములయందలి చీకటిని దొలఁగింపవల యును. అట్టిది జరగుటలేదు. కావునఁ జీకటిని సమీపింపకయే వెలుఁగు దానిని నశింపఁజేయు ననుట యుక్తము గాదు.

(౫) ప్రమేయమువలనఁ బ్రమాణసిద్ధి లేదు.

ఏ ప్రమాణమ్ము కాంక్షింపకే స్వతః ప్ర
మాణ సంసిద్ధి యగునన్న మతమ యేని,
తత్ప్రమాణ ప్రసిద్ధి యంతయుఁ బర నిర
పేక్ష యగుచు సిద్ధించు నంచెన్న వలయు. ౪౧

అగ్నికివలెనె స్వతఃప్రమాణసిద్ధి యగునని తలంతు రేని ప్రమే యాపేక్ష లేకయే ప్రమాణములకు సిద్ధి గలుగఁగలదు. కారణ మేమన స్వతః సిద్ధి పరమును గోరదు. ఒకవేళఁ గోరునేని యది స్వతః సిద్ధి కాఁజాలదు.

ఇక్కడ మీరిట్లు ప్రశ్నింపవచ్చును:-" ప్రమాణములు ప్రమేయార్థ ముల నపేక్షింప వేని దోష మేమి ?"

## ల ఘు టీ క

ప్రమాణములు తమకుఁ దాముగా సిద్ధించుచున్నవి యనుచో, నవి యితరముల నపేక్షింపక పోవలయును. అనఁగాఁ బ్రమేయముల నపేక్షింపక కలుగవలయును. అట్లు గలుగు నన్నచో వచ్చు దోషమును జెప్పఁబోవుచున్నారు.

ఇక్కడఁ జెప్పుచున్నాము—

ఏ ప్రమేయమ్ము కాంక్ష వహింపఁబోక
యీ ప్రమాణ ప్రసిద్ధి యొప్పారు నేని,
ధర్మ సందోహమందు నెద్దాని కైన
నయ్యవి ప్రమాణము లగుచు నలరఁబోవు. ౪౨

ప్రమేయము లగు నర్థముల నపేక్షింపకయే ప్రమాణములకు సిద్ధి కలుగు నేని, యీ ప్రమాణము లెద్దానికిని బ్రమాణములు గావు. ఇట్లు దోషము గలుగుచున్నది.

ఒకానొక దానికిఁ బ్రమాణము లగుచున్నప్పటికిని, ఆ ప్రమేయము లగు నర్థముల నపేక్షింపక యిపుడు ప్రమాణము లగుట లేదు.

## ల ఘు టీ క

ప్రమేయాపేక్ష లేక తమకుఁ దామై ప్రమాణములు సిద్ధించునవి యగుచో, నవి యే భావమునకును బ్రమాణములు గాఁజాలవు. అన్యమగు నెద్దాని యెఱుకకు నవి సాధనములు గాఁజాలవు.

ఆ ప్రమాణమ్ములకుఁ బ్రమే యార్థ కాంక్ష
సిద్ధి యన సోఁకు దోషమ్ము చెప్పుచుంటి:-
సిద్ధమునకు సాధన మద్ది చెలఁగు; మఱి య
సిద్ధ మర్థ మన్య మ్మపేక్షింపఁబోదు. ౪౩

పైఁగాఁ బ్రమేయములగు నర్థముల నపేక్షించి ప్రమాణములకు సిద్ధి యగు నని తలంతు రేని, సిద్ధ మగు ప్రమాణ చతుష్టయమునకు సాధనము గలుగుచున్నది. కారణ మేమి ? సిద్ధింపని యర్థమునకు నపేక్షణము లేదు

గదా! అసిద్ధుఁడగు దేవదత్తుఁడు కించి దర్ధమైనను గోరుట లేదు. కృతము నకుఁ గరణ మనావశ్యక మగుటవలన సిద్ధమునకు సాధన మిష్టము గాదు.

## ల ఘు టీ క

"ప్రమాణములు ప్రమేయాపేక్షచే సిద్ధించుచున్నవి యన్నచో, దోషము వాటిల్లుచున్నది. ప్రమాణములు తమకుఁ దాము సిద్ధించు చున్నవి, స్వతః ప్రామాణ్యము గలవి,'' అని చెప్పఁబడినవి. సిద్ధించిన వానికిఁ దిరిగి ప్రమేయము లేల కావలయును ? జరిగిపోయిన పెండ్లికి మేళము లేల ? నాటిన చేనికి నాటేల ? 'ప్రమాణములు మున్నుగా సిద్ధింపలేదు,' అన్నచో సిద్ధింపని దానికి నపేక్షయే కలుగదు. లేని దేవత్తుఁడు దేనిని గోరఁడు. ఇట్లు సిద్ధించిన దానికి సాధన మక్కఱ లేదు. సిద్ధింపనిదానికిని సాధన మక్కఱ లేదు. ఆడిన నువ్వుల కేని, కలుగని నువ్వుల కేని గానుగ యేల ?

## మ ఱి యు

ఎల్లభంగిఁ బ్రమాణ సాపేక్షతాప్తి
నీ ప్రమేయముల్ సిద్ధించునేని, కాంక్ష
సేయఁబోక ప్రమాణముల్, సిద్ధిగాంచుఁ
గాదె యీ ప్రమేయార్థ సంఘాతమెల్ల. ४४

ప్రమేయముల నపేక్షించి ప్రమాణములు సిద్ధించుచున్న వేని, యిపుడు ప్రమాణముల నపేక్షింపకయే ప్రమేయములు సిద్ధించుచున్నవి. కారణ మేమి ? సాధ్యము సాధనమును సాధింపలేదు. ప్రమేయములకుఁ బ్రమాణ ములు సాధనములు గదా!

## ల ఘు టీ క

ప్రమాణముల నాశ్రయించి ప్రమేయములు సిద్ధించు నేని, ప్రమేయ ములు ప్రమాణములను గోరకయే సిద్ధించును. ఏల యనఁ, బ్రమాణములు సాధనములు, ప్రమేయములు సాధ్యములు. సాధ్యములు సాధనములను సాధింపవు. కావునఁ బ్రమేయములవలనఁ బ్రమాణములు సిద్ధింపవు.

ఏ ప్రమాణం బపేక్షింపకే ప్రమేయ
సిద్ధి కల్గునేని, ప్రమాణ సిద్ధిచేత
నగున దేమి? ప్రమాణంబు లైన నేల?
తత్ప్రసిద్ధ మైనట్టి యర్థ మ్మదేల? ౧౫

ప్రమాణముల నపేక్షింపకయే ప్రమేయములకుఁ బ్రసిద్ధి గలుగు నని మీరు తలంతురేని, మీ కిపుడు పర్యన్విష్టి యగు ప్రమాణసిద్ధిచే నేమి కలుగును? కారణమేమి? ఆ ప్రమాణములు దేనికొఱకు పర్యన్వేష్యము లగుచున్నవి? ప్రమాణములు లేకయే ప్రమేయము లగు నా యర్థములు సిద్ధములు. అపుడు ప్రమాణములచేఁ జేయఁదగున దేమి?

లఘు టీక

ప్రమాణములను గోరకయే ప్రమేయములు సిద్ధించుచోఁ, బ్రమాణ సిద్ధివలనఁ బ్రయోజన మేమి? ప్రమాణము లేల? వానిచే సిద్ధించు నర్థము లైనను నేల?

అర్థములఁ బ్రమేయమ్ముల నభిలషించి
తత్ప్రమాణ ప్రసిద్ధి యుత్పన్నమైన,
ఆ ప్రమాణ ప్రమేయ ద్వయమ్ము వ్యత్య
యమ్మయిన స్థితిఁ బొందుట నాఁపరాదు. ౧౬

ప్రమేయములగు నర్థముల నపేక్షించి ప్రమాణము లగుచున్నవని తలంపవచ్చును. "ఇట్లయినఁ బూర్వోక్తదోషము గలుగదుగదా!" యని భావింపవచ్చును. ఈ పక్షమునఁ బ్రమాణ ప్రమేయములకు వ్యత్యయ మగును. ప్రమేయములచే సాధితత్వము వలనఁ బ్రమాణములు మాకు ప్రమేయము లగుచున్నవి. ప్రమాణములకు సాధకత్వము వలనఁ బ్రమేయములు మాకుఁ బ్రమాణము లగుచున్నవి.

లఘు టీక

ప్రమేయముల నాశ్రయించి ప్రమాణములు గలుగుచున్న వన్నచోఁ, బ్రమాణములు ప్రమేయము లగుచున్నవి. ప్రమేయములు ప్రమాణము

లగుచున్నవి. ఏల యన, నప్పుడు ప్రమేయములు సాధనములై వానివలనఁ బ్రమాణములు సాధింపఁ దగిన వగుచున్నవి.

చెనసెనా ప్రమాణపు సిద్ధిచేఁ బ్రమేయ
సిద్ధియున్, బ్రమేయపు సిద్ధిచేఁ బ్రమాణ
సిద్ధి, మీకు నా యుభయమ్ము సిద్ధి యైనఁ
జొప్పడుట కేవలము వట్టి సున్న యగును. ४२

పైఁగా నిట్లు దలంప వచ్చును. ప్రమాణాపేక్షత్వమువలనఁ బ్రమాణ సిద్ధిచేఁ బ్రమేయ సిద్ధి యగుచున్నది. ప్రమేయాపేక్షత్వమువలనఁ బ్రమేయ సిద్ధిచేఁ బ్రమాణ సిద్ధి యగుచున్నది. ఇట్లగు నేని యుభయమునకును సిద్ధి గలుగదు.

## లఘుటీక

ప్రమాణసిద్ధిచే బ్రమేయ సిద్ధియు, ప్రమేయ సిద్ధిచేఁ బ్రమాణ సిద్ధియు నగు నన్నచోఁ, బ్రమాణములు సిద్ధింపవు. ప్రమేయములును సిద్ధింపవు.

కారణ మేమన :—

ఆ ప్రమాణమ్ములను బ్రమే యార్థ సిద్ధి
యగున యేని, ప్రమేయ సాధ్యంబు లా ప్ర
మాణములు ప్రమే యార్థ సంతానమునకు
నెవ్విధమ్మున సంసిద్ధి నేర్పఁగలవు? ४౩

ప్రమాణములచేఁ బ్రమేయములు సిద్ధించుచున్న వేని, యా ప్రమాణము లా ప్రమేయములచేతనే సాధయితవ్యము లగును. కాని కారణములగు ప్రమాణము లసిద్ధములు. అసిద్ధములగు ప్రమాణములు ప్రమేయముల నెట్లు సాధింపఁ గలవు?

## లఘుటీక

ప్రమాణములవలనఁ బ్రమేయములు సిద్ధించు నేని, ప్రమాణములు సిద్ధములై యుండవలయును. కాని యా ప్రమాణములు సిద్ధములు గావు. ప్రమేయములవలన నవి సాధ్యములు. సాధ్యము లగు ప్రమాణములవలనఁ బ్రమేయము లెట్లు సిద్ధించును?

ఆ ప్రమేయమ్ములను బ్రమాణార్థసిద్ధి
యగున యేని, ప్రమాణ సాధ్యంబు లా ప్ర
మేయములు ప్రమాణార్థ నికాయమునకు
నెవ్విధంబున సంసిద్ధి నేర్పఁ గలవు ? ౪౯

ప్రమేయములచేఁ బ్రమాణములు సిద్ధించుచున్న వేని, యా ప్రమేయ ములు ప్రమాణములచేతనే సాధయితవ్యము లగును. కాని కారణములగు ప్రమేయము లసిద్ధములు. అసిద్ధములగు ప్రమేయములు ప్రమాణముల నెట్లు సాధింపఁగలవు ?

లఘు టీక

ప్రమేయములవలనఁ బ్రమాణములు సిద్ధించు నందు రేని, ప్రమేయ ములు సిద్ధములు గావు. ప్రమాణములవలన నవి సాధ్యములు. సాధ్యము లగు ప్రమేయములచేఁ బ్రమాణము లెట్లు సిద్ధించును ?

'తండ్రివలనఁ గొడుకు తనరారుచుండును,
తండ్రి కొడుకువలనఁ దనరుచుండు,'
ననుచు నొకఁడు చెప్ప నట్లైన నెవ్వాని
వలన నెవ్వఁ డుద్భవమ్ము పొందు ? ౫౦

'తండ్రిచేఁ గుమారుఁ డుత్పాదనీయుఁడు. ఆ తండ్రి కుమారునిచే నుత్పాదనీయుఁ, డని' యొకానొకఁడు చెప్పు నేని, యెవనిచే నెవఁ డుత్పాదనీయుఁడో చెప్పుఁడు ? మీరు నట్లే చెప్పుచున్నారు గదా ! ప్రమాణములచేఁ బ్రమేయములు సాధయితవ్యములు. ఆ ప్రమాణములే యా ప్రమేయములచే సాధయితవ్యములు. ఇపు డిక్కడ మీకు నేనిచే నేవి సాధయితవ్యములు ?

లఘు టీక

"ఒక వ్యక్తి కుమారునిఁ గాంచి యతనివలనఁ దండ్రియగు చున్నాఁడు. తండ్రివలనఁ గుమారుఁడు గలుగుచున్నాఁడు," అని యొకఁడు చెప్పుచో, నెవని కెవరు కారణభూతులు ? ప్రకృతమున నట్లే

చెప్పుట సంభవించుచున్నది. ఏల యనఁ బ్రమాణములు ప్రమేయములను, బ్రమేయములు ప్రమాణములను సాధించుచున్న వనుట సంభవించుచున్నది. ఇం దేవి వేనిని సాధించుచున్నవి ?

జనకుఁ డెవ్వాఁడు, మఱి తనూజాతుఁ డెవఁడు ?
విశద ఫణితిని దెల్పుఁడీ వినఁగ వలయు,
ఇరువురును దాతసుత లక్ష ణక్షితులగు
చుంట మా కిందు సందేహ ముద్భవించె. ౫౧

పూర్వము పేర్కొనఁబడిన పితాపుత్రుల యిద్దరిలో నెవఁడు పుత్రుఁడో, యెవఁడు తండ్రియో చెప్పఁడు ? ఉత్పాదకత్వముఁ బట్టి యా యిరువురును పితృ లక్షణ ధరులు; ఉత్పాద్యత్వమునుబట్టి పుత్ర లక్షణ ధరులు నగుదురు. కావున నెవఁడు తండ్రి, యెవఁడు పుత్రుఁ డను సందేహము మాకుఁ గలుగుచున్నది. ఆ ప్రమాణ ప్రమేయములు నిట్లే యగుచున్నవి. ఆ రెంటిలో నేవి ప్రమాణములు ? ఏవి ప్రమేయములు ? ఈ యుభయములును సాధనత్వమువలనఁ బ్రమాణములు, సాధ్యత్వమువలనఁ బ్రమేయములు. ఇందేవి ప్రమాణములో, యేవి ప్రమేయములో యని మాకు సందేహము గలుగుచున్నది.

## లఘు టీక

తండ్రి కొడుకులందుఁ దండ్రి యెవ్వఁడు ? కుమారుఁ డెవ్వఁడు ? జనక లక్షణ మిరువురయందుఁ గానఁబడుచున్నది. తండ్రివలనఁ గుమారుఁడు గలుగుచున్నాఁడు. కావునఁ దండ్రియందు జనక లక్షణము గనఁబడు చున్నది. కుమారుని పుట్టుకవలన నా వ్యక్తి తండ్రి యగుచున్నాఁడు. కావునఁ గుమారునియందు జనకలక్షణము గానఁబడుచున్నది. ఇట్లే కుమారుఁడు గలుగుటవలన నొకవ్యక్తి తండ్రి యగుచున్నాఁడు. కావునఁ దండ్రి యందు పుత్ర లక్షణము గానఁబడుచున్నది. తండ్రివలన నుద్భవించు చున్నాఁడు గావున గుమారునియందుఁ బుత్ర లక్షణము గానఁబడుచున్నది. కావున నీ రిరువురయం దెవఁడు తండ్రి ? ఎవఁడు కుమారుఁ డను సందేహము గలుగుచున్నది. ప్రమాణ ప్రమేయములలో నేవి ప్రమాణములు ?

ఏవి ప్రమేయములు ? సాధనత్వమువలన ప్రమాణ ప్రమేయములు ప్రమాణము లగుచు సాధ్యత్వమువలన నవి రెండును బ్రమేయము లగుచున్నవి.

(ఘ) అకారణముగఁ గూడ బ్రమాణసిద్ధి లేదు.

స్వయముగాఁ గాని, మఱి పరస్పరతఁ గాని
తత్ప్రమాణమ్ములను గాని, తత్ప్రమేయ
వితతిఁ గాని, కారణ విహీనతను గాని
యా ప్రమాణమ్ములకు సిద్ధి యగుట లేదు. ౫౧

ప్రత్యక్షమున కా ప్రత్యక్షముచేత స్వతః ప్రసిద్ధి లేదు. అనుమానమున కా యనుమానముచేఁ బ్రసిద్ధి లేదు. ఉపమానమున కా యుపమానముచేతను, ఆగమమున కా యాగమముచేతను బ్రసిద్ధి లేదు. పరస్పరత వలనను బ్రసిద్ధి లేదు. ప్రత్యక్షమున కనుమానోపమానాగమముల చేతను, అనుమానమునకుఁ బ్రత్యక్షోపమానాగమములచేతను, ఉపమానమునకుఁ బ్రత్యక్షానుమానాగమములచేతను, ఆగమమునకుఁ బ్రత్యక్షానుమానోపమానములచేతను బ్రసిద్ధి లేదు. ప్రత్యక్షానుమానోపమానాగమము లన్యము లగు ప్రత్యక్షానుమానోపమానాగమములచే యథాక్రమముగనైన సిద్ధించుట లేదు. సమస్తములు, వ్యస్తములు స్వ విషయ పర విషయతా గృహీతము లగు ప్రమేయములచేతను సిద్ధి లేదు. అకారణముగాను సిద్ధి లేదు. సముచ్చయము చేతను సిద్ధి లేదు.

ప్రమేయము లగు భావములకు "ప్రమాణాధిగమ్యత్వమువలనఁ బ్రమేయము లగు భావము లున్నవి. ఆ ప్రమాణములు నున్నవి. ప్రమాణములచే సమధిగతము లగు నా భావములు నున్నవి," యని మీరు చెప్పినది యుక్తము గాదు.

## లఘు టీక

ప్రమాణములు తమకుఁ దాముగాఁ గాని, యితర ప్రమాణములచేఁ గాని, యన్యోన్యతచేఁ గాని, ప్రమేయములచేఁ గాని, యహేతుకత్వముచేఁ గాని సిద్ధించుట లేదు.

2. భావములకు శూన్యత యుక్తము.

(1) ప్రతీత్య సముత్పన్నత్వమువలనఁ గుశలాదులకుఁ బ్రవిభాగము.

మీరు వెండియు నిట్లు పలికియున్నారు:—

“ధర్మ తత్త్వజ్ఞులు కుశల ధర్మ తత్త్వ
కలన, లోక స్వరూప విజ్ఞాను లీ ప్ర
పంచ సంస్థితి నంగీకరించువారు;
శేష ధర్మ సంస్థితి నిట్లె చెప్ప వలయు.”

ఇపుడు మేము చెప్పుచున్నాము:—

ధర్మ తత్త్వజ్ఞులు కుశల ధర్మములకుఁ
గుశల మగు స్వభావమ్ము వాక్రుత్తు రేని,
యియ్య దిట్టి చందం బంచు వేఱు పఱిచి
యా స్వభావమ్ము వివరింప నగును గాదె. ॥ ౫౩

ధర్మావస్థ దెలిసినవారు కుశల ధర్మములకుఁ గుశల మగు స్వభావ మున్న దని తలంచుచున్నారు. మీరు “ఆ కుశల స్వభావ మిది, యా కుశల ధర్మము లివి,” యని ప్రవిభాగము చేసి, “యిది యా విజ్ఞానమయ మగు కుశలము. ఇది కుశల విజ్ఞాన స్వభావ మని యుపదేశింపఁ దగినది. ఇట్లే యన్నిటికిని జెప్పఁ దగినది. అది యి ట్లుపదిష్టమై కనఁబడుట లేదు. కావున ధర్మములకు స్వభావము చెప్పఁబడిన దనుచు మీ చెప్పినది యుక్తము గాదు.

మఱియు

కారణ ప్రత్యయమ్ములఁ గాంచి కుశల
ధర్మమున స్వభావము సముత్పన్న మగున
యేని, పర భావ జాతమై యెసఁగు నద్ది
కుశల ధర్మ స్వభావమై కొఱలు టెట్లు. ॥ ౫౪

కుశలములగు ధర్మముల స్వభావము హేతు ప్రత్యయ సాకల్యమును బొంది కుశల ధర్మములకు స్వభావము గలుగుచున్న దేని, యది పరభావము

వలనఁ బుట్టినది యగునుగాని, కుశలములగు ధర్మముల స్వభావ మెట్లగును? ఇట్లే యకుశల ప్రభృతులకును వర్తిల్లుచున్నది.

కావునఁ, "కుశలములగు ధర్మములకుఁ గుశల స్వభావము, నకుశలాది ధర్మములకు నకుశలాది స్వభావము నుపదేశింపఁబడినది," యని మీ చెప్పినది యుక్తముగాదు.

మ ఱి యు

కారణ ప్రత్యయమ్ములఁ గనక కుశల
ధర్మముల స్వభావము సముత్పన్న మగున
యేని, కుశలాది ధర్మమ్ము లిట్టి వేని,
బ్రహ్మచర్యవాసం బవి పడయఁబోవు. ౫౫

మీ రిట్లు తలంచుచున్నారు:- "కించి దర్థమును బొందకయే కుశల ధర్మములకుఁ గుశల స్వభావము గలుగుచున్నది. ఇట్లే యకుశల ధర్మములకు నకుశల స్వభావము, అవ్యాకృతములకు నవ్యాకృతము పొడము చున్నవి." ఇట్లగుచో బ్రహ్మచర్య వాస మగుట లేదు. కారణ మేమి? ప్రతీత్య సముత్పాదమున కీ పక్షమునఁ బ్రతిషేధ మగుచున్నది. ప్రతీత్య సముత్పాదమునకుఁ బ్రతిషేధముగలుగుటవలనఁ బ్రతీత్య సముత్పాద దర్శనము ప్రతిషిద్ధ మగుచున్నది. అవిద్యమానమగు ప్రతీత్య సముత్పాదమునకు దర్శన ముపపద్యమాన మగుట లేదు గదా! ప్రతీత్య సముత్పాద దర్శనము లేని దగుచుండఁగా ధర్మ దర్శన మగుట లేదు. భగవత్పాదులు, "భిక్షువులారా! యెవఁడు ప్రతీత్య సముత్పాదము గాంచుచున్నాఁడో, వాఁడు ధర్మమును గాంచుచున్నాఁడు," అని చెప్పియున్నారు. ధర్మ దర్శనాభావమువలన బ్రహ్మచర్య వాసాభావ మగును.

లేదా ప్రతీత్య సముత్పాద ప్రతిషేధమువలన దుఃఖ సముదయ ప్రత్యాఖ్యాన మగును. దుఃఖ సముదయము ప్రతీత్య సముత్పాదమే కదా! దుఃఖ సముదయ ప్రత్యాఖ్యానమువలన దుఃఖ ప్రత్యాఖ్యాన మగుచున్నది. సముదయము లేని దగుచుండఁగా నా దుఃఖము దేనివలన నుద్భవింపఁ గలదు? దుఃఖ సముదయ ప్రత్యాఖ్యానమువలన దుఃఖ నిరోధమునకుఁ

ప్రత్యాఖ్యాన మగుచున్నది. దుఃఖ సముదయము లేని దగుచుండఁగా దేని వినాశమువలన నిరోధ మేర్పడఁ గలదు ? దుఃఖ నిరోధము లేని దగుచుండఁగా దుఃఖ నిరోధగామి యగు మార్గము దేని ప్రాప్తి కొఱకు కాఁ గలదు ? ఇట్లే యార్యసత్యముల నాల్గింటి యభావమువలన శ్రామణ్య ఫలాభావ మగును. శ్రామణ్యఫలముల యభావమువలన నబ్రహ్మచర్యవాస మగును.

మఱియు

ధర్మ మేని, మఱి యధర్మ మేని, వ్యవహా<br>
రంపు ధర్మ మేని క్రాలఁబో; ద<br>
హేతుమంత మది సనాతనం బగుటచే<br>
నిఖిల భావ చయము నిత్య మగును. ౫౬

ఇట్లగుచుండఁగాఁ బ్రతీత్య సముత్పాదము ప్రత్యాఖ్యానించుచున్న మీ కే దోష మంటుచున్నదందురా ? ధర్మము గలుగుట లేదు. అధర్మము గలుగుట లేదు. లౌకికము లగు ధర్మములు సంభవించుట లేదు. కారణ మేమి ? ఈ సర్వము ప్రతీత్య సముత్పన్నము గదా ! ప్రతీత్య సముత్పాదము లేనిచో నది యె ట్లుత్పన్నము గాఁగలదు ? సస్వభావము, నప్రతీత్య సముత్పన్నము నగు నేని, యది నిర్హేతుకము నిత్యము నగును. కారణ మేమి ? భావములు నిర్హేతుకము లగు నేని నిత్యము లగును. దానిచే నబ్రహ్మచర్య వాసము గలుగును. స్వసిద్ధాంత విరోధమును బొడమును. కారణమేమి ? సర్వసంస్కారము లనిత్యము లని భగవత్పాదులచే నిర్దిష్టములు గదా ! స్వభావ నిత్యత్వమువలన నవి నిత్యములు గావలయును.

అకుశలములందు, నవ్యాకృతాళియందు,<br>
నల్ల నైర్యాణ పూర్వాదులందుఁ బూర్వ<br>
దర్శితంబైన దోష ముత్పన్న మగును;<br>
అఖిల సంస్కృతార్థ మసంస్కృతార్థ మగును. ౫౭

కుశలములందు నిర్దేశింపఁబడిన యీ కల్పనమే (ఈ దోషమే) యకుశలములందును, అవ్యాకృతములందును, నైర్యాణిక ప్రభృతులందును గలుగుచున్నది. కావున సంస్కృత మగు నీ సర్వము నసంస్కృత మగుచున్నది. కారణమేమి? హేతువు లేక యుత్పాదస్థితి భంగములు గలుగవు. ఉత్పాద స్థితి భంగములు లేనప్పుడు సంస్కృత లక్షణాభావ మేర్పడి సర్వ సంస్కృతము నసంస్కృత మగుచున్నది.

కావునఁ, "కుశలాది భావములకు స్వభావ ముండుటవలన సర్వ భావములు నశూన్యములే," యని మీ చెప్పినది యుక్తము గాదు.

(2) నిర్వస్తుకమునకు నామాభావమున నియమము లేదు.

మీరు రెండియు నిట్లు పలికితిరి :—

"ధర్మములకు స్వభావమ్ము తనర దేని,
నిఃస్వభావమ్మనకుఁ బేరు నెగడ రాదు;
అభిధ సస్వభావమునకే యమరుచుండు,
వస్తు హీనమ్ము నామమ్ము పరఁగు టెట్లు?"

ఇక్కడ మేమిట్లు చెప్పుచున్నాము :—

పదమునకు సత్త సస్వభావతయుఁ జెప్పు
వాఁడు మీచేతఁ బ్రతిషేధ పాత్రుఁ డగును;
మేముమాత్ర మే నాఁడును నామమునకు
నున్కి కలదంచు వచియించి యుండలేదు. ౫౮

నామ మున్నది. అది సస్వభావ మని చెప్పువాఁడు మీచేఁ బ్రతివక్తవ్యుఁ డగును. సద్భూత నామ స్వభావమునకు సద్భూత మగు నా స్వభావము చేతనే నామము గలుగఁగలదు. అసద్భూత మగు స్వభావమునకు సద్భూత మగు నామము గలుగదు గదా! మేము నామ మున్న దని చెప్పుట లేదు. ఆ స్వభావమునకుఁ గూడ నభావమువలన నామము నిఃస్వభావము. నిఃస్వభావత్వమువలన నది శూన్యము. శూన్యత్వమువలన నది యసద్భూత మగును.

కావున "నామ సద్భావమువలన స్వభావ మున్నది," యని మీ చెప్పినది యుక్తము గాదు.

లఘు టీక

నామము, దాని స్వభావము నున్న వని చెప్పువారి వాదము ప్రతిపక్షి వాదముచేతనే ఖండిత మగుచున్నది. మేము మాత్రము నామము సత్పదార్థ మని చెప్పుట లేదు.

నామము సత్పదార్థ మగుచో, దాని స్వభావము గూడ సత్పదార్థమే యగును. అసత్పదార్థ మగు స్వభావమునకు సత్పదార్థమగు నామము కలుగఁజాలదు. మేము నామము సత్పదార్థమని చెప్పుటలేదు. స్వభావ మసత్పదార్థ మనుచున్నాము. కావున నామము నిఃస్వభావము. నిఃస్వభావ మగుటవలన నది శూన్యము. కావునఁ, "పేరున్నది యగుటంజేసి స్వభావ మున్న,"దని చెప్ప వీలులేదు.

మఱియు

పద మసత్తను వాదమ్ము పరఁగ వలయు
నొండె, పరఁగ కుండవలయు నొండెఁ; గాన
నిందు నెద్దాని నీ వాశ్రయించుకొన్న
తావకీన వాదమ్ము విధ్వంస మగును. 57

'నామము అసత్తు,' అనునది యున్నదా లేదా? నామము సత్తన్నను, అసత్తన్నను ఉభయ విధములఁ బ్రతిజ్ఞ భగ్న మగుచున్నది. ఇచట నామము అసత్తు అన్నచో, లేదను ప్రతిజ్ఞ భగ్న మగును. ఇపు డది యసత్తై తరువాత సత్తు, నా తరువాత నసత్తుఁ గాదు గదా! "నామ మసత్తు" అను ప్రతిజ్ఞ అసద్భూత నామమునకుఁ గాదు. కావున నది యస్తిత్వ స్వభావ మగును. కావున సద్భూత స్వభావ మగును. ఆ ప్రతిజ్ఞ భగ్న మగును.

[విషయ మసత్తనుచో, నామము గూడ నసత్తే యగును. కాని యీ వాక్యము సత్తగునా, యసత్తగునా? సత్తగు నన్నను, అసత్తగు నన్నను వ్యాహతి పొడముచున్నది.

విషయ మసత్తగుచో, నామము గూడ నసత్తే యగును. కాని మీ మతమున "నామ మసత్తు" అను వాక్యము సత్తగునా? అది సద్వస్తువు పేరైనను, అసద్వస్తువు పేరైనను ద్వివిధ దోషమునకుఁ బాల్పడుచున్నది. "నామ మసత్తు," అను వాక్యము సత్తగు పదార్థమునుగూర్చి చెప్పుచో, నామ మసత్తనునది భగ్న మగుచున్నది. అది సత్తు గావున, నిది యసత్తు గాదు. అట్లు గాక "నామ మసత్తు," అనువాక్య మసత్తగు దానినిగూర్చి చెప్పు నేని, నామ స్వభావ మున్న దని చెప్పు మీ ప్రతిజ్ఞా వాక్యము భగ్న మగుచున్నది. ఏల యన విషయము గాని, పేరు గాని లేదు గదా!

—[ప్రొఫెసరు తుచ్చి]

## లఘుటీక

'మాట అసత్తు', అన్న యీ మాట యున్నదా? లేదా? మాట యున్నదన్నను, లేదన్నను బ్రతిజ్ఞాభంగము వాటిల్లుచున్నది. 'నామము అసత్తు,' అన్నచో; 'మాట అసత్తు' అను ప్రతిజ్ఞ లేని దగును. ఇట్లు ప్రతిజ్ఞ భంగము పొందుచున్నది. నామము సత్పదార్థ మన్నచో 'మాట అసత్తు', అనుదానియందు స్వవచన విరోధము పొడముచున్నది.

అఖిల భావముల్ శూన్యమ్ము లంచు మున్ను
ప్రోక్త మయ్యె మాచేత; నభూత మట్లె
మా ప్రతిజ్ఞ; కావున నింక మాదు వాద
మెట్లు దోషమ్ముచేత సంస్పృష్ట మగును? ౬౦

పూర్వమే సర్వ భావములకు శూన్యత్వము మేము సవిస్తరముగా నుపపాదించి యుంటిమి. అచట ముందుగానే నామమునకుఁ గూడ వేఱుగా శూన్యత్వము చెప్పఁబడినది. అశూన్యత్వ సంభవమును బరిగ్రహించి యట్లు చెప్పుట సంభవించినది. భావములకు స్వభావము లేనిచో 'నామము అస్వభావము' అన్నది గూడ అసత్తగును. కావున నీ ప్రతిజ్ఞోపలంభము మీకుఁ గలుగుచున్నది. మేము నామము సద్భూత మని చెప్పుట లేదు గదా!

## లఘుటీక

భావములెల్ల శూన్యము లని మాధ్యమక కారికలలో వివరించి యున్నాము. నామముగూడ శూన్యమని చెప్పితిమి. లోకములో భావము లశూన్యము లని భావింపఁబడుచుండుటచే వానిని శూన్యము లని నుడివితిమి. భావములు శూన్యము లైనపుడు, 'నామము నిఃస్వభావము' అను ప్రతిజ్ఞ భావ మగుటచే శూన్య మగుచున్నది. ఇట్లు మా ప్రతిజ్ఞయు శూన్యమే. కావున ప్రతిజ్ఞాదోషము పూర్వపక్షమందే యున్నదిగాని, మా వాద మందు లేదు.

## III. ప్రతిషేధాసిద్ధి యుక్తము గాదు.

### (క) ధర్మ వినిర్ముక్త స్వభావము ప్రతిషిద్ధము.

పైఁగా మీరిట్లు చెప్పియున్నారు :—

"ధర్మములకంటె వేఱుగాఁ దనరు నేని
యభిధ, యదియును నేత ద్ధర్మమందు నుండఁ
బోదు; ధర్మమునకు నన్యభూత మగుచు
నలరుచో నది యుపదేశ నార్హ మగును."

ఇప్పుడు మేము చెప్పుచున్నాము :—

ధర్మములకంటె వేఱుగాఁ దనరుచుండు
నట్టి దేని స్వభావ మయ్యదియు ధర్మ
మందుఁ గల్గదం చాశంక నందినార
లస్మ దుక్తి యాశంకనీయమ్ము గాదు. ౬౧

మేము ధర్మముల స్వభావము ప్రతిషేధించుటలేదు. ధర్మ వినిర్ముక్త మగు నొకానొక యర్థమునకు స్వభావము నామోదించుటయు లేదు. "ధర్మములు నిఃస్వభావము అగునేని, ధర్మ వినిర్ముక్తమగు నే యన్యార్థమునకు స్వభావ మగుచున్నది ? అట్టిది యుపదేశింపఁబడుట యుక్తము," అన్న మీ యుపాలంభము దూరాపకృష్ట మగుచున్నది.

లఘుటీక

మేము ధర్మముల స్వభావమును నివారించుటలేదు. ధర్మముగాని, కొండొక యర్థమునకు స్వభావముగాని యున్నదని యంగీకరించుటయు లేదు. "కావున ధర్మ వినిర్ముక్తమైన యే యర్థమునకు స్వభావము గలుగుచున్నదో చెప్పవలసియున్నది," యను దూషణమునకుఁ దావే లేదు.

(ఖ) అనభ్యుపగమ మగు నసత్తునకుఁ బ్రతిషేధమువలన సమము.

వెండియు మీ రిట్లు పలికితిరి :—

ఉన్నదానికే ప్రతిషేధ మొప్పుచుండు
నిలయమునఁ బాత్ర లేదని పలుకుచుందు;
మట్టులే స్వభావ మ్మున్న యపుడ కానఁ
బడును గాదె యద్దాని వ్యావర్తనమ్ము.

ఇక్కడ మేము చెప్పుచున్నాము :—

ఉన్నదానికే ప్రతిషేధ మొప్పునేని,
భావ నిఃస్వభావత్వ నివర్తనమ్ము
మీరు కడఁగి కావించుచున్నారు గాన
చెలఁగు శూన్యత్వ మప్రతిషిద్ధ మగుచు. ౬౨

సత్తునకే ప్రతిషేధము గలిగి, యసత్తునకుఁ గలుగ దేని, సర్వ భావ నిఃస్వభావత్వమును మీరు ప్రతిషేధించుచున్నారు. మీ మాటచే సర్వ భావ నిఃస్వభావత్వము నిజముగఁ బ్రతిషిద్ధము గాదు. మీరు సద్భావత్వ మును బట్టి ప్రతిషేధించుచున్నారు. సర్వభావముల నిఃస్వభావత్వము గూడ ప్రతిషిద్ధము. కావునఁ బ్రతిషిద్ధమగు నర్థము గూడ శూన్యమే.

లఘుటీక

ఉన్న యర్థమునే నివారింప శక్యమగును గాని, లేని యర్థమును నివారింప శక్యము గాదని ప్రతిపక్షి దూషణము గావించుచున్నాఁడు,

"ధర్మములు నిఃస్వభావము," అను నిషేధము ప్రతీత్య సముత్పన్నము. ప్రతీత్య సముత్పన్న మగుటవలన నది నిఃస్వభావము. నిఃస్వభావ మగుట వలన నది శూన్యము. ఇట్టి శూన్యమగు స్వభావ నిషేధమును బ్రతిపక్షి నిషేధించుచున్నాఁడు. శూన్యమగు నర్థము సత్పదార్థ మగుచో నతని నివారణము సిద్ధించును. కాని శూన్య మగునది సత్పదార్థము గాదు. కావున భావ నిఃస్వభావత్వ మవ్యాహత మగుచున్నది.

మీరు వ్యావృత్తి చేయుచున్నారు శూన్య
భావ; మాశూన్యతయు నేని పరఁగఁ బోదు;
ఉన్నదానికే ప్రతిషేధ మొప్పునని నెడి
తావకీన వాద మిట్లు ధ్వంస మందు. ౬౩

సర్వ భావములు నిఃస్వభావములు. కావున శూన్యములు. ఆ శూన్య త్వమునుగూడ మీరు ప్రతిషేధించుచున్నారు. ఆ శూన్యతయు లేదు. కావున 'సత్తునకే ప్రతిషేధము గాని, యసత్తునకుఁ గా,'దను మీ ప్రతిజ్ఞ భగ్న మగుచున్నది.

మ ఱి యు

కించి దర్థమేని ప్రతిషేధించుచుండ
లేదు; ప్రతిషేధ్య మర్థమే లేదు మాకు;
కావునఁ బ్రతిషేధించుచున్నావు నీవ
టన్న యధిలయ మొండె విన్యస్త మయ్యె. ౬౪

మేము అర్థము కొంచె మేని ప్రతిషేధించుచుంటి మేని, మీ వాదము యుక్త మగును. కాని మేము ఏ కించి దర్థమును బ్రతిషేధించుట లేదు. కావునఁ బ్రతిషేధ్యమగు నర్థము గొంచె మేని లేదు. ఇట్లు సర్వ భావములు— ప్రతిషేధ్యము ప్రతిషేధము—శూన్యము అగుచుండఁగా, "ప్రతిషేధించు చున్నారు," అని యిచట మీరు సమ్భూతమగు దూషణము గావించు చున్నారు.

వెండియు మీ రిట్లు పలికితిరి :—

"ధర్మముల్ నిఃస్వభావతఁ దనరు నేని,
యేది మీ మాటచేఁ బ్రతిషేధ మందు ?
ధర్మముల్ ప్రతిషేధ్యముల్ దనరు నేని,
యవి యసద్వాక్యునఁ బ్రతిషేధ్యమ్ము లగును."

ఇక్కడ మేము చెప్పుచున్నాము :—

పరఁగఁబోని మీదు వాక్కుచేఁ బ్రతిషేధ
వచన సిద్ధియంచుఁ బలికినారు;
ఇచట లేసిదనుచు నెఱిగించునేకాని
వాక్కు దాని భంగపఱుపఁబోదు. ౬౫

"వాక్కు అసత్తైనను, ప్రతిషేధము ప్రసిద్ధి పొందుచున్నది. 'సర్వభావములు నిఃస్వభావములు,' అను వచన మేమి సేయుచున్నది?" యని మీరు ప్రశ్నించుచున్నారు. కావున నవధరింపుఁడు :—

'సర్వభావములు నిఃస్వభావములు' అను నీ వాక్యము సర్వభావములను నిఃస్వభావములఁ గావించుటలేదు. నిఃస్వభావము లగు భావముల నిఃస్వభావత్వము నెఱిఁగించుచున్నది. దేవదత్తుఁ డింటియందు లేనపుడు ఒకఁ డా యింటికేగి, "దేవదత్తుఁ డున్నాఁడా ?" యని యడిగె ననుకొనుఁడు. "దేవదత్తుఁ డింట లేఁడు," అని మఱియొకఁడు ప్రతివచనము చెప్పె ననుకొనుఁడు. ఆ ప్రత్యుత్తరము దేవదత్తుని నింట లేకుండఁజేయుట లేదు. దేవదత్తుని సంభవము నుత్పాదించుటలేదు. దేవదత్తుఁ డింటియందు లేకుండుటను మాత్రమే యది యెఱిఁగించుచున్నది. 'అట్లే భావములకు స్వభావము లేదు,' అను నీ వాక్యము భావములకు నిఃస్వభావత్వము గలిగించుటలేదు. భావములయందలి స్వభావముయొక్క యభావమును మాత్రమే యెఱిఁగించుచున్నది.

కావున, "స్వభావము లేని దగుచుండఁగా 'స్వభావము లేదు' అను మీ వచన మేమి చేయుచున్నది ? ఈ వచనము లేకయే స్వభా వాభావము ప్రసిద్ధి పొందుచున్నది," అని మీ చెప్పినది యుక్తము గాదు.

(౫) ప్రతీత్య సముత్పన్నత్వమువలన నిర్హేతుకతా దోషము పొడమదు.

మీరిట్లు పలికితిరి :—

మూఢ మతి మృగతృష్ణి కాంబువుల గ్రాహ
మెట్లు ప్రతిషేధ్య మగుచున్న దట్లె నిఃస్వ
భావతా భాసమాన ధర్మావలోకి
త మ్మసత్యతత్త్వము నివర్తనము పొందు.

అనుట యుక్తమ్ము గాదు; గ్రాహాదికములు
మూఁడు, ప్రతిషేధ మాదిగాఁ బొలుచు త్రికము
కలిసి యాఱు ధర్మమ్ములు గ్రాలుచున్న
వనుచు నంగీకరించు లే యగును జుమ్ము.

గ్రాహ మది లేనిదగు నేని, గ్రాహ్య మట్లె
యల గ్రహీతయు లేనివాఁ డగున యేని,
వాని తోపాటె ప్రతిషేధ భావ మాది
యైన త్రితయమ్ము లేనిదే యగును జుమ్ము.

ప్రతిషేధ ప్రతిషేధ్య
ప్రతిషేద్ధలు గల్గ రేని, భావము లెల్లన్
సితిమై సిద్ధించును; వా
ని తత్త్వ మీ కైవడిఁ బరినిష్ఠం బొందున్.

"మూఢ మతి మృగతృష్ణి కాంబువుల" అనుదానికి మేము చెప్పుచున్నాము :—

త్వన్మరీచికా దృష్టాంత దత్త విపుల
చర్చ ప్రత్యుక్త మౌత; దృష్టాంత మద్ది
యెట్టు లుపపత్తి పొందునో యేది నిర్ణ
యంబొ వివరించుచున్నార మవధరింపు. ౬౬

మృగతృష్ణికా దృష్టాంతమందు మీరు విపుల విచారణ గావించితిరి. ఇచటి నిర్ణయము వినుఁడు. ఆ దృష్టాంత మువపన్నమే యగుచున్నది. [పైఁగా మాయా పురుషు నట్లు సర్వ భావములు నిఃస్వభావములు. అవిద్యచే నభూత వస్తు మోహామువలన నారోపితములగు సస్వభావము లందు స్వభావముయొక్క యభావమును మూఢులగు పురుషుల కెఱింగించు చున్నది. ప్రొఫెసరు తుచ్చి పాఠము ననుసరించి.]

మఱియు

గ్రాహ మది స్వభావమ్ముచేఁ గ్రాలు నేని,
యది ప్రతీత్య సముత్పన్న మగుట లేదు;
గ్రాహ మది ప్రతీత్య భవమై గ్రాలు నేని,
యద్ది నిజముగా శూన్యత యగును జుమ్ము. ౬౭

మృగతృష్ణికయందు జలగ్రాహము స్వభావమువలన నగునేని, యది ప్రతీత్య సముత్పన్నము గాదు. మృగతృష్ణను బొంది, విపరీతమగు దర్శనమును బొంది అయోనిశః మనసికారముఁ బొంది ప్రతీత్య సముత్పన్న మగుచున్నది. ప్రతీత్య సముత్పన్న మగుటవలన నది స్వభావ శూన్యమే యగును. దీనిని బూర్వమే చెప్పితిమి.

మఱియు

గ్రాహ మది స్వభావమ్ముచేఁ గ్రాలు నేని,
యెవ్వఁ డెట్టు లద్దాని వారింపఁ గలఁడు?
శేష ధర్మాల నీ విధి చెల్లుచుండుఁ;
గాన దోష మీ వాదానఁ గాన రాదు. ౬౮

మృగతృష్ణయందు జల గ్రాహము స్వభావమువలన నగు నేని, యెవఁడు దానిని నివర్తించును? స్వభావమును నివర్తింప శక్యము గాదు కదా! అగ్ని కుష్ణత్వము, నీటికి ద్రవత్వము, ఆకాశమునకు నిరావరణ త్వము స్వభావము. ఈ స్వభావ నివర్తనము గానఁబడదు. కావున

గ్రాహ్యము (గ్రాహము) శూన్య స్వభావము. ఇట్లే శేషములైన పంచ గ్రాహ్య ప్రవృత్తులగు ధర్మములందును నీ క్రమము ప్రత్యవగంతవ్యము.

కావున, "షడ్లక్షణ భావములవలన సర్వ భావము లశూన్యములు," అని మీ చెప్పినది యుక్తము గాదు.

పెండియు మీ రిట్లు పల్కితిరి :—

అట్టులగుట హేతు వసిద్ధ మగును; నిఃస్వ
భావతను నేది హేతువై పరఁగఁ గలదు ?
హేతు రహితమ్ముగా నర్థ మెసఁగు నేని,
యర్థ మయ్యె దెట్లు ప్రసిద్ధి నందఁ గలదు ?

భావ సస్వభావత్వ నివర్తనమ్ము
హేతు హీనత సిద్ధి మీ కెనయు నేని,
భావ సస్వభావత్వమ్ము వఱలుచుంట
హేతు హీనత సిద్ధి మా కెనయఁ గలదు.

హేతువున కున్కి, భావ సంఘాతమునకు
నిఃస్వభావత్వ కరణమ్ము నిశ్చయించు
వాద మెట్లు గన్న ననుపపన్న మగును;
వర్తిలదు నిఃస్వభావ భావమ్ము జగతి.

ఇక్కడ మేము చెప్పుచున్నాము:—

హేత్వభావత సాధ్యసమత్వ మగుటఁ
జేసి మున్నె ప్రత్యుక్త తాశ్లిష్ట మయ్యె;
త్వ న్స్మరిచి దృష్టాంత నివర్తనంబు
నందుఁ బూర్వమ్ము చెప్పిన దిం దెసంగు. ౬౯

ఈ చర్చచేతను, బూర్వోక్త చర్చచేతను హేత్వభావముగూడఁ బ్రత్యవగంతవ్య మగును. పూర్వపు హేతువునందును, షట్కోటివాద ప్రతిషేధమందును జేసిన చర్చ యిక్కడఁ గూడఁ జర్చయితవ్య మగును.

## ల ఘు టీ క

"సర్వ భావములు నిఃస్వభావములు. నిఃస్వభావము లగుటవలన నవి శూన్యములు. ఇట్లగుచో హేతువును శూన్యమే యగుచున్నది. హేతువు లేనపుడు శూన్యతా వాద మెట్లు సిద్ధించుచున్నది?" యను ప్రతిపక్షి దూషణమునకు సమాధానము చెప్పుచున్నారు:—

మా ప్రతిజ్ఞలో హేతువు లేదను ఆక్షేపణమునకుఁ బూర్వోక్త చర్చచేతనే ప్రత్యుత్తర మిచ్చితిమి. పూర్వము హేతు విషయమునఁ జేసిన చర్చయు, షట్కోటిక వాద ప్రతిషేధమునఁ జేసిన చర్చయు నిచట ననువృత్తము చేసికొనవలయును. [హేతు వున్నదనుటలో సాధ్యసమత్వ దోష మున్నది. హేతువు తనకుఁ దాను సిద్ధించుట లేదు. పరమువలనను సిద్ధించుట లేదు. అన్య హేతువుచేతను సిద్ధించుట లేదు. అహేతుకము గాను సిద్ధించుటలేదు. హేతుమంతము చేతను సిద్ధించుట లేదు.

[పైఁగా హేతువు ప్రతీత్య సముత్పన్న మగుచున్నది. కావున నది నిఃస్వభావము. నిఃస్వభావ మగుటవలన నది శూన్యము. హేతువు శూన్య మనుటవలన వ్యావహారికముగ హేతువు లేదని యపోహ పడరాదు. ఈ యపోహమునకుఁ బాల్పడి వైదిక దార్శనికు లెందఱో శూన్యతా వాదమును దూషించిరి, నేఁడును అట్టిది సాగుచున్నది. వాస్తవమునకు మాధ్యమికులు పారమార్థికముగా మాత్రమే హేతువు శూన్య మనుచున్నారు.]

## IV. ప్రతిషేధ ప్రతిషేధ్యాభ్యుపగమము వలన నదోషము

మీరు రెండిటియు నిట్లంటిరి :—

ప్రథమమునఁ బ్రతిషేధ మా పైని దాని
విషయ ముండు నన్నను, గాక వీని వ్యత్య
యమ్ము చెప్పికొన్నను సిద్ధి యగుట లేదు;
ఒక్కటతి నున్న స్వాభావ్య మున్న దగును.

ఇక్కడ మేము చెప్పుచున్నాము :—

> మూఁడు కాలాల హేతువు మున్నె సాధ్య
> సమతఁ జేసి ప్రత్యుక్తి విశ్రాంతి మయ్యె;
> ఈ త్రికాల నివర్తక హేతువేని
> యల్ల శూన్యతావాదికే ప్రాప్త మగును. ౬౯

త్రైకాల్యమునందుఁ బ్రతిషేధవాచి యగు ఏ హేతువునకుఁ బ్రత్యుత్తరము చెప్పఁబడినది. ఎట్లు? సాధ్యసమ మగుటవలన. ప్రతిషేధము మూఁడుకాలములందు నుపపన్నము గానిచోఁ బ్రతిషేధ ప్రతిషేధముగూడ నుపపన్నము గాదు. కావున "ప్రతిషేధము ప్రతిషేధ్యము లేనివగుచుండఁగాఁ, బ్రతిషేధను ప్రతిషిద్ధ మగుచున్నది." యను మీ తలంపు యుక్త మగాదు. సర్వభావ స్వభావ ప్రతిషేధము చెప్పుచుండుటవలన శూన్యతావాదులకే త్రికాల ప్రతిషేధ వాచియగు నీ హేతువు ప్రాప్త మగుచున్నది గాని, మీకుఁ బ్రాప్త మగుటలేదు.

లేదా, యిది యిట్లు ప్రత్యుక్త మగుచున్నది :—

> "కించి దర్థ మేని ప్రతిషేధించుచుండ
> లేదు; ప్రతిషేధ్య మర్థమే లేదు మాకుఁ,
> గావునఁ బ్రతిషేధించుచున్నావు నీవ
> టన్న యధిలయ మొండె విన్యస్త మయ్యె."

మీ రిట్లు తలంపవచ్చును. హేతువు పూర్వకాలీనముగాను, ఉత్తర కాలీనముగాను యుగప త్కాలీనము గాను, ఉండి మూఁడు కాలములందును దృష్ట మగుచున్నది. ఎట్లన, తండ్రి పుత్రునకుఁ బూర్వకాలీనుఁడు; శిష్యుఁ డాచార్యునకుఁ బశ్చాత్కాలీనుఁడు; ప్రదీపము ప్రకాశమునకు యుగప త్కాలీనము.

ఇక్కడఁ జెప్పుచున్నాము:—ఇది యిట్లు కాదు. ఈ క్రమమునందుఁ బూర్వోక్త దోషములు మూఁడు గలుగుచున్నవి.

పైఁగా మీరు తలంచు నట్లే యగునేని, ప్రతిషేధ భావము మీచే నంగీకృత మగుచున్నది. దీనివలన మీకుఁ బ్రతిజ్ఞా హాని గలుగుచున్నది. మీఁదు మిక్కిలి స్వభావ ప్రతిషేధము గూడ సిద్ధ మగుచున్నది.

## ల ఘు టీ క

'భూత భవిష్య ద్వర్తమానములందును నివారణమును దెలుపు హేతువు గలుగుట లేదు,' అనుదానికి (హేతు రాహిత్యమునకు) సమాధానము మున్నే చెప్పితిమి.

[న్యాయ వైశేషిక సాంఖ్య దూషణము దూరాపాస్త మైనది. ఈ సమాధానము గ్రహించియో, గ్రహింపకయో హేతు రాహిత్యతా దూషణమును బునశ్చరణము చేసిన, చేయుచున్న మీమాంసకులయు, శాంకరులయు, నవీనులయు, చిల్లఁచదువులు నిర్మూలితము లగుచున్నవి. ఏల యన హేతు వున్న దనుట సాధ్యసమము.]

"ప్రతిషేధము మూఁడు కాలములందు సిద్ధింపదు," అను దూషణమున కాచార్యు లిపుడు ప్రత్యుత్తర మొసఁగుచున్నారు:– అయ్యా! మా ప్రతిషేధమే సిద్ధింప దనుచున్నారు. మా ప్రతిషేధమే సిద్ధింపనపుడు మా ప్రతిషేధమును నివారించుచున్న మీ ప్రతిషేధము మాత్ర మెట్లు సిద్ధించుచున్నది ? కావున మీ వాదము యుక్తము గాదు.

ఈ వాక్యముతోఁ బ్రతిపక్షి దూషణము త్రోసివేయఁబడినదే కాని ప్రతిషేధ మెట్లు సిద్ధించుచున్నదో చెప్పఁబడ లేదు. కావున నిపు డాచార్యులు చెప్పుచున్నారు:–

మేము సర్వభావములు నిఃస్వభావము లని చెప్పుచున్నాము. ప్రతిషేధము గూడ నొక భావమే. కావున నిది నిఃస్వభావము. నిఃస్వభావ మగుటవలన నిది శూన్యము. ఈ యర్థమే 64 వ పద్యమున నిట్లు వివరింపఁ బడినది. "కించి దర్థమును మేము నివారించుట లేదు. నివారింపఁ దగిన యర్థమే మాకు లేదు. 'మీరు ప్రతిషేధించుచున్నారు' అను దూషణమును మాత్రమే మీరు మాయం దారోపించుచున్నారు."

ఈ విధముగా మా ప్రతిషేధము సిద్ధించుచున్నది. ఈ సిద్ధి 'సర్వ భావములు శూన్యములు,' అనువారి మతమునఁ గలుగును గాని, భావము లున్న వనువారి మతమునఁ గలుగదు.

ఇట్లన్నపుడు ప్రతిపక్షి యిట్లు చెప్పవచ్చును. " మా ప్రతిషేధము సిద్ధింపక పోవుట కలుగదు. హేతువు మూఁడుకాలములందును గానఁబడు చున్నది. హేతువు పూర్వ కాలీన మనుటకుఁ దండ్రీ కొడుకుల దృష్టాంతము చాలును. తండ్రి కొడుకునకుఁ బూర్వకాలీనుఁడు. ఆచార్య శిష్యుల దృష్టాంతములో శిష్యుఁడు గురువునకుఁ బశ్చాత్కాలీనుఁడు. ప్రదీప ప్రకాశ దృష్టాంతమునఁ బ్రదీపమునకుఁ బ్రకాశము సమకాలీనము."

ఇట్లు చెప్పుచో వచ్చు దోషముల నాచార్యులు 50, 51 పద్యముల లోను, వాని వ్యాఖ్యానమందును, 35 నుండి 40 వఱకు నున్న పద్యముల లోను, వాని వ్యాఖ్యానమందును జర్చించి యున్నారు. అందుఁ జెప్పిన దోషములు వీనికిఁ గలుగుచున్నవి.

వీనికిఁదోడు "సర్వభావములు శూన్యములు," అను మా ప్రతిషేధ మును బ్రతిషేధించుచో మీరు ప్రతిషేధభావము నంగీకరించుచున్నారు. 'మాట అసత్తు' అను మాటను నివారించుటవలన నేమి కలుగుచున్నదో యదియే యిక్కడను గలుగుచున్నది. మీకుఁ బ్రతిజ్ఞాభంగ మగుచున్నది. పైఁగా మేము చెప్పుచున్న స్వభావ ప్రతిషేధము గూడ సిద్ధమగుచున్నది.

ఎవని కీ శూన్య తోద్భవ మెసఁగుచుండు
వానికి నిఖి లార్థము లుద్భవమ్ము లగును;
ఎవని కీ శూన్య తోద్భవ మెసఁగ కుండు
వానికిం గించి దర్థ ముద్భవము గాదు. ౭౧

ఈ శూన్యత కలుగువానికి లౌకిక లోకోత్తరము లగు సర్వార్థములు గలుగుచున్నవి. కారణ మేమి? శూన్యత గలుగువానికిఁ బ్రతీత్య సముత్పా దము గలుగుచున్నది. ప్రతీత్య సముత్పాదము గలుగువానికి నార్యసత్య ములు నాలుగు గలుగుచున్నవి. ఆర్యసత్యములు నాలుగు కలుగువానికి శ్రామణ్య ఫలములు గలుగుచున్నవి. సర్వ విశేషాధిగమములు నగుచున్నవి.

సర్వవిశేషాధిగమములు గలుగువానికి త్రిరత్నములు-బుద్ధ,ధర్మ,సంఘములు-గలుగుచున్నవి. ప్రతీత్య సముత్పాదము గలుగువానికి ధర్మము, ధర్మహేతువు, ధర్మఫలమును గలుగుచున్నవి; అధర్మము, అధర్మహేతువు, అధర్మఫలమును గలుగుచున్నవి; క్లేశము, క్లేశసముదయము, క్లేశవస్తువులును గలుగుచున్నవి. పూర్వోక్తమగు సర్వము గలుగువానికి సుగతి దుర్గతి వ్యవస్థలందు గతి దుర్గతి గమనము, సుగతి దుర్గతి గామియగు మార్గము, సుగతి దుర్గతి వ్యతిక్రమణము, సుగతి దుర్గతి వ్యతిక్రమోపాయము, లౌకికము లగు సర్వ సంవ్యవహారములు స్వయముగా నధిగంతవ్యము లగును. ఈ దిఙ్మాత్రమునఁ గించిద్వచన ముపదేశింప శక్యమగును.

సార శూన్యతయుఁ బ్రతీత్య సంభవమ్ము
నైక నానార్థ తత్త్వమ్ము వ్యాకరించు
పూజ్య మధ్యమా ప్రతిపత్తు బోధ పఱచి
నట్టి సంబుద్ధు ననుపము నాశ్రయింతు. ౭౨

# విగ్రహవ్యావర్తనీ

## పూర్వపక్షః

1. సర్వేషాం భావానాం సర్వత్ర న విద్యతే స్వభావ శ్చేత్
త్వ ద్వచన మస్వభావం న నివ ర్తయితుం స్వభావ మలమ్.

2. అథ సస్వభావ మేత ద్వాక్యం పూర్వా హతా ప్రతిజ్ఞా తే
వైషమికత్వం తస్మిన్; విశేష హేతుశ్చ వక్తవ్యః.

3. మా శబ్దవ దిత్యేతత్ స్యాత్తే బుద్ధి ర్న చైత దుపపన్నమ్
శబ్దే నాత్ర సతా భవిష్యతో వారణం తస్య.

4. ప్రతిషేధః ప్రతిషేధో౽ప్యేవ మితి మతం భవే త్త దస దేవ,
ఏవం తవ ప్రతిజ్ఞా లక్షణతో దూష్యతే న మమ.

5. ప్రత్యక్షేణ హి తావ ద్య ద్యుపలభ్య వినివ ర్తయసి భావాన్
తన్నాస్తి ప్రత్యక్షం భావా యే నోపలభ్యంతే.

6. అనుమానం ప్రత్యుక్తం ప్రత్యక్షే ణాగ మోపమానే
అనుమా నాగమ సాధ్యా యే౽ర్థా దృష్టాంత సాధ్యాశ్చ.

7. కుశలానాం ధర్మాణాం ధర్మావస్థావిదశ్చ మన్యంతే
కుశలం జనస్వభావం శేషే ష్వ ప్యేష వినియోగః.

8. నైర్యాణి స్వభావో ధర్మో నైర్యాణికా శ్చ యే తేషామ్
ధర్మావ స్థోక్తానా మేవ చ నైర్యాణి కాదీనామ్.

9. యది చ న భవేత్ స్వభావో ధర్మాణాం నిఃస్వభావ ఇత్యేవమ్
నామాపి భవే న్నైవం నామాపి నిర్వస్తుకం నాస్తి.

10. అథ విద్యతే స్వభావః స చ ధర్మాణాం న విద్యతే తస్మాత్
ధర్మై ర్వినా స్వభావః స యస్య[1] త ద్యుక్త ముపదేష్టుమ్.

---

[1] స యస్యాస్తి

11. సత ఏవ ప్రతిషేధో నాస్తి ఘటో గేహ ఇత్యయం యస్మాత్
దృష్టః ప్రతిషేధోఽయం సతః స్వభావస్య తే తస్మాత్.

12. అథ నాస్తి స స్వభావః కిం ను ప్రతిషిధ్యతే త్వయాఽనేన
వచనే న ర్తే వచనా త్ప్రతిషేధః సిధ్యతే హ్యసతః.

13. బాలానా మివ మిథ్యా మృగతృష్ణాయాం యథా జలగ్రాహః
ఏవం మిథ్యా గ్రాహః స్యాత్తే ప్రతిషిధ్యతో హ్యసతః.

14. న న్వేవం స త్యస్తి గ్రాహో గ్రాహ్యం చ తద్గృహీతం చ
ప్రతిషేధః ప్రతిషేధ్యం ప్రతిషేద్ధా చేతి షట్కం తత్.

15. అథ నైవాస్తి గ్రాహో న చ గ్రాహ్యం న చ గ్రహీతారః
ప్రతిషేధః ప్రతిషేధ్యం ప్రతిషేద్ధారోఽస్య తు న సంతి.

16. ప్రతిషేధః ప్రతిషేధ్యం ప్రతిషేద్ధార శ్చ య ద్యుత న సంతి
సిద్ధాహి సర్వ భావా యేషా మేవం స్వభావ శ్చ.

17. హేతో స్తతో న సిద్ధిః నైఃస్వాభావ్యా త్కుతో హి తే హేతుః
నిర్హేతుకస్య సిద్ధి ర్న చోపపన్నాస్య తేఽర్థస్య.

18. యది చాహేతోః సిద్ధిః స్వభావ వినివర్తనస్య తే భవతి
స్వాభావ్య స్యాస్తిత్వం మమాపి నిర్హేతుకం సిద్ధమ్.

19. అథ హేతో రస్తిత్వం భావ [1]నైఃస్వాభావ్యం నోపపన్నమ్
లోకే నైఃస్వాభావ్యా న్న హి కశ్చన విద్యతే భావః.

20. పూర్వం చే త్ప్రతిషేధః పశ్చా త్ప్రతిషే ధ్య మిత్యనుపపన్నమ్
పశ్చా చ్చానుపపన్నో యుగపచ్చ యతః స్వభావోఽసన్.'

## ఉత్తరపక్షః

21. హేతు ప్రత్యయ సామగ్ర్యాం పృథగ్భావేఽపి మద్వచో న యది
నను శూన్యత్వం సిద్ధం భావానా మస్వభావత్వాత్.

[1] నైఃస్వాభావ్య మిత్యనుపపన్నమ్

22. యశ్చ ప్రతీత్య భావో భావానాం శూన్యతేతి సా హ్యుక్తా
ప్రతీత్య యశ్చ భావో భవతి హి త స్యాస్వభావత్వమ్.

23. నిర్మితకో నిర్మితకం మాయా పురుషః స్వ మాయయా సృష్టమ్
ప్రతిషేధయతే యద్వ త్ప్రతిషేధోఽయం తథైవ స్యాత్.

24. న స్వాభావిక మేత ద్వాక్యం తస్మా న్న వాదహాని ర్మే
నాస్తి చ వైషమికత్వం విశేష హేతుశ్చ న నిగాద్యః.

25. మా శబ్దవ దితి నాయం దృష్టాంతో య స్త్వయా సమారబ్ధః
శబ్దేన హ్యత్ర సతా భవిష్యతో వారణం తస్య.

26. నైఃస్వాభావ్యానాం చే న్నైఃస్వాభావ్యేన వారణం యది హి
నైఃస్వాభావ్య నివృత్తౌ స్వాభావ్యం హి ప్రసిద్ధం స్యాత్.

27. అథవా నిర్మిత కాయాం యథా స్త్రియాం స్త్రీయ మిత్య సంగ్రాహమ్
నిర్మితకః ప్రతిహన్యా త్కస్యచి దేవం భవే దేతత్.

28. అథవా సాధ్యసమోఽయం హేతు ర్న హి విద్యతే ధ్వనేః సత్తా
సంవ్యవహారం చ వయం నానభ్యుపగమ్య కథయామః.

29. యది కాచన ప్రతిజ్ఞా స్యా న్మే తత ఏవ మే భవే ద్దోషః
నాస్తి చ మమ ప్రతిజ్ఞా తస్మా న్నైవాస్తి మే దోషః.

30. యది కించి దుపలభేయం ప్రవర్తయేయం నివర్తయేయం వా
ప్రత్యక్షాదిభి రర్థై స్తదభావా న్మేఽనుపాలంభః.

31. యది చ ప్రమాణత స్తే తేషాం తేషాం ప్రసిద్ధి రర్థానామ్
తేషాం పునః ప్రసిద్ధిం బ్రూహి కథం తే ప్రమాణానామ్.

32. అన్యై ర్యది ప్రమాణైః ప్రమాణసిద్ధి ర్భవ త్యనవస్థా
నాదేః సిద్ధి స్తత్రాస్తి నైవ మధ్యస్య నాంతస్య.

33. తేషా మథ ప్రమాణై ర్వినా ప్రసిద్ధిః విహీయతే వాదః
వైషమికత్వం తస్మిన్ విశేష హేతుశ్చ వక్తవ్యః.

34. ద్యోతయతి స్వాత్మానం యథా హుతాశః తథా పరాత్మానమ్
స్వపరాత్మానా వేవం ప్రసాధయంతి ప్రమాణాని.

35. విషమోపన్యా సోఽయం న హ్యాత్మానం ప్రకాశయ త్యగ్నిః
న హి త స్యానుపలబ్ధిః దృష్టా తమ సీవ కుంభస్య.

36. యది చ స్వాత్మాన మయం త్వద్వచ నేన ప్రకాశయ త్యగ్నిః
పర మివ న త్వాత్మానం పరిధక్ష్య త్యపి హుతాశః.

37. యది చ స్వపరాత్మానౌ త్వ ద్వచ నేన ప్రకాశయ త్యగ్నిః
ప్రచ్ఛాదయిష్యతి తమః స్వపరాత్మానౌ హుతాశ ఇవ.

38. నాస్తి తమశ్చ జ్వలనే యత్ర చ తిష్ఠతి సదాత్మని జ్వలనః
కురుతే కథం ప్రకాశం సహి ప్రకాశోఽంధకారవధః.

39. ఉత్పద్యమాన ఏవ ప్రకాశయ త్యగ్ని రి త్యసద్వాదః
ఉత్పద్యమాన ఏవ ప్రాప్నోతి తమో నహి హుతాశః.

40. అప్రాప్తోఽపి జ్వలనో యది వా పునరంధకార ముపహన్యాత్
సర్వేషు లోకధాతుషు తమోఽయ మిహ సంస్థిత ఉపహన్యాత్.

41. యది చ స్వతః ప్రమాణసిద్ధి రనపేక్ష్య తే ప్రమేయాణి
భవతి ప్రమాణసిద్ధిః న పరాపేక్షాత్మసిద్ధి రితి.

42. అనపేక్ష్య హి ప్రమేయా నర్థాన్ యది తే ప్రమాణసిద్ధి ర్భవతి
న భవంతి కస్యచి దేవ హీమాని ప్రమాణాని.

43. అథ మత మపేక్ష్య సిద్ధిః తేషా మిత్య[1]త్ర కో దోషః
సిద్ధస్య సాధనం స్యా న్నాసిద్ధోఽపేక్షతే హ్యన్యత్.

44. సిధ్యంతి హి ప్రమేయా ణ్యపేక్ష్య యది సర్వథా ప్రమాణాని
భవతి ప్రమేయసిద్ధి రనపే క్ష్యైవ భవతి ప్రమాణాని.

---

[1]మితి అభవతోకో దోషః

45. యది చ ప్రమేయసిద్ధి రనపేక్ష్యైవ భవతి ప్రమాణాని
కిం తే ప్రమాణసిద్ధ్యా తాని య దర్థం ప్రసిద్ధం తత్.

46. అథ తు ప్రమాణసిద్ధి ర్భవ త్యపేక్ష్యైవ తే ప్రమేయాణి
వ్యత్యయ ఏవం సతి తే ధ్రువం ప్రమాణ ప్రమేయాణామ్.

47. అథ తే ప్రమాణసిద్ధ్యా ప్రమేయసిద్ధిః, ప్రమేయసిద్ధ్యా చ
భవతి ప్రమాణసిద్ధిః, నా స్త్యుభయ స్యాపి తే సిద్ధిః.

48. సిద్ధ్యంతి హి ప్రమాణై ర్యది ప్రమేయాణి తాని తై రేవ
సాధ్యాని చ ప్రమేయై స్తాని కథం సాధయిష్యంతి?

49. సిద్ధ్యంతి చ ప్రమేయై ర్యది ప్రమాణాని తాని తై రేవ
సాధ్యాని చ ప్రమేయైః తాని కథం సాధయిష్యంతి ?

50. పిత్రా య ద్యుత్పాద్యః పుత్రో యది తేన చైవ పుత్రేణ
ఉత్పాద్యః స యది పితా వద త త్రోత్పాదయతి కః కమ్.

51. కశ్చ పితా, కః పుత్రః ? [1]తత్ర త్వం బ్రూహి తా వుభావపి చ
పితా పుత్ర లక్ష్మధరా యత స్తతో నోత్ర సందేహః.

52. నైవ స్వతః ప్రసిద్ధి ర్న [2]పరస్పర తోఽన్యప్రమాణై ర్వా
భవతి న చ ప్రమేయైః [3]న చాప్య కస్మాత్ప్రమాణానామ్.

53. కుశలానాం ధర్మాణాం ధర్మావస్థావిదో బ్రువతే చ యత్
కుశలస్వభావ మేవం ప్రవిభాగే నాభిధేయః స్యాత్.

54. యదిచ ప్రతీత్య కుశలః స్వభావ ఉత్పద్యతే స కుశలానాం
ధర్మాణాం పరభావః స్వభావ ఏవ కథం భవతి ?

---

[1]తత్రత్వం బ్రూహి కథం తా వుభా వపి చ పితాపుత్ర లక్షణధరా
తతో నోఽత్ర సందేహః. [2]న పరస్పరతః ప్రమాణైర్వా. [3]న చాప్య
కారణం భవతి.

55. అథ న ప్రతీత్య కించి త్స్వభావ ఉత్పద్యతే స కుశలానాం
ధర్మాణా మేవం స్యా ద్వాసో న బ్రహ్మచర్యస్య.

56. నాధర్మో ధర్మో వా సంవ్యవహారా శ్చ లౌకికా న స్యుః
నిత్యాశ్చ సర్వభావాః స్యుః నిత్యత్వా దహేతుమతః.

57. ఏవ చాకుశలే ష్వవ్యాకృతేషు నైర్యాణాదిషు చ దోషః
తస్మా త్సర్వం సంస్కృత మసంస్కృతం తే భవ త్యేవమ్.

58. యః సద్భూతం నామ బ్రూయా త్సస్వభావ ఇ త్యేవం (స ?)
భవతా ప్రతివక్తవ్యో, నామ బ్రూమశ్చ న వయం సత్.

59. [1]నామాసదితి చ య దిదం తత్కిం ను సతో భవ త్యుతా సతః ?
యది హి సతో య ద్యసతో ద్విధాపి తే హీయతే వాదః.

60. సర్వేషాం భావానాం శూన్యత్వం చోపపాదితం పూర్వమ్
స ఉపాలంభః [2]తస్మా ద్భవ త్యయం చాప్రతిజ్ఞాయాః.

61. అథ విద్యతే స్వభావః స చ ధర్మాణాం న విద్యత ఇతి
ఇద మాశంకితం య దుక్తం భవ త్యనాశంకితం తచ్చ.

62. సత ఏవ ప్రతిషేధో యది శూన్యత్వం న్వప్రతిషిద్ధ మిదమ్
ప్రతిషేధయతే హి భవా న్భావానాం నిఃస్వభావత్వమ్.

63. ప్రతిషేధయ సేఽథ త్వం శూన్యత్వం తచ్చ నాస్తి శూన్యత్వమ్
ప్రతిషేధః సత ఇతి[3] తే న న్వేవం విహీయతే వాదః.

64. ప్రతిషేధయామి నాహం కించి త్ప్రతిషేధ్య మస్తి న చ కించిత్
తస్మా త్ప్రతిషేధయ సీత్యధిలయ ఏవ త్వయా క్రియతే.

---

[1]నామాసది న [2]తస్మా త్ప్రతిజ్ఞాఽభావేఽప్యుపాలంభో యోఽస్తి. [3]ఇతి నను స హీయతే వాదః

65. య చ్చాహం తే వచనా దసతః ప్రతిషేధవచనసిద్ధి రితి
అత్ర జ్ఞాపయతే వా గస దితి తన్న ప్రతినిహంతి.

65. మృగతృష్ణా దృష్టాంతే యః పునరుక్త స్త్వయా మహాంశ్చర్చః
తత్రాపి నిర్ణయం శ్రుణు యథా స దృష్టాంత ఉపపన్నః.

67. స యది స్వభావతః స్యా ద్గ్రాహో న స్యా త్ప్రతీత్య సంభూతః
యశ్చ ప్రతీత్య భవతి గ్రాహో నను శూన్యతా సైవ.

68. యది చ స్వభావతః స్యాద్గ్రాహః క స్తం నివర్తయే ద్గ్రాహమ్
శేషే ష్వప్యేష విధిః [1]తస్మా ద్దోషోఽనుపాలంభః.

69. ఏతేన హేత్వభావః ప్రత్యుక్తః పూర్వ [2]మేవ స సమత్వాత్
మృగతృష్ణా దృష్టాంత వ్యావృత్తి [3]విధా య ఉక్తః ప్రాక్.

70. య స్త్రైకాల్యే హేతుః ప్రత్యుక్తః పూర్వ మేవ స సమత్వాత్
త్రైకాల్య ప్రతిహేతుశ్చ శూన్యతా వాదినాం ప్రాప్తః.

71. ప్రభవతి చ శూన్య తేయం యస్య ప్రభవంతి తస్య సర్వార్థాః
ప్రభవతి న తస్య[5] కించి న్నభవతి శూన్యతా యస్యేతి.

72. యః శూన్యతాం ప్రతీత్య సముత్పాదం [4]మధ్యమా మనేకార్థామ్
నిజగాద ప్రణమామి తమప్రతిమం సంబుద్ధ మితి.

ఇతి శ్రీబోధిస త్త్వాచార్య నాగార్జున పాదానాం

విగ్రహవ్యావర్తనీ కారికా

సమాప్తా

---

[1]తస్మా దనుపాలంభః [2]సాధ్యసమత్వాత్ [3]సిద్ధా [4]కిన్న భవతి
[5]మధ్యమాం ప్రతిపద మ[illegible]కారమ్, మధ్యమాం పద మ[illegible]రామ్.